



ముఖచిత్రం : ఆశాదీప్తులు

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 12-00

దీపావళి ప్రత్యేకసంచికతో రు. 17-00

యువ వడపళని మద్రాసు - 26.




సంపాదకులకు అభివందనములు.

అక్టోబర్ నెల "యువ" సంచిక బాగుంది. "కార్టూన్స్" కడుపుబ్బ నవ్వించాయి. వడ్డాది పాపయ్యగారి చిత్రాలు ఆకర్షణీయంగా ఉన్నాయి. శరత్‌గారి "తోడికోడళ్ళు" "జాకీ సలాం" "మళ్ళీ ఎప్పటికి" కథలు చాలా బాగున్నాయి. వై. సులోచనారాణిగారి "మీనా" (సీరియల్) బాగా సాగుతోంది.

—లతీఫొద్దీన్ అహమద్, సుల్తానాబాద్.

ఆర్యా !

అక్టోబర్ మాసపు 'యువ' చదివాను. అమూల్యమైన 'సంపాదకీయం' మొదట మమ్ముల నెంతో ఆకర్షించినది. నోట్లను చూపిస్తూ ఓట్లను కొనే రాజకీయ దురంధరుల కొంతమంది మన స్తత్వాలను గూర్చి రచయిత 'కారుమబ్బులు'లో చిన్నగా వివరించినా కథ వన్నెగా వుంది లెండి. ఇంకా శరత్‌బాబు గారి "తోడికోడళ్ళు" కథ గూడా ఫర్వాలేదు.

అభివందనములతో—

కన్నోజు లక్ష్మీకాంతము,

(హుస్నాబాద్)

ఆర్యా !

అక్టోబరు 'యువ' చదివాను. ముఖ్యంగా ఎడిటర్ వ్యాసం నాకు బాగా నచ్చింది. బియ్యం ధరలను గూర్చి రాష్ట్రాలవారీగా పట్టీనిస్తూ చాల చక్కగా వివరించారు. ఇంత విమర్శనాత్మకంగా సందేశాన్నందించిన మీరు ఎంతైనా అభినందనీయులు.

కె. వి. నాగేశ్వరరావునాయుడు.

నార్త్ రాజుపాళెం.

అక్టోబర్ "యువ" చాలా బాగుంది. "జాకీ సలాం" "మళ్ళీ ఎప్పటికి" కథలు యువ కెంతో వన్నె తెచ్చాయి. "మీనా" సీరియల్ కాస్త ఎక్కువగా వేస్తే యువ ఎంతో బాగుంటుంది. వెల పెంచినను ఏమీ ఫర్వాలేదు.

—పి. గిరిజ, నాగిరెడ్డిపల్లె

అక్టోబరు యువ ముఖ చిత్రం "జయ మహా విజయ" చూడ ముచ్చటగా యున్నది. ముఖ చిత్రకారుడు వడ్డాది పాపయ్యగారికి నా ధన్యవాదాలు. ముఖ్యంగా రచనలలో శరత్‌బాబు వ్రాసిన "తోడికోడళ్ళు", తలారి లీలాలక్ష్మిగారు వ్రాసిన "కారుమబ్బులు" సుచరిత గారు వ్రాసిన "మళ్ళీఎప్పటికి?" చదువుటకుచాలా యింటరెస్టుగా యున్నవి. రచయితలకు నా అభివందనములు.

—కరణం నాగేశ్వరరావు, యలమంచిలి.

———

# యువ

సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు చక్రపాణి

సంపుటి 21 నవంబర్—1970 సంచిక 11


భూసంస్కరణలు అనే పేరుతో, భూమి యజమానిత్వంలో విపరీతమైన మార్పులు తెచ్చిపెట్టాలని, ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి ఇటీవల కొన్నాళ్ళుగా తీవ్రమైన ప్రయత్నం చేస్తూవచ్చారు. ఆమె తలపెట్టిన మార్పులుగాని, సూచించిన మార్పులుగాని, ఆమెకు సలహా యిచ్చినవారు ఎవరైనప్పటికీ, ఎంతమాత్రమూ ఆచరణ సాధ్యమైన మార్పులు కాకపోవడమే కాకుండా, కొన్ని కోట్ల సంసారాలను దౌర్భాగ్య స్థితిలో ముంచేవిగా వున్నాయి.

శ్రీమతి ఇందిరాగాంధి, పట్టణవాసి. గ్రామీణప్రజల నిత్యజీవితాన్ని గురించి గాని, వ్యవసాయదారుల సాధక బాధకాలను గురించిగాని ఆమెకు అనుభవైకవేద్య మైన జ్ఞానం ఏమీలేదనే అనుకోవాలి. ఏమంటే, ఈ విషయాలను పూర్తిగా అర్థం చేసుకోవాలన్నా, వాటిలో ఏమైనా లోపాలువుంటే ఆ లోపాలను తెలుసుకోవాలన్నా, ఏ వ్యక్తి అయినా స్వయంగా వ్యవసాయం చేస్తున్నవాడైనా అవాలి; లేదా అధమం రెండు సంవత్సరాలైనా గ్రామాలలో నివాసం ఏర్పరచుకొని, స్వయంగా వ్యవసాయం చేసే వ్యక్తితో సమానంగా వ్యవసాయ కార్యకలాపాలను అతి శ్రద్ధగా పరిశీలించినవాడైనా అయి వుండాలి. అంతేగాని, రాజకీయ ప్రయోజనాల కోసం గ్రామీణజీవితాలలో విప్లవం తీసుకు రావడంకోసం కాగితాలమీద నివేదికలను, సలహాలను ఇచ్చే రాజకీయ స్వార్థపరుల సల

హాలమీద ఆధారపడి, కాగితాలమీద నిర్ణయాలను, ఉత్తరువులను చెయ్యడం, దేశాన్ని బాగుచేసే విధానం కాజాలదు.

వ్యవసాయం బాగా జరిగి, ఆహార ధాన్యాల పంటలు బాగా వుండాలంటే రైతుకు తన భూమిమీద అభిమానమూ, తన కృషిపట్ల శ్రద్ధా వుండాలి. అలా అయితేనే అతడు తన కృషిని ఫలదాయకంగా సాగించగలడు. వ్యాపారస్తుడు తన వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడం కోసం ఆ వ్యాపారాన్ని ఎలా విస్తరింప చేసుకోవాలని ప్రయత్నిస్తాడో, రైతు కూడా అలాగే తన కృషికి క్షేత్రమైన భూమిని అభివృద్ధి పరచుకోవడంతోపాటు విస్తరింప చేసుకోవాలని ఆశిస్తాడు. ఇలాటి కోరికను ఒక నేరంగానూ, సంఘ వ్యతిరేక చర్యగానూ భావించడం సబబు కాదు. అయినప్పటికీ అధునాతన రాజకీయ సూత్రాల నిర్వచనలవల్లనేమి, స్వయంగా వ్యవసాయం సాగించుకోవడానికి మించిన భూమిని ఎవరూ కలిగివుండరాదనే భావంవల్లనేమి, దేశం అంతటా అన్ని రాష్ట్రాలలోనూ ఏ వ్యక్తి అయినా ఇంతకు మించిన భూమిని కలిగివుండరాదనే విధానం ఒకటి అమలులోకి తేవడం జరిగింది. కొన్ని రాష్ట్రాలలో ఈ విధానం పూర్తిగా అమలు జరుపబడింది; కొన్ని రాష్ట్రాలలో అమలు జరుపబడుతూవుంది.

ఇలా వుండగా, ఇప్పుడు హఠాత్తుగా మార్పులు తెచ్చిపెట్టి, ఒక వ్యక్తి తాను కలిగివుండదగిన భూమి పరిమితిని పూర్తిగా మార్చివేసి, ఒక కుటుంబం, ఏ పదిహేను ఎకరాలో మాత్రమే కలిగివుండవచ్చును, అంతకుమించిన భూమిని కలిగివుండరాదని నిర్ణయం చెయ్యాలనీ, ఆ నిర్ణయాన్ని వెంటనే అమలు జరుపాలనీ ప్రధానమంత్రి పట్టుదలగా సూచించడం ఇటీవల జరిగింది.

అయితే, వాస్తవ పరిస్థితులను బాగా ఎరిగివున్న రాష్ట్ర ముఖ్య మంత్రులు, ప్రధానమంత్రి సూచనకు ఎంతమాత్రమూ అంగీకరించకపోవడం చాలా సంతోషించవలసిన విషయం. ఈ విషయంలో చాలా గట్టిగా వాదించి, ప్రస్తుతం అమలులో వున్న భూస్వామిత్వాన్ని భంగపరచి కొత్త పద్ధతులను ప్రవేశపెట్టినట్లయితే రాష్ట్రంలోని లక్షల కుటుంబాల సాంఘిక, ఆర్థిక జీవన ప్రమాణం ఘోరంగా దెబ్బతినడమేకాక, రాజకీయంగా కూడ విపరీత పరిణామాలు ఏర్పడుతాయని వాదించిన, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి అభినందనీయులు.

ఆంధ్రప్రదేశ్‌లో యీనాడు అమలులోవున్న గరిష్ఠ పరిమితి ప్రకారం భూమివున్న కుటుంబాలు చాలా తక్కువ. ఆ కుటుంబాలుకూడా, పట్టణాలలో నెలకు అయిదారు వందల రూపాయల జీతాలు తెచ్చుకుంటున్న బ్యాంకి గుమాస్తాల ఆదాయం కంటె ఎక్కువ ఆదాయాన్ని అనుభవించడంలేదు. పట్టణాలలో వుద్యోగాలూ, వ్యాపారాలూ చేసే వ్యక్తుల జీవితాలకూ, గ్రామాలలో వ్యవసాయం చేసుకొనే వ్యక్తుల జీవితాలకూ ఎంతో తేడావుంది. రైతుకు ఎండలేదు; వానలేదు. పగలులేదు; రాత్రిలేదు; చలికీ, వడగాలికీ, వానకీ, వరదకీ శరీరాన్ని అప్పజెప్పి పొలం పనులు చూసుకోవలసిందే. పొలానికి సకాలంలో నీరు

కావాలన్నా తగినంతగా రసాయన ఎరువులు కావాలన్నా, లంచాలు పెట్టవలసిందే. పిల్లలకు కాస్త పెద్ద చదువులు చెప్పించుకుందామంటే, వాళ్ళను పట్టణాలకు పంపి హాస్టల్సుకో, హోటళ్ళకో డబ్బు పొయ్యవలసిందే. పట్టణాలలో దొరికే అనేక వస్తువులు పల్లెటూళ్ళలో దొరకవు; ఒకవేళ దొరికినా, వాటి ఖరీదులు ఎక్కువ. నెలకు అయిదారువందల రూపాయల ఆదాయం, వ్యవసాయం ద్వారా వచ్చినా, ఆ రైతు కుటుంబంవారు,' అదే ఆదాయంతో పట్టణంలోని ఉద్యోగిగానీ, వ్యాపారస్తుడుగానీ అనుభవించే సౌకర్యాలను అనుభవించలేకుండా వున్నారు.

ఇవన్నీ ఇలా వుండగా, రైతు పండించే పంటకు ధరను ప్రభుత్వం నిర్ణయిస్తున్నది. ఆ ధర ప్రకారం, తమ ధాన్యాన్ని ప్రభుత్వానికి స్వాధీనపరుస్తున్న రైతులు ఎంతో మందికి, పొలంమీద తాము పెట్టుబడి పెట్టిన డబ్బుకీ, వ్యవసాయంలో తాము చేసిన పనికీ తగిన ప్రతిఫలం ఉండటంలేదు. అయినా, మిగిలిన దానితోనే తృప్తిపడి పట్టణాలలోని మధ్య తరగతి కుటుంబీకుల కంటె చాలా తక్కువ స్థాయిలో జీవితాలను గడుపుతున్న రైతుకుటుంబాలు ఎన్నోవున్నాయి.

ఇలాటి సామాన్య సంసారులు, మరుసటి ఏడో, ఆ మరుసటి ఏడో అతివృష్టివల్లగాని, అనావృష్టివల్లగాని తమ పంటలు దెబ్బతిన్నాయంటే, అప్పుల పాలవుతున్నారు. రైతుకుటుంబం ఒకసారి అప్పుల పాలయిందంటే, బయటపడడం కొద్దోగొప్పో పొలాన్ని అమ్మితే తప్ప సాధారణంగా వీలుపడదు.

దేశంలో జనాభా పెరిగిపోయి, నిరుద్యోగుల సంఖ్య చాలా ఎక్కువ అవుతున్నది. ఆ నిరుద్యోగులకు వ్యాపకం చూపించడానికి, దేశంలో నిర్మాణ కార్యక్రమాలు, చిన్న చిన్న పరిశ్రమలు ఏర్పాటు చెయ్యాలి. ఇకముందు నిరుద్యోగులు ఎక్కువ కాకుండా వృత్తి విద్యతోకూడిన విద్యావిధానాన్ని అమలులోకి తేవాలి.

అంతేగాని, తగు మాత్రంగా భూమిని కలిగివున్నవారి భూమిని మరీ తగ్గించి, వారిని భ్రష్టుల్ని చెయ్యడంతోపాటు, వ్యవసాయం అంటే ఏమిటో అనుభవంలేని వారికీ, వ్యవసాయానికి కావలసిన పెట్టుబడిలేని వారికీ భూమిని ఇచ్చినందువల్ల ఆహారధాన్యాల వుత్పత్తి దెబ్బతినడం కూడా జరుగుతుంది.

ఆచరణ సాధ్యంకాని ఆలోచనలకు స్వస్తిచెప్పి, ఇప్పుడు అమలులోవున్న భూసంస్కరణలతో తృప్తిపడి, ప్రజలకూ, దేశానికీ ప్రయోజనకరమైన ఇతర విధానాలను గురించి ప్రధానమంత్రి ఆలోచించడం మంచిది. ఈ విషయంలో, నిర్మొహమాటంగా వాస్తవికతను ప్రధానమంత్రికి వివరించిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిని మరొకసారి అభినందిస్తున్నాము.



# నిన్ను పెళ్ళాడతా! కట్నం వెంతిస్తారు?

"నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను."

"....నిజంగానా?"

"పెళ్ళి కూడా చేసుకుంటాను."

"నే నెంత అదృష్టవంతురాల్ని—అందరూ నన్ను నల్లపిల్ల....నల్లదీ అంటూంటే ఈ జన్మంలో నా కిక కల్యాణ యోగం లేదని యెంతగా కుమిలిపోయానో?"

"నలుపులోని నాణ్యత తెలియని వెర్రి నాగమ్మ లెవరో ఆ మాటలని ఉంటారు. నలుపులో వున్న అందం ఎందులోవుంది?"

"మీరైనా నిజాన్ని అర్థం చేసుకున్నారు."

"చూడు ఒకటి చెప్తాను. ఈ 'నలుపు'ను అసహ్యించుకుంటూ తెల్లని పెళ్ళాలే కావాలనేవాళ్ళున్నారు చూశావ్! వాళ్ళని యేం చేసినా పాపం లేదంటాను. శరీరం రంగు మాత్రమే తెలుపు కావాలనుకొనేవాళ్ళు 'నల్లటి జుత్తును' మాత్రం ఎలా సహిస్తారో? అది మాత్రం నల్లగా ఉండాలి. ఒక్క వెంట్రుక నెరసినా శరీరం తెలుపు కిచ్చిన విలువ దానికివ్వరు."

"ఎంతబాగా చెప్పారు."

"నాకు నలుపన్నా ఆ రంగులో వున్న నువ్వన్నా యెంతో యిష్టం."

"నా జీవితం ధన్యమైంది ఇన్నాళ్ళకు.'

"మన జీవితాలు యిలాగే ఆదర్శవంతంగా హాయిగా గడిచిపోతాయనే నమ్మకంతో నీతో యింతచనువు యేర్పరచుకున్నాను. ఒకరి అభిరుచులు యింకొకరం పూర్తిగా అర్థంచేసుకున్నాం కనుక మన కే ఒడిదుడుకులు వుండవనే నా నమ్మకం."

"మీలాటి వారు నాకు భర్తగా లభించటం నా పూర్వపుణ్యావిశేషం."

"నాదీ అదృష్టమే. నీ లాటి భార్య నాకు లభించబోవటం."

"ఏమండీ! మన విషయం నాన్నతో మాట్లాడరాదూ?"

"మన విషయం మాట్లాడడానికి మా నాన్న నెలానూ పంపుతాను. ఎందుకంటావేమో—పెళ్ళన్నాక సరదాలు....సంప్రదాయాలంటూ వుంటాయిగా."

"అంటే?"

"అదే కట్నవనీ—కానుకనీ—అందులోనూ మా నాన్న ఉన్నాడు చూశావ్! కాస్త చండశాసనుడు. నీ నలుపు చూసి మరో పదివేలు ఎక్కువే అడుగుతాడు గూడా."

"ఇచ్చుకోలేకపోతే?"

"మా నాన్నమాటను కాదనే ధైర్యం నాకు లేదు. పైగా అడిగిన కట్నం యివ్వలేకపోతే నీలాటి నల్లపిల్లని ఎవరు పెళ్ళి చేసుకుంటారు!"

—"కామెట్"




"అరే అబ్బాయీ, చూడబోతే నువ్వేం స్థితిపరుడవు కావు. ఇంత చదువు చదివి ఏం చేదామని? పొట్ట పోసుకోవటానికే అయితే, ఈ చదివింది చాలదూ?—ఇలా చదివి చదివి చివరికి మీ నాయనలాగ తయారయేటట్టున్నావే!—ఆయనగారు, వంధ్యోపాధ్యాయుడు—ఏం చేసేవాడో తెలుసా? చదివి చదివి, ఆఖరికి ఇంట్లో ఓమూల తల ఆడిస్తూ కూర్చునేవాడు. అలానే వుందే, నీ సంగతి చూస్తే? ఇప్పుడున్న ఈ కాస్త

ఆశాకూడా నిలిచేటట్టు కనబడదే'—అంటూ మధుసూదన ముఖోపాధ్యాయులు అప్పు డప్పుడు మేనల్లుణ్ని హెచ్చరిస్తూ ఉండేవాడు.

మేనమామ ఒక్కడే కాదు. కాశీనాథుడి చదువూ ధోరణీ చూస్తూన్న లోకులు కూడా ఆ అబ్బాయిని గురించి అనేక సంశయాలు పెట్టుకునేవారు.

తెల్లవారు ఝామునే నాలుగ్గంటలకల్లా లేవడం, స్నాన సంధ్యాదులు ముగించి పూజా పునస్కారాలు పూర్తి చేసుకోవడం, పిలకముడి వేసుకొని ధనంజయభట్టాచార్య పండితులువారి పాఠశాల వరండాలో కూర్చోవడం, తదేక ధ్యానంతో దర్శనశాస్త్ర సూత్రాలూ, భాష్యాలూ, వల్లిస్తూండటం-ఇదే ఆ పిల్లవాడు కాశీనాథుడి కార్యక్రమం. ఇలా వల్లించడంలో తన్మయుడై అతను బయట ప్రపంచమే మరిచిపోయేవాడు. పోతే- వంధ్యోపాధ్యాయుల దర్శనశాస్త్రం ఒక మహారణ్యం, అందులో ప్రవేశించేసరికి కాశీ నాథుడు పూర్తిగా దిగ్భ్రాంతుడై పోయేవాడు.

ఈ స్థితిలో అతన్ని చూసిన లోకులు రకరకాలుగా చెప్పుకొనేవాళ్ళు. తండ్రిలాగా గొప్ప విద్వాంసుడవుతాడని అనుకొనేవారు కొందరు. ఏడిశాడు, విద్వాంసుడేమిటి? ఇలాగే చదివి చదివి పిచ్చివాడై పోతాడని సంశయించే వారు మరి కొంతమంది. అలా శంకించి హెచ్చరించే వాళ్ళలో ముఖ్యుడు పిల్లవాడి మేనమామ అని మనకి తెలియనే తెలుసు.

అయితే, మేనమామ హెచ్చరిక కాశీనాథు డేమంత పట్టించుకునేవాడు కాదు. ఆ చెవిని విని ఈ చెవిని వదిలేసేవాడు.

ఇహ ఇంట్లో—

ఈ చదువు పిచ్చిగా మారుతుందనే భయంతో మామ అదపా దడపా అదమాయి స్తుండడం ఒక వంక. ఇంటో పని పాటులకు కాస్తంతా ఆసరాకాదని అత్త సాధింపు ఒక వంక. ఇతడి కంటె వయసులో పెద్ద అయిన మేనమామ కొడు కొకడున్నాడు — హరి. వాడు ఇతడ్ని అస్తమానం 'వ్యాకరణ సాహిత్యాల్లో పుట్టిన జంతువ' అంటూ ఎగతాళి చెయ్యడం. ఏమైనా కానీ— ఇవేవీ లెక్కచెయ్యక, కాశీనాథుడు గుండె నిబ్బ రంతో ఉండేవాడు.

ఎవరేం చేసుకున్నా అతని కార్యక్రమం నిరాటంకంగా సాగిపోవలిసిందే—సాయం కాలం ఇష్టం వచ్చినట్టూ తోటల్లో తిరగడం, లేదా—ఏటి ఒడ్డున పెద్ద మర్రిచెట్టు కింద కూచుంటే కనబడే అస్తమయ సూర్యుడి అరుణకాంతులు ఆకాశంలో ఎలా లీనమవు తున్నాయో, ఆ దృశ్యాలు చూచి ఆనందించడం. ఒక్కొకప్పుడు జమీందారుగారి ఈశ్వ రాలయానికి వెళ్ళి, అర్ధనిమీలిత నేత్రాలతో స్వామిని ధ్యానిస్తుండటం. అదీ గాకుంటే-

మామగారి చండీ మండపం మీద, చీకట్లో, చిన్న గొంగళీ ఒకటి పర్చుకుని మౌనంగా ఉండటం—ఇలాటివన్నీ కాశీనాధుడి కార్యక్రమంలో జరిగే కలాపాలు.

ఇవి తప్పితే అతడి కీ లోకంలో మరో పనిలేదు. ఉద్దేశంలేదు. ఏదీ కోరిక లేదు.

పన్నెండేళ్ళప్పుడే కాశీనాధుడి తండ్రి కాలం చేశాడు, అప్పటినుంచీ మేనమామ గారింటోనే పెరుగుతున్నాడు. మామ ఇంట్లో ఇలానే రెండు పూటలా పుష్టిగా భోం చేసుకుని, విదిలింపులూ అదిలింపులూ తినుకుంటూ మొండిగా జీవితమంతా గడిపేదా మనా, అతడి ఉద్దేశం?—

లేకపోతే యేవిఁటి?—ఆ వయస్సు కుర్రవాడికి కొంచెమైనా ఇంగిత జ్ఞానం ఉండొద్దూ?—ఇదివరకేం చేశాం? ఇప్పుడేం చేస్తున్నాం, ఇకముందు ఏం చెయ్యాలి అనే ఆలోచనైనా మనసుకి తట్టొద్దూ?—

ఇదేం లేదు, ఏకోశానాలేదు. ఉత్త బడుద్ధాయ్. ఎక్కడికైనా పోయి ఏదైనా పని కోసం ప్రయత్నిద్దామా? అనుకోడు. ఇప్పుడున్న చీకటి కూపంలోనించి బయటపడి వెలుగులోకి వెళదామనే ఆరాటం లేదు.

దయదలిచి, ఇరుగు పొరుగు లెవరైనా పిలిచి చెబుతుంటారు! 'నాయనా, కాశీనాద్! ఎల్లకాలం ఇలా గడవ దెవరికిన్నీ. నీకూ అంతే సుమా. ఏదైనా పని చూసుకో. చేసుకో. కాలం వృథా చెయ్యకు' అని. సమాధాన మిస్తేగా?—

అయినా, కాశీనాధుడికి కాలం గడిచిపోతూనే వుంది.

## 2

ప్రియనాధబాబు ఆ వూరి జమీందారు. గొప్ప వంశం. శ్రీమంతుడు, కుల మర్యాదల విషయంలో గట్టి పట్టుదల కలవాడని పేరు. యుక్త వయస్సు వచ్చిన ఒక్కగా నొక్క కూతురు. తన ఆశయం ప్రకారం ఆయన సర్వగుణ సౌందర్య సంపన్నుడైన వరుడికోసం ఎంతగానో గాలించాడు. సంప్రదాయం నిలబెట్టగల కులీనుడు ఎక్కడా దొరకలేదు.

విసుగెత్తిపోయింది ప్రియనాధబాబుకి. ఈ విషయంలో భార్యని కదిపితే, 'కులీనత ఏం చేసుకుంటాం లెద్దురూ!' అనేది.

ఆ వూళ్ళోనే ఉన్నారు, వారి కులగురువులు. ఒక రోజున వారితో ఈ సంగతి మనసు విప్పి చెప్పాడు జమీందారు.

అందుకు గురువుగారు—'హరిహరీ!—అదేం మాటండీ'—సాధ్యమైన పనేనా మీరు చెప్పేది?—మీకేం కొదవ?—ధనధాన్యాలకు తక్కువా, సిరిసంపదలకు లోటా?—

ఆస్తి పాస్తులుండ నివ్వండి, లేకపోనివ్వండి—కులం తక్కువ వాడు మాత్రం పనికి రాడు. కులీనుణ్ణి వెతికి పట్టండి, కన్యాదానంచేసి ఇంటో ఉంచుకోండి; అన్ని విధాలా లక్షణంగా వుంటుంది. ఇంత పెద్ద వంశమేమిటి, కుల మర్యాదలకు లోటు రానివ్వడమేమిటి, నాకేం బాగుండలేదు' అన్నాడు.

ఇంటికి వచ్చాడు ప్రియనాథబాబు. భార్యతో ఈ సంగతి చెప్పేటప్పటికి ఆమె ఎంతో సంతోషించింది. 'అలాగే చెయ్యండి. బతికున్నంతకాలం నా కళ్ళముందైనా పడి వుంటుంది అమ్మాయి' అంటూ అంగీకారం తెలిపింది.

ఈ మాట జమీందారుకీ నచ్చింది. లేని వాడైనా సరే కులీనుడికే ఇచ్చిచెయ్యాలి. పెళ్ళిచేసి అల్లుణ్ణి ఇంటోనే అట్టేపెట్టుకోవాలి అనే వుద్దేశం ధృవపరుచుకున్నాడు.

# 3

ఎక్కడో పూజచేయించటానికని బయల్దేరాడు మధుసూదన ముఖోపాధ్యాయుడు.

ఇంతలో—

జమీందారు తనింటి వైపే రావటం చూశాడు. ఏమిటిది, ఆశ్చర్యం!—అంత పెద్ద జమీందారు సామాన్యుడైన తనింటికి రావడమేమిటీ?—ఎన్నడూ అనుకోని విషయం.

ఏం తోచలే. వారిని ఎక్కడ కూర్చో బెట్టడం. ఎలా మర్యాద చెయ్యడం?—మధుసూదనుడు మధనపడటంలో గల సూక్ష్మాన్ని ఇట్టె గ్రహించాడు ప్రియనాథబాబు. నవ్వుతూ దగ్గరకువచ్చి, 'కాస్త పనుంది మీతో రండి, లోపలికి పోయి కూర్చుందాం' అన్నాడు.

'పదండి....కాని....' అని సంకోచపడ్డాడు ముఖోపాధ్యాయుడు.

'కానీలేదు, గీనీలేదు, ముందు పదండి. సావకాశంగా మాటాడుకుందాం' అన్నాడు ప్రియనాథబాబు.

ఇద్దరూ వెళ్లి చండీ మండపంమీద కూర్చున్నారు.

"అన్నట్టు - మీ మేనల్లుడు ఎక్కడున్నాడు?" అడిగాడు ప్రియనాథబాబు.

"ఇంకెక్కడుంటాడు? భట్టాచార్యులుగారి పాఠశాలలో చదువుతున్నాడుగా?"

"ఆ అబ్బాయిని ఒకమారు పిలిపిస్తారూ?"

"అలాగే, ఏమిటండి వాడితో అవసరం?"

"అవును, అవసరం గనకనే"

"మరేం తప్పుపనిగాని చేయలేదు కద, కుర్రకుంక?"

"ఆఁ—అల్లాంటిదేం కాదు"



"సరి?—"

"మరీ....అతగాడికి మా అమ్మాయి నిచ్చి పెళ్ళి చేదామని. అంటే, మనం మనం బంధువుల మవుతున్నా మన్నమాట, తెలిసిందా?" అంటూ పకపక నవ్వాడు జమీందారు.

ఆశ్చర్యపోయాడు మధుసూదనుడు. కళ్లు రెండూ బాగా తెరిచి, ఆయన వేపే చూస్తున్నాడు. కాస్త ఆగి,—

"అతగాడికి అంటే ఎవరికీ? మా మేనల్లుడు కాశీకా!—"

"అవునండీ"

"దొరక్క దొరక్క వాడే కనిపించాడా మీకూ?"

"అలా అంటా రేమిటీ?—ఎంత వెదికినా ఇంత మంచి కులంలో పుట్టిన వరుడు నాకు దొరకనే లేదు. ఇంతకూ మీకేం అభ్యంతరం లేదుకదా?"

"అభ్యంతరమా!—పరమ సౌభాగ్యం నాకు. కాని, వాడు పిచ్చివాడని తెలుసా?"

"పిచ్చివాడా! నేనెప్పుడూ వినలేదే ఈ మాట?"

"వాడి తండ్రి పిచ్చివాడు"

పిల్లవాడి తండ్రిని బాగా ఎరుగును ప్రియబాబు. అతడు పిచ్చివాడని చాలామంది చెప్పుకోవటం కూడా ఆయనికి బాగా తెలుసు. కొంచెం ఆలోచనలో పడ్డాడు.

"కుర్రవాడి పేరు?"

"కాశీనాధ వంధ్యోపాధ్యాయుడు."

అతన్ని పిలుచుకు రమ్మని చిన్న కొడుకుని పంపించాడు మధుసూదనుడు. వాడు వెళ్ళి "కాశీ బావా!" అని పిలిచేటప్పటికి కాశీనాధుడు తలెత్తి చూశాడు.

"ఏం?"

"నాన్నారు నిన్ను రమ్మన్నారు."

"ఎందుకని?"

"ఎందుకో! — జమీందారుగారు వచ్చారు మనింటికి, ఆయనే నిన్ను పిల్చుకు రమ్మంట."

కాశీనాధుడు మెల్లిగా పుస్తకం మూశాడు. లేచాడు. వచ్చి వారి ముందు పొందికగా కూర్చున్నాడు. అతన్ని ఆపాద మస్తకం పరీక్షగా చూశాడు ప్రియబాబు.

"ఎక్కడున్నావ్, కాశీనాధ్?" అడిగాడు.

"భట్టాచార్యులుగారి పాఠశాలలో చదువుతున్నానండి."

"వ్యాకరణం చదివావా?"

"చదివాను" తల ఆడిస్తూ సమాధాన మిచ్చాడు పిల్లవాడు.

"తర్కం?"

"కొంతవరకు."

"ఇప్పుడేం చదువుతున్నావ్?"

"దర్శన శాస్త్రం."

"సరే, వెళ్ళి చదువుకో."

# 4

వెళ్ళిపోయాడు కాశీనాధుడు. నన్ను వారెందుకు రమ్మన్నారు, ఎందుకు వెళ్ళమన్నారు అనే జిజ్ఞాస కాస్తంతయినా అతని మనసుకి తగల్లేదు. తిన్నగా పాఠశాలకు వచ్చి కూర్చున్నాడు. మామూలుగా పుస్తకం తెరిచి చదువుకుంటున్నాడు.

* * *

అతడు వెళ్ళిపోయిన తర్వాత ప్రియనాధ బాబు మళ్ళీ ప్రసంగంలోకి దిగాడు:

"ఏమిటి, ఇందాకా మీరు ఆ అబ్బాయిని పిచ్చివాడని అంటున్నారే?" అడిగాడు.

"కేవలం పిచ్చివాడు కాదు లెండి, వాడిదంతా అదోరకం వింత ధోరణి. అది చూసే కొంతమంది పిచ్చివాడు కాబోలు ననుకుంటారు" అని చెప్పాడు మధుసూదనుడు.

"అంటే ఏమిటో నాకు సరిగా అర్థంకాలే!"

"అహ—మరేం లేదు. ఎప్పుడూ పుస్తకం చేతపుచ్చుకుంటాడు, లేదా ఇష్ట మొచ్చి నట్టూ తిరుగుతూనయినా వుంటాడు. మరో పనిలోగాని మరే విషయంలోగాని అతడు ప్రమేయమే పెట్టుకోడు. ఇదే వాళ్ళనుకునే పిచ్చి ధోరణి."

"అయితే, మరో పనేదీ చెయ్యడంటారా?"

"ఒక్కొక్కప్పుడు ఇంటో మూలని చీకట్లో, గంటల కొద్దీ ఒక్కడూ మెదల కుండా కూర్చుంటాడండి."

"సరి, సరి—మరేమైనా?" అని ప్రియనాధుడు నవ్వుతూ ప్రశ్నించాడు.

ఆయన నవ్వులోనూ, ప్రశ్నలోనూ గంభీకృత మయిన అర్థమేదో ఉన్నట్టు మధు సూదనుడు పసికట్టాడు. తటపటాయించి, కాస్తమెలకువతో "అబ్బే, మరేంలేదండి!" అనేశాడు.

"అయితే ఒక్కమాటు లోపలికెళ్లి మనవార్ని కనుక్కుంటారా? వారూ ఇష్టపడితే మరి, ఈ నెలలోనే ఏర్పాటుచేదామని" అన్నాడు ప్రియబాబు.

అయ్యవారు ఇంటోకి వెళ్ళాడు. భార్యతో సంగతంతా చెప్పాడు. సంతోషంతో ఒక్క సారి ఆమెకు ఆకాశాన్నుంచి దొర్లినట్టయింది. మళ్ళీ కాస్త తమాయించుకుని కుదుట పడేసరికి మనస్సు మారింది. 'జమీందారు ప్రియబాబు కూతురినా! కాశీకి ఇస్తారా? మీకేమన్నా మతిపోయిందాయేం?'—అన్నది.

"ఇందులో మతిపోయేందుకేముంది?"

"కాకపోతే—?"

"కాశీనాధుడు ఎంతకులీనుడో కాస్త ఆలోచించుకో."

"ఆ అదృష్టం మన హరికి పట్టకూడదూ?" అందామె పెద్ద నిట్టూర్పుతో.

ఇద్దరికీ తెలుసు ఈ పని అసాధ్యమని. అయినా నిట్టూర్పుతో అయ్యవారు అడిగాడు! "నీ ఉద్దేశ మేమిటో చెప్పూ."

"నా పిండాకూడు, నాకో ఉద్దేశం కూడా యేడిశిందీ?—కానివ్వండి, వాడికే చేసెయ్యండి పెళ్ళి" అన్నది విచారంగా.

ఇంకిప్పుడు బయటికి వచ్చాడు అయ్యవారు. తెచ్చిపెట్టుకున్న చిరునవ్వుతో, "మీరు సెలవిచ్చిన వార్త చెప్పేసరికీ, ఇంటో వాళ్ళంతా అంతులేని ఆనందం పొందారండి. మరో విషయం—మా తోబుట్టువు కాలం చేసేటప్పటికి, కాశీకి రెండేళ్ళయినా నిండ లేదండి. నాటి నుంచి వాడ్ని మా ఆవిడే పెంచి ఇప్పటిదాకా పోషించి ఇంతవాణ్ణి చేసింది. ఆ తరవాత బావగారూ పోయారుగా? అప్పట్నించీ కుర్రవాడు మా ఇంటోనే ఉంటున్నాడు" అని చెప్పాడు.

"తెలుసులెండి అదంతా నాకు. అయితే, ఇవాళే ఖాయమనుకుందామా?" అన్నాడ ప్రియబాబు.

"ఖాయపర్చేందుకింకా ఏముంది? మీ అవకాశాన్ని బట్టే మూడు ముళ్ళూ వేయిం చెయ్యడం, అంతే. నేనూ వస్తా, తథాస్తూ అని దీవించి అక్షతలు వేస్తా"

"అది కాదు, నే నడుగుతున్నా—చెప్పండి."

"మీ ఇష్టమే నా యిష్టం. వేరే నే ఖాయపర్చడమేమిటీ! అయినా, వాడ్ని అత్తే కదా తల్లిలాగా పెంచిందీ? కాబట్టి ఆమెతో కొంచెం సంప్రతిస్తే బాగుంటుందనుకుంటా!"—

"అదే నేనూ అనేది. ఆవిడతో సంప్రతించటం చాలా ముఖ్యం" అన్నాడు ప్రియబాబు.

తరవాత కాశీ అత్తగారు అంగీకరించింది. ప్రియబాబు ఇష్టప్రకారం సంబంధం ఖాయమయింది. తల్లి స్థానంలో ఉన్న కాశీ అత్త ఇప్పుడు వియ్యపురాలుకదా. వెయ్యి న్నూటపదహార్లు కట్నమిస్తేగాని పెళ్ళి జరగటానికి వీల్లేదంది. ఈ ధర్మ సూక్ష్మానికి సంతోషించిన ప్రియనాథబాబు కాదన లేదు.

# 5

మొదట్లో ఏదెలా వుందో తెలీదు. కాశీనాథుడు జమీందారుగారి ఇంటి అల్లుడై తీరా వచ్చిన తరవాత మాత్రం అతడు సుఖంగా ఉన్నట్టు కనిపించదు. మానసి కంగా ఆతడు హాయిగా లేడు. ఏమీ?—

ఇప్పుడు తను పోదామనుకున్నచోటికి పోలేడు. ఇక్కడ నించోవాలీ అనుకుంటే నించోలేడు. ఎటుచూసినా అంతా అతనికి విరుద్ధంగానే కనిపిస్తూంది. ఫలానా చోటికి నేను వెళ్లాలి అని అల్లుడనుకుంటే అందుకు మామగారి అనుమతి దొరకదు. అదృష్టం బాగుండి ఒకవేళ ఆయనగారు అనుమతించినా, వెనకనించి అత్తగారు విసుగూ, సణుగూను- "మా అల్లుడేమిటి, వాళ్ళింటి కెళ్ళడమేమిటి" అంటూ. దాంతో ఇక ఆడుగు ముందుకి పడేదికాదు అతడికి.

ఇలా ఎందుకు జరుగుతూంది? తనని ఈ విధంగా ఎందుకు బందీఖానాలో ఉంచు తున్నారు, అలా ఉంచడంలో వారి ఉద్దేశమేమై వుంటుంది?—ఈ సమస్య లేవీ అల్లుడికి అర్థంకాలే.

"అయితే—నే నెవర్ని? జమీందారువారి అల్లుణ్ని. సామాన్యవు మనిషినా, ఎక్కడికి బడితే అక్కడికి తిరగటానికి?" అని అప్పుడప్పుడు మనస్సుకి సమాధానం చెప్పుకుని సంతృప్తి పడేవాడు. కాని అతడి ఆత్మ మటుకు పరితాపం పొందుతూ వుండేది-"లేదు, లేదు—శాంతి లేదు—విశ్రాంతి లేదు—స్వాతంత్ర్యం లేదు" అని.



రాను రాను క్రమంగా కాశీనాధుడికి అవగాహనయింది. “స్వేచ్ఛకొద్దీ పక్షిలాగ ఈ విశాల ప్రపంచంలో విహరించే నేను ఇప్పుడీ బంగారు పంజరంలో బందీనై పడి ఉండాల్సి వచ్చింది కదా అని. లోగడ—లోతులు తెలియని మహాసముద్రంలో ఈదులాడుతో వుండిన నేను నలువైపులా ఎత్తైయిన గట్లతో సీమితమై ఉన్న పుష్కొలనులో తచ్చట్లాడాల్సి వచ్చింది కదా అని. ఆ సముద్రం హాయిగా ఉండేదని కాదు. అక్కడా భీభత్స

మైన తుఫానులనూ, భయంకరంగా ఘోషించే తరంగాలనూ ఎదుర్కోవలసి వచ్చేది. అయినా అదే నయం. ఏమంటే—ఈ నిర్మల సరోవరంలో మసలడం ఒక్కొక్కప్పుడు సలసల మసలుతున్న నూనెలో పడేసినట్టు ఉంటూంది. ఇదంతా చూస్తే, వీళ్ళంతా కుమ్మక్కు అయి నన్ను—అంటే నా దేహాన్ని కొనేశారా అనిపిస్తుంది."

ఇటువంటి మానసిక వేదన, ఆవేదన అనుభవిస్తున్న కాశీ తల మీద మునుపు మనకి కనబడే ఆ పిలక లేదు. మెళ్ళో ఆ రుద్రాక్షమాల ఏదీ? నుదుటని విభూతి రేఖ లేవీ? అతడి కిప్పుడు బిళ్ళగోచీలేదే? ధనంజయ భట్టాచార్యుల వారి పాఠశాల కనబడదే! ఏటి ఒడ్డెది, ఒడ్డున ఆ పెద్ద మర్రిచెట్టు ఏది? అన్నట్టు—ఆ చండీమండపమేది? లేదు ఏమీ లేదు. మనం అప్పు డెరిగిన ఒక్కటీ ఇప్పుడు కనబడదు. సర్వం శూన్యం.

కాశీకి ఇదో కొత్త జన్మ. పునర్జన్మ. అంటే పూర్వజన్మ వాసనలన్నీ విసర్జించా డన్న మాట. లేదా, అతని దేహమూ మనస్సూ—వీటి మధ్య ఘర్షణ జరిగి అవి విడిపోయన్నా ఉండాలి.

సాయంత్రమయేటప్పటికల్లా అతని మనస్సు నదీతీరాన మర్రిచెట్టు దగ్గరో, పొలం గట్లపైనో గాలిస్తూ ఉంటే, శరీరం మటుకు ఇక్కడ హంస తూలికా తల్పం మీద నిర్జీవంగా పడి వుండేది. అంగాస్త్రం చుట్టబెట్టుకుని ఏటిలో దూకి మనస్సు జలకాలాడుతుంటే, ఇక్కడ శరీరం ముక్కాలిపీట మీద కూర్చుని నౌకర్ల చేత శిరస్స్నానం చేయించుకుంటూ వుండేది. ఈ విధంగా ఒకే కాశీనాధుడు ఎప్పుడూ రెండుచోట్ల పనులు చేస్తూండేవాడేగాని అవేమన్నా చక్కగా ఉన్నాయా, అతడికి సంతృప్తినిచ్చాయా?

చాలా కాలం ఇలా గడిచిపోయింది. అత్తారింటో కాశీకి ఒకటి—రెండు—మూడు పన్నెండు మాసాలు గడిచిపోయాయి. మొదట్లో కొత్త బులపాటం కదా. అన్నీ బాగానే వున్నాయి. మంచి చెడ్డలు తెలుసుకునేటంత అవకాశం దొరక లేదు.

కాని, సమయ మొచ్చింది. తనకు తను చూసుకున్నాడు. చూసేటప్పటికి రోజు రోజుకీ తగ్గిపోతున్నట్టు తెలిసింది. కొంపదీసి ఈ మార్పు ఎవరయినా కనిపెట్టలేదుకదా! ఏమోగాని, కమల మాత్రం గ్రహించింది. భర్త శరీర స్థితిని ఆమె కళ్ళు గుర్తించాయి. ఒక రోజున అడిగింది: "రోజు రోజుకీ చిక్కిపోతున్నారేమండీ?"

"ఎవరన్నారు?"

"నా కళ్ళే చెబుతున్నాయి."

"పొరపాటు."

అంతతో వదల్లేదు కమల, "నాతో చెప్పరా, ఎందుకనో?"

"ఏం లేదు. ఏం చెప్పేది."

"కారణం లేక పోలేదు, ఉంది."

"లేదు."

"ఉందంటే, తప్పకుండా—నా మనస్సు చెబుతూంది."

మొహం తిప్పేసుకున్నాడు కాశీ. "నువ్వు నన్ను వేధించేస్తున్నావు, అలా అయితే ఇక్కణ్ణించి నే పోతా" అన్నాడు.

పోబోతున్న కాశీనాధుణ్ణి చెయ్యి పట్టుకుంది కమల—"వద్దండి, వెళ్ళొద్దండీ. ఇంకేం అడగన్లెండి మిమ్మల్ని" అంది విచారంగా.

కూర్చున్నట్టే కూర్చుని, మరుక్షణమే తటాల్ని లేచి వెళ్ళాడు కాశీ. ఈ మాటు అతన్ని కూచోమన లేదు కమల. భర్త పోగానే దిండుమీద మొహం పెట్టుకునేడ్చింది.

కాశీ బయట కొచ్చాడు. పారజూశాడు. ఎవళ్ళూ కనబడలే. మెల్లిగా వాకిలి దాటి, కాస్త కాలు సాగించాడు. తెలియకుండానే చాలా దూరం వచ్చేశాడు. ఒక్కమాటు తిరిగి చూశాడు. వెనకాతలే నవుకరు, తనని వెంబడిస్తూ. విసుక్కున్నాడు కాశీ.

"ఎక్కడికిరా, ఇట్లా?"

"మీ కూడానండి" అన్నాడు నౌకరు, దణ్ణంపెట్టి.

"నాతో రానక్కర్లే, పో!" అన్నాడు కాశీ.

"మరి, ఒక్కరూ తిరిగి రాగల్రాండి, సాయంత్రం?" అని అడిగాడు నవుకరు.

బదులు చెప్పకుండానే కాశీనాధుడు సాగిపోయాడు. నవుకరు ఏం చేస్తాడు? వాడికేం చెయ్యటానికీ తోచలేదు. కాస్సేపు నించున్నాడు, ఆలోచించాడు. తిరిగిపోవలిసిందే, వేరే దారి లేదు అని నిశ్చయించుకున్నాడు.

# 6

అయితే—ఆ నవుకర్ని గురించి కాశీనాధుడు మటుకు అట్టే ఆలోచన పెట్టుకోలేదు. తిన్నగా మేనమామగారింటికి చేరుకున్నాడు. శూన్య హృదయంతో లోపలి వరండాలో కూర్చున్నాడు. కాస్సేపయాక, బయటికి పోబోతున్న హరిబాబు అతన్ని చూశాడు. కానైతే, మసక చీకటిగా ఉండటం మూలాన స్పష్టంగా తెలియక దగ్గిరకెళ్ళి "ఎవరు వారు?" అన్నాడు.

"నేనే."

"ఓహో, పిల్ల జమీందారుగారా? ఇక్కడి కెలా వచ్చారండీ!" అని అడిగాడు ఆశ్చర్యంతో.

మాటాడలే కాశీ.హరిబాబు గల్లంతు ప్రారంభించాడు: "అమ్మా, అమ్మా! జమీందారుగారి అల్లుడొస్తే, కూచోటానికి పీట కూడా వెయ్యరేమే ఎవరూనూ?"

పరుగెత్తుకుంటూ వచ్చింది, హరితల్లి. "ఏం నాయనా, మీ అత్త జ్ఞాపక మొచ్చిందా?" అనడిగింది.

ఇప్పుడూ ఏమాటాడలే కాశీ. కూతుర్ని పిలిచింది అత్త. "బిందూ!—చప్పున రావే. మన కాశీ బావొచ్చాడూ. కూచుందికేదయినా పట్రామ్మా—ఇంతలో నేనూ పూజ చేసుకొచ్చేస్తాను" అన్నది.

బిందువాసిని మధుసూదనుడి చిన్నకూతురు. ఆమె పెద్ద ఇంటి కోడలైంది. అందు మూలాన పుట్టింటికి అంత తరుచుగా రాదు.

ఆమె వచ్చి యిప్పటికి నెల్లాళ్ళయింది. అయినా ఇప్పటి దాకా కాశీ బావని చూడనే లేదు. కాశీ బావంటే ఆమె కెంతో మక్కువ. అందుకనే కాశీ అనే పేరు వినగానే పరుగెత్తుకొచ్చేసింది, ఆత్రంగా చూసింది. చూస్తే ఎవరూ కనపడలే.

అయితే చీకటి వరండాలో మాత్రం ఒక రాచబిడ్డ కూచుని వున్నాడు. ఇలాంటి కాశీ బావను ఇంతకుముందెప్పుడూ ఆమె చూళ్ళేదు. ఇప్పుడీ కాశీబావ జమీందారుగారి అల్లుడు కదా, రాజ వేషంలో ఉన్నాడు. చూస్తే ఆమెకు పట్టలేని నవ్వొచ్చింది.

తీరా దగ్గరకెళ్ళి, ఆ చీకటిలో బావ మొహం చూచేటప్పటికి ఆమె నవ్వు కాస్తా ఇగిరిపోయింది. అయ్యో, అతడి మొహం ఎంత మలినంగా ఉందీ, మాడిపోయిందే, విచారంతో వాడిపోయిందే! ఇట్లాంటి మార్పుతో ఆ ముఖం ఎవరూ ఇదివరకెప్పుడూ చూడలేదు.

ఆ మాటకొస్తే ఇంటో ఎవరూ అతన్ని గుర్తించనే లేకపోయారు—ఒక్క బిందు వాసిని తప్ప. ఆమె దగ్గిరసా వెళ్ళింది, చనువుతో వీపు మీద చెయ్యేసింది. "బావా, ఇక్కడ ఒక్కడివీ ఏమిటి, చీకట్లో? పద, లోపలికెళదాం" అన్నది. మెదలకుండా లేచి వెళ్ళాడు కాశీ, ఇంటో మంచంమీద కూర్చున్నాడు.

"ఇక్కడికి నే నొచ్చి ఎన్నాళ్ళయిందో తెలుసా, బావా? ఒక్కమాటయినా చూట్టానికి వచ్చావు కాదు గదా?" అన్నది బిందు.

"రాలేకపోయాగమ్మా!" కాస్త తచ్చాడుతూ అన్నాడు కాశీనాధుడు: "రానివ్వటంలేదు."

"రానివ్వటంలేదూ? ఎందుకనీ?"

"ఆఁ—ఏంలేదూ, వాళ్ళిష్టం...." అన్నాడు కాశీ పరధ్యానంగా.

బిందూ అడిగింది దుఃఖంతో, "నువ్వు ఎక్కడికి వెళ్ళాలంటే అక్కడికి వెళ్ళ నివ్వరా?"

"ఉహూ—వెళ్ళనివ్వరు. అలా నేను నా యిష్టం వచ్చిన చోటికి వెళితే మామగారికి అవమానమట."

లోకంలో వాడుక ఒకటుంది—లేకలేక సంతానం కలిగేటప్పటికి, ఆ మక్కువకొద్దీ తల్లిదండ్రులు ఆడా మగా భేదం పాటించరు. అంటే—ఒకవేళ ఆడపిల్ల పుట్టినా, ఆ పిల్లని కొడుక్కంటే ఎక్కువగా చూసుకుంటారు.

ఇప్పుడు జమీందారుగారింటో కమలే యజమానులకు యజమానిగా, యజమానురాండ్రకు యజమానురాలుగా ఉంటూంది. ఇంటో ఎవళ్ళూ ఆమెమాట తోసెయ్యలేరు, ఆమె ఇష్టానికి విరుద్ధంగా ఏ పనీ చెయ్యలేరు. ఎవళ్ళకీ సాహసం లేదు.

కమల ధనవతి, గుణవతి, విద్యావతి, రూపవతి. అన్ని విషయాల్లోను ఆమెది ఏకచ్ఛత్రాధిపత్యం. ఇన్ని ఉండీకూడా, ఆమె చెయ్యలేని పని ఒక్కటి ఉండిపోయింది. ఏ విధంగానూ ఒక వ్యక్తిని మాత్రం వశపర్చుకోలేకపోతూంది. ఆ వ్యక్తే ఆమె భర్త—కాశీనాథుడు.

అనేక ఉపాయాలు చేసి చూసింది, బెదిరించి చూసింది, శుశ్రూష చేసింది, చివరికి విలపించి చూసింది. దేనికీ అతడు లొంగలేదు. ఏ విధానా భర్త మనస్సును స్వాధీన పర్చుకోలేకపోయింది. ఆ మాటకేం?—ఆఖరికి అతని సమీపానిక్కూడా చేరలేకపోయింది.

ఒక నిరుపేద వ్యక్తి ఎంత ఉన్నతమైన మనస్సుతో తనకు భర్తగా వచ్చాడో, ఆ మాత్రమయినా ఊహించలేదు కమల. ప్రతినిత్యం రెండు పూటలా ఆమె "భగవంతుడా?—ఆయన మనస్సు నా కివ్వకూడదా!" అంటూ ప్రార్థించేది.

ఒక్కొక్కప్పుడు మళ్ళీ ఆమెకు ఇలా సందేహం తోచేది—"వారికి మనస్సు అనేదే లేదేమో, అందుకే ఆయన ఆప్యాయతను నేను పొందలేక పోతున్నానేమో." కమలకు తన భర్త ఒక జటిలమైన రహస్యమయ రూపుడు. కాలం గడిచినకొద్దీ అతని మనస్సు ఎలా కనిపెట్టడం అనే సమస్య మరింత జటిలమైపోయింది. "నా భర్త నన్ను ప్రేమిస్తున్నట్లు ఇంకెవరి భర్తలూ ఏ ఇల్లాళ్ళనూ ప్రేమించరు" అనుకునేది ఒకమాటు. మళ్ళీ అంతలోనే మనసు మారిపోయి—"నా భర్త నన్ను ఉపేక్షిస్తున్నట్టుగా ఇంకెవరి భర్తలూ మరే భార్యలనూ ఉపేక్షించరేమో" అని కూడా అనుకునేది.

ఏమనుకున్నా, కమలకు రోజులు గడచిపోతూనే వున్నాయి. కాలం గడవనిదల్లా కాశీనాధుడికే!—

ఇప్పుడతనికి పుస్తకాలమీదా మనస్సుండటం లేదు. పోనీ ఉత్తనే కూర్చుందామా అంటే దానికీ తోచలేదు. మాటా మంతీ అన్నా, హాసమన్నా, పరిహాసమన్నా అతనికి రుచి లేకుండా పోయింది. కాశీది కండలు తిరిగిన శరీరం, ఇప్పుడు కృశించి పోతూంది. దబ్బపండులాంటి అతడి శరీరచ్ఛాయ నల్లబడసాగింది. రోజురోజుకీ భర్త ఇలా చిక్కి



బక్కగా తయారుకావటం చూసి, కమల నెత్తీ నోరూ కొట్టుకునేద్చేది. ఈ విషయంలో మరెప్పుడూ అతన్ని అడక్కూడదని ప్రతిజ్ఞ చేసుకుంది, ఇదివరకు. కాని ఆ ప్రతిజ్ఞను పాటించలేకపోయింది. ఒకనాడు భర్త వచ్చేటప్పటికి కమల అతని పాదాలమీద పడి ఏడ్చింది. కాశీనాధుడు ఆత్రపడ్డాడు, ఆమెను లేవదీయాలని ప్రయత్నించాడు. కాని, లేవదీయలేక పోయాడు.

"ఏం జరిగిందేం, ఎందు కేడుస్తున్నావ్?" అడిగాడు.

ఎంతకూ కమలనుంచి సమాధానంలేదు. చాలాసేపు ఏడ్చింది. మళ్ళీ భర్తపాదాల మీద పడింది. "కావాలంటే నన్ను మీరు ఒక్కసారిగా చంపెయ్యండి, కాని ఇలా మాత్రం హింసించకండి" అన్నది.

ఎంతో ఆశ్చర్యపడ్డాడు, కాశీ.

"ఏమిటో చెప్పు, నేనేం చేశాను?" అడిగాడు.

"మీకు తెలియదా, అదేమిటో?"

...... ...... ...... ...... ...... ......

"మీ ఇష్టం వచ్చినట్టూ చెయ్యండి. కాదనను. నేను నిలబడ్డానికి మాత్రం కాస్త పంచ ఉంచండి. మరేమీ అడగను మిమ్మల్ని?"

ఈ మాటు కమలను లేవదీశాడు, కాశీ. చేరదీసి దగ్గిర కూర్చోబెట్టుకున్నాడు. ప్రేమతో అడిగాడు—"అసలు జరిగిన సంగతేమిటో సరిగ్గా చెప్పు నాకూ."

"రోజు రోజుకీ మీరిట్లా ఐపోతున్నారెందుకనీ?"

"నా ఒళ్ళు క్షీణించి పోయిందంటావా?" అడిగాడు.

పైటచెంగుతో కమల మొహం కప్పుకొని ఏడుస్తూనే తల ఊపింది—"చాలా తగ్గి పోయారు!"

"అవును. ఆ మాట నాకూ తెలుసు. నన్నేం చెయమంటావు. నువ్వే చెప్పు," అన్నాడు.

మొహం ఎత్తింది కమల. "మందు పుచ్చుకోండి" అన్నది.

"మందు పుచ్చుకుంటే నయమవుతుందనా?" అడిగాడు కాశీ, నవ్వుతూ.

"అయితే ఇంకెట్లా?"

"నాకు తెలియదు."

"మందు మాకులతో నయంకాదాయె, మరి దేంతో నయమవుతుందో తెలియదాయె. ఇంకెట్లాగండీ?—నా రాత ఒక్కమాటుగా భగ్గుమనిపిస్తారా యేం?"—

సంస్కృత పాఠశాలలో చదివిన సరళహృదయుడు కాశీనాధుడు. అతనికి ప్రేమ లాలిత్యం తెలియదు, ప్రణయాలాపం ఎరగడు. అయినా, కమల చెయ్యి పట్టుకొని ఇలా అన్నాడు, కన్నీరు తుడుస్తూ. "నా కిక్కడ సుఖంగా లేదు. అందుకనే ఇలా అయి పోతున్నానేమో!"

"అటువంటప్పుడు, ఇక్కడెందుకుండటం ఇంకా?"

"ఉండక ఎక్కడి కెళ్ళేది?"

"ఇక్కడగాక మరెక్కడా చోటేలేదా?—మీ కెక్కడ సుఖంగా వుంటే అక్కడి కెళితే సరి."

"వీలు పడదు."

"ఎందుకు వీలుపడదు?"

"ఇక్కడుండకపోతే మామగారికి బాగుంటుందా?"

"ఇట్లా చిక్కి, క్షీణించి, శల్యావశిష్టమైతే బాగుంటుందా, వారికి?"

"బాగుండదు. ఇంకో ఉపాయమేమిటుంది? మీ బాబు....బీదవాడని....చూసి...."

భర్త నోటిమీద చెయివేసింది కమల. ఆ తరవాత మాట రానివ్వలే. "రామ రామ!—అటువంటి మాటలు మాత్ర మనకండీ. మనస్సులో మాట ఏదో కపటం విడిచి నాతో చెప్పండి. దానికి తగిన ఏర్పాటేదో ఒకటి నే చేస్తా" అన్నది.

ఆలోచించి అన్నాడు కాశీ—"సంగతి సందర్భాలన్నీ విశదంగా నీతో చెప్పటం కుదరదు!" కొంచెంసేపు మౌనంగా ఉండి మళ్ళీ అన్నాడు. "ఇదంతా చూడగా, మనిద్దరికీ పెళ్ళి కాకుంటే బాగుండేదనిపిస్తోంది."

"ఎందుకని?"

"నన్ను చేసుకుని ఒక్క రోజయినా నువ్వు సుఖపడ్డావా చెప్పూ. నాకు చూస్తే ప్రేమ విధులు తెలియవు. గౌరవ మర్యాదలూ తెలియవు. ఆ మాటకొస్తే అసలేమీ తెలియనివాణ్నని అనుకోవచ్చు. ఈ వయస్సులో నీ కెన్నెన్ని కోరికలుంటాయో, మనస్సులో ఎన్నెన్ని కల్పనలుంటాయో కదా!—వాటిల్లో ఒక్కటయినా నావల్ల తీరిందా నీకు? కనుక, నన్ను నువ్వు పతిగా భావించడంకంటె పతి ఛాయ ననుకోవడం సబువుగా వుంటుంది" అని చెప్పాడు.

కమల కళ్ళవెంట జలజల బాష్పాలు రాలాయి. ఈ సంగతు లన్నీ ఆమె సరిగ్గా తెలుసుకోనూ లేకపోయింది. ఆమె అంతర్యంలోనించి ఒక్కమాట బయటకి రావటానికి కొట్టుకులాడుతూవుంది—ఉచ్చున పడ్డ పక్షిలాగ కంపితస్వరంతో అడిగింది—"నన్ను చూడలేరా మీరు?"

"ఇంకెప్పుడైనా చెబుతా నీ సంగతి."

"చెప్పకపోతే పోయారు. నన్ను పెళ్ళిచేసుకుని మీరు సుఖపడలేదా, నిజం చెప్పండి."

"ఏమో సుఖపడలేదేమో!"

"పోనీ, ఇంకెవర్నయినా పెళ్లాడితే సుఖపడేవారేనా?"

"అదీ సరిగ్గా చెప్పలేను."

ఈ సమాధానం విని కమల ఒళ్ళు మండుకుపోయింది. అంతలో బైటనుంచి దాసీది వచ్చి—"అమ్మగారికి జ్వరం అంక పొంకాలుగా వుంది. మిమ్మల్ని రమ్మంటున్నారు" అని చెప్పింది. కళ్ళు తుడుచుకుంటూ కమల వెళ్ళిపోయింది.

కమల తల్లికి జ్వరం తగ్గలేదు. పదిహేనురోజులు మంచాన పడి తీసుకున్నాక, అందర్నీ ఏడ్పించి ఒకనాడు కన్ను మూసింది శాశ్వతంగా. భార్య మరణానికి ప్రియబాబు చాలా శోకించాడు. ఈ వృద్ధాప్యంలో తనుకూడా ఇంకట్టే రోజులు బతకనని తెలుసు కున్నాడు.

ఇప్పుడు బరువు బాధ్యతలన్నీ కమలపైన పడ్డాయి. తండ్రి రోజురోజుకీ కృశించి పోవటం చూచి రోజు ఇరవై నాలుగ్గంటలూ ఆమె ఆయన వెంటనంటే వుంటూంది.

పోతే, కాశీనాధుడు—మామూలురాగమే ఆలాపిస్తున్నాడు. సందు దొరికితేచాలు, గదిలోకెళ్ళి గొళ్ళెం పెట్టుకుని, పుస్తకాల దొంతర్లలో మునిగిపోతాడు. గొళ్ళెంతీసి మన ప్రపంచంలోకి వచ్చాడంటే, అతడికి పుస్తకాలమీద విసుగు పుట్టిందన్నమాట.

గది కదిలి వెళితే ఒక్కొక్కప్పుడు రెండు మూడు రోజులదాకా ఇంటి మొహమే చూడడు. ఎక్కడ తింటాడో, ఎక్కడ తిరుగుతాడో ఎవళ్ళకూ అంతు పట్టదు.

ఇదంతా చూసి కమల పూర్తిగా నిరాశ చెందింది. యౌవనవతి అయినప్పటికీ ఇంత వరకూ ఆమె చిన్నతనపు హద్దులను దాటలేదు. పతిప్రేమ యేమిటో, పతిభక్తి యేమిటో ఇంతవరకూ పూర్తిగా తెలుసుకోనేలేదు. ఇలాంటి తరుణంలో ఆమె ఆశయాలకు విఘ్నం వాటిల్లింది. ఇందులో ఆమె దోషమేమీలేదు. అంతకూ కారకుడు భర్తే.

ఒకప్పుడిక్కడ రాజప్రాసాదం ఉండేది. క్రీడావనాలుండేవి. అవన్నీ కలలోవచ్చాయి, కన్ను తెరిచేటప్పటికి మాయమైనాయి. ఇప్పుడు మళ్ళీ వాటిని—ఆ సుఖ స్వప్నాలను చూడాలనే కోరిక ఆమెకు లేదు. జరిగిందేదో జరిగిపోయింది. అంతే.

ముసలి తండ్రికి సేవచెయ్యటం, నవుకర్ల చేత పనిపాటులు చేయిస్తూండటం మొద లైన దైనిక వ్యాపకాలతో కమలకు కాలం గడిచిపోతూంది.

ఒక విషయంలో ఒకరికి సుఖం దొరకవచ్చు. దాంట్లోనే మరొకరికీ కావాలంటే అది దొరక్కపోవచ్చు. ఇప్పుడు కమల పొందుతున్న దుఃఖానికి ముసలిదాసి ఎంతో క్లేశ పడుతూవుండేది. ఉండబట్టలేక ఆఖరి కొకనాడు ప్రియబాబు ఒక్కడూ ఉండగా చూసి, ఇలా చెప్పింది: "చినబాబుగారు ఎట్లా అయిపోతున్నారో కనిపెట్టారా? ఎందుకనో తెలియదు. ఒకరోజున ఇంటి దగ్గరుంటే రెండురోజులుండరు. ఎప్పుడేం చేస్తుంటారో ఇంటో ఎవళ్ళకూ అంతుపట్టదు. అమ్మాయిగారితో కూడా ఆయన మాటాడుతున్నట్టు కనబడదండి."

ఒంటో నసిలేక ప్రియనాధబాబు ఈ గొడవలంతగా పట్టించుకోవటం లేదు. ముసల్ది చెప్పిన మీదట కాస్త ఇటు ధ్యాసపెట్టాడు. కమల రాగానే పిల్చి, దగ్గర కూర్చోబెట్టు కున్నాడు. "అమ్మాయ్ నేనో మాటడుగుతా, నిజం చెప్పాలి" అన్నాడు ఆదరంగా.

"ఏం మాట నాన్నా?"—

"చూడు అమ్మా, కష్టసుఖాల్లో తండ్రిదగ్గర ఏ సంగతీ దాచకూడదు. సంగతేమిటో చెప్పు. మీ మధ్యనేదన్నా పేచీవస్తే నే తీరుస్తాగా?" అన్నాడు ప్రియబాబు.

మౌనంగా వుండిపోయింది కమల.

"నువుగాక నాకింకెవరున్నారు? నువ్వు సుఖపడతావనేకదూ, తగిన వరుణ్ని వెతికి తీసుకు వచ్చింది?—ఇలా నువ్వు దుఃఖపడుతూవుంటే నా ఆత్మకి శాంతి వుంటుందా, చెప్పు తల్లీ!—" ప్రియబాబు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. కమలకూ అలాగే. కమల కళ్ళ నీళ్లు తుడుస్తూ, ప్రేమతో అడిగాడు తండ్రి: "అమ్మడూ!—అసలు, విషయమేమిటో నాతో సరిగ్గా చెప్పవూ?—అమ్మగా?—"

ఏం చెప్పాలో కమలకు అర్థంకాలే. కొంచెంసేపు మెదలకుండా వుండి, "ఏమన్నా తగువులాడుకున్నారా?" అనడిగాడు ప్రియబాబు.

తల వూపి వెంటనే "లేదు" అన్నది పైకి.

కాని మనస్సులో—"హితంగా వున్నది మాత్రం ఎప్పుడు, ఇప్పుడు తగువులాడుకున్నామనుకోవటానికి?" అనుకుంది.

"తగువుల్లేకపోతే, మరి నువ్వతనికి నచ్చలేదా?" అని మళ్ళీ అడిగాడు తండ్రి.

ఏదో చెప్పాలని ఉద్రేకపడింది కమల, కాని చెప్పలేకపోయింది. "పతికి తను నచ్చ లేదు"—ఈ మాట వెల్లడిగా చెప్పాలంటే ఆమె మనస్సు ఒప్పలేదు. దానికితోడు అభి మానం ఒకటి తలెత్తేటప్పటికి మరి కిక్కురుమనకుండా ఉండిపోయింది.

కొంచెం నవ్వు తెచ్చుకున్న ముఖంతో ప్రియబాబు "అతనే నచ్చలేదా నీకు?" అని అడిగాడు. ఆలోచించింది కమల. "వారే నచ్చలేదేమో నాకు? ఇది సంభవమా?— నా భర్త నాకు నచ్చకపోవటమా?" కంపించిపోయింది, కమల. తన హృదయాన్ని లోతుగా గాలించటానికి ప్రయత్నించింది. ఆ ప్రయత్నంలో, అక్కడ సంగీతం ఆగి పోయినట్టు కనిపించింది. మధ్యమధ్య ఒకళ్ళిద్దరు మూటా ముల్లే కట్టుకు వెళ్ళిపోతున్నట్టు కూడా కనిపించారు. వారి అజాగ్రత్తవలనే చెయ్యితగిలి స్వరతంత్రువులు ధ్వనిస్తున్నాయి. ఒక్కొక్కప్పుడు ఎవరో ఒక అభినేత దరినుంచి తొంగిచూసి పోతున్నాడు, అంతే.

పయిటచెంగు ముఖాన్ని కప్పుకుని ఏడుస్తూంది, కమల.

ఆత్రంతో ప్రియబాబు "ఏడవకమ్మా!" అన్నాడు.

"ఇంకెక్కడా ఎవరూ మాలాగ ఉండరు నాన్నా?" అన్నది ఆవేదనతో.

కూతుర్ని మెల్లిగా దగ్గరసా తీసుకున్నాడు ప్రియబాబు. "అలా అనకమ్మా!—నీవు ఎవరి బిడ్డవో ఆమె నాకు సమస్తమున్నూ. ఇప్పుడుకూడా రోజూ రాత్రిపూట వచ్చి




ఆమె నా పాదాల వద్ద కూర్చుంటుంది. మీ భయంవల్లే పగలు రావటంలేదు. అదుగో, పొద్దుగుంకుతూంది, వచ్చే వేళయింది. ఆమె వచ్చి ఈ మాట విన్నదంటే మనస్సులో ఎంత బాధ పడుతుందనుకున్నావ్?" అన్నాడు.

సాయంకాలమయింది, గదిలో చీకటి నీడలు ఆడుతున్నాయి. ఇంట్లోకి ఎవరైనా వచ్చారో లేదా అని దృష్టిపెట్టి ఆత్రంతో అటుయిటు చూసింది కమల. ఎక్కడా ఎవరూ

కనిపించకపోయేప్పటికి ఆమె భయపడ్డది. ఇవతలకి వచ్చేసరికి కాళ్ళు వణికాయి. శరీరమంతా నిస్సత్తువై పోయింది.

పనిపాటులు ముగించుకుంది కమల. కాశీనాథుడు కూర్చుని చదువుకుంటున్న గదిలోకి వెళ్ళి కూర్చుంది. తలెత్తి చూశాడు కాశీ! "కమలా! నువ్వేనా?" అన్నాడు ఆశ్చర్యంతో.

"ఆఁ—నే-నే!"

"కూర్చో" అని చెప్పి, అతడు మళ్ళీ పుస్తకంవేపు తల తిప్పాడు. చాలాసేపటి దాకా ఆమె భర్తకేసే చూస్తూ కూర్చుంది. తరవాత తనే తనచేతులతో పుస్తకం మూసేసింది.

ఆశ్చర్యంతో కాశీ మళ్ళీ తలెత్తిచూసి—"మూసేశావేం?" అన్నాడు.

"చదువెప్పుడూ ఉండేదేగా? ఇవ్వాళ ఏమన్నా కబుర్లు చెబుదురూ. ఒక్కరోజు చదవకపోతే కొంప మునిగిందా యేం?"

"ఇందుకేనా పుస్తకం మూసింది?"

"ఇందుకనే కాదు. మీకు కోపం వస్తుందిగదా, ఏమంటారో విందామని—"

ముసిముసి నవ్వుతో అన్నాడు కాశీనాథుడు—"కోపమెందుకు వస్తుంది, కమలా! నిన్నెప్పుడయినా చిన్నమెత్తుమాట అన్నానా? నువుచూస్తే నా దగ్గరకే రావు, మాటే బంగారం. మరి, పుస్తకాలన్నా చదువుకోకపోతే కాలక్షేపం ఎలా, నువ్వే చెప్పు."

కొంచెం నవ్వి, మళ్ళీ ఇలా అన్నాడు: "రెండు రోజులాయె జ్వరం. తిండీ తిప్పలూ లేవు, ఒక్కమాటయినా వచ్చి నువు నా సంగతి కనుక్కున్నావా?"

తలెత్తి చూసింది కమల. భర్తమొహం బొత్తిగా వాడిపోయింది. నుదుటిమీద చెయ్యేసి చూసింది. ఉష్ణం తీవ్రంగా వుంది. ఏడుస్తూ ఆమె భర్తపాదాల మీద వాలింది. సిగ్గుపడింది. చద్దామా అనిపించింది. "నా తప్పులన్నీ మన్నించండీ, మళ్ళీ నన్ను మీదాన్నిగా చేసుకోండి. మీ బరువు బాధ్యతలు నన్నూ పంచుకోనివ్వండి" అంటూ ప్రాధేయపడి ఏడ్చింది.

"అలాగే, పంచుకోనిస్తాను, నువు సంబాళించగలవా?"

"ఎందుకు సంబాళించలేనూ?"

"చూస్తాగా?"

"నన్ను మీదాన్ని చేసుకోండి మళ్ళీ!"

"ఇప్పుడేమిటి, నువు నాదానివని ఏనాడో అనుకున్నాను. కాని నువ్వా సంగతి గుర్తించలేదుగా? ఇప్పటికయినా గుర్తిస్తావో లేదో?"

దీపం వెలుగున భర్తమొహం కన్నారచూసింది, కమల. ఆ మొహంలో నివురుగప్పిన నిప్పుకణాలున్నాయి. మైనంతో కప్పబడిన మధువున్నది ఎంతో. ఈ మాటలు మనస్సులో అనుకుని, ఒక్కక్షణం తనని తను మరిచిపోయింది.

"ఇన్నాళ్ళదాకా నన్నెందుకు గుర్తించనివ్వలేదు? లోపల స్వయంపాకంగా వుండి నన్నింతకాలం వేధించారెందుకూ?" అన్నది కమల ఉద్రేకంతో. పట్టరాని సంతోషంతో ఒక్కమాటు భర్త హృదయానికి హత్తుకుపోయింది. అప్పుడు కాశీకికూడా కళ్ళనీళ్ళు తిరిగాయి.

# 9

వచ్చాడు—అల్లుణ్ణి దగ్గిరికి పిలిచాడు ప్రియనాథబాబు. "నాయనా కాశీ!—వయస్సు మళ్ళిపోయింది. నా ఘటం శాశ్వతం కాదుగదా. ఏ క్షణాన పిలుపు వస్తుందో! నాకు నీ కన్న ఇంకొకళ్ళెవరూలేరు. అంతా నువ్వే. కనుక, నే బతికుండగానే నా ఆస్తిపాస్తులు చూసుకో. నేను హరీ అన్నానంటే, నీకొక్క సెంటుకూడా దక్కనివ్వరు లోకులు. తెలిసిందా?" అని చెప్పాడు.

వంచిన తల ఎత్తకుండానే కాశీనాథుడు "మీ ఇష్టం" అన్నాడు.

"ఇంకా నా యిష్టమేమిటీ?—రేపటినించి రోజూ ఉదయమే కచేరికి వెళ్ళి కూర్చుంటూ వుండు."

"సరే" నని కాశీనాథుడు మెదలకుండా వెళ్ళిపోయాడు.

కుమార్తెను పిలిచి చెప్పాడు ప్రియబాబు: "అమ్మా, ఈ వృద్ధాప్యంలో నేను పని పాటు లేమీ చూసుకోలేను. అందుకని మన జమీందారీ బాధ్యత అంతా కాశీనాథుడు మీద పెట్టాను. ముందుముందు హైరాన పడకుండా నే జీవించి ఉండగానే దాన్లో లగువు బిగువులు చెబుతూవుంటాను." కొన్నాళ్ళదాకా ఆయన స్వయంగానే అల్లుణ్ణి కచేరీకి వెంటబెట్టుకు వెళ్ళేవాడు. జమీందారీకి సంబంధించిన గుట్టుమట్టులన్నీ తెలియజెప్పేవాడు. ఈ విధంగా తనకొక బాధ్యత ఏర్పడింది కదా అని కాశీనాథుడి కిప్పుడు ఉత్సాహంగానే వుంది. ఇంతకు ముందల్లా అతడి అంతర్యంలో మండుతూవచ్చిన జ్వాలలు మెల్లి మెల్లిగా చల్లారిపోసాగాయి.

ఇప్పుడు కాశీనాథుడు నియమంగా జమీందారీ వ్యవహారాలు చూసుకుంటున్నాడు. కమల నియమంగా ఇంటి పని పాటులూ చూసుకుంటోంది. ప్రియబాబు నియమంగా మంచం మీదే పడివుంటున్నాడు. ఈ విధంగా ఆ సంసారం ఆనందంగా గడిచిపోతూంది.

అయితే. రోజురోజుకీ ప్రియబాబు ఆరోగ్యస్థితిమటుకు క్షీణదశ పట్టింది. ఒక రోజున కమలను పిలిచాడు. 'అమ్మాయీ, వీలు రాయించు కొచ్చాను, చూడు' అంటూ దిండు కిందినుంచి ఒక కాగితంతీసి ఇలా చదివాడు: 'నా హక్కు భుక్తములయిన చర-స్థిరాస్తులన్నింటిలోను సగ భాగం అల్లుడు కాశీనాథుడికీ, సగ భాగం కుమార్తె కమలకూ చెందవలసింది'. 'ఏం అమ్మాయ్, బాగుందా?' అని అడిగాడు.

మాటాడలేదు కమల.

ప్రియబాబు ఆశ్చర్యంతో "ఏం అమ్మా, ఈ విల్లు నీకు నచ్చలేదా?" అని అడిగాడు. అతడా విల్లు రాయించింది సగం కమలని సంతోష పెట్టడానికే. తన ఆస్తిలో సగభాగం అల్లుడికి రాసిచ్చినప్పటికీ కమల ఎంతో సంతోషిస్తుందని అతను అనుకున్నాడు. ఈ సందర్భంలో కమల తను ఆలోచించే విషయం నోరువిప్పి చెప్పలేక పోయింది.

"ఇంకేమన్నా సందేహమా అమ్మా?" అంటూ మళ్ళీ అడిగాడు ప్రియబాబు.

సంకోచంగా తల ఊపి "మరే" నన్నది కమల.

"ఏమిటమ్మా నీ వుద్దేశం?" అనడిగాడు తండ్రి.

కొంచెం జంకుతో కమల చెప్పింది: "ఆస్తి యావత్తూ పూర్తిగా నా పేరనే రాయించ కూడదూ, నాన్నా?"

"ఎందుక నమ్మా?"

మెదలకుండా తలవంచు క్కూర్చుంది, ఆమె.

నాలుగు కాలాలు చూసినవాడూ, పూర్వానుభవం కలవాడూ ప్రియనాధబాబు. అందు చేత కూతురి హృదయంలో దాగివున్న విషయం అతడు గ్రహించకపోలేదు. ఒక్కొక్క సంగతి వింటున్న కొద్దీ, లోతుగా ఆలోచిస్తున్న కొద్దీ అతని శరీరమంతా ఒక విధ మయిన పీడ వ్యాపించినట్టనిపించింది. అనుకున్న దిండుమీద తలపెట్టుకుని కాస్సేపు కన్నుమూసి పడుకున్నాడు.

ఎంతోసేపు మౌనంగా ఉన్నాక, కమలతో ఇలా అన్నాడు: "నువు నా కొక్కగా నొక్క కూతురువి. నిన్ను దుఃఖపెట్టడం నా కిష్టంలేదు. ఆస్తి అంతా నీకే రాసిచ్చి పోతాను. కాని అది మంచి పనికాదు. నువ్వెప్పుడూ సుఖంగా ఉండాలనే నా ఆశీర్వాదం. అయితే, అటువంటి ఆశ నాకేం కనిపించటంలేదు, ఈ దీర్ఘ జీవితంలో నేను చాలా చూశాను, ఎన్నో విన్నాను, నామట్టుకి నేనే మూడు పెళ్లిళ్లు చేసుకున్నాను. కాని ప్రపంచంలో ఏ స్త్రీ కూడా ఇటువంటి హృదయం పెట్టుకు సుఖపడలేదు."

కొంచెంసేపు ఊరుకుని మళ్ళీ చెప్పాడు:

"లోకులు విన్నా చూసినా హర్షిస్తారనీ, నువ్వు సంతోషిస్తావనీ ఆస్తి ఇద్దరికీ చెరి సగం రాయించాను. ఎప్పటికీ మీరుభయులూ భిన్నులు కారు, నాకు తెలుసు. సరే కాని, ఎందుకని అతడి పేర రాయించవద్దంటున్నావ్, చెప్పమ్మా!"—

దుఃఖ స్వరంతో అన్నది కమల: "కాదు నాన్నా, ఆస్తి చేజిక్కితే మళ్ళీ నావేపు కన్నెత్తి చూస్తారా ఎవరయినా?"

"చిక్కకపోతే?" అడిగాడు తండ్రి.



"నా చేతులో ఉంటారు" అన్నది.

"కాశీనాధుణ్ని నువ్వెరగవు కాని నేను బాగా ఎరుగుదును. నిజానికి అతడు తండ్రి లాంటివాడు. నిన్ను చూడడు అనుకున్న పరిస్థితుల్లో అతడు ఆస్తి చిక్కినా చూడడు, చిక్కకపోయినా చూడడు. తెలిసిందా?—ఈ విధంగా భర్తని చేతుల్లో పెట్టుకో జూస్తున్నావా తల్లీ!—భయంకరమైన ఒక అడవి సింహాన్ని వశపర్చుకోవచ్చు, కాని బలవంతాన ఒకలేత మొగ్గను వికసింపజేయటం మన తరమవుతుందా?" అన్నాడు ప్రియబాబు.

మళ్ళీ కాసేపు ఊరుకుని ఇలా చెప్పాడు: "కమలా, ఇది మంచిది కాదు సుమా!—అతను నిన్ను ఏలుకోలేదంటే, నీ దగ్గరుండి మాత్రం ఏం లాభం? నీ ఒక్కత్తెకూ సంగం ఆస్తి చాలదూ? ఆత్మ సర్వస్వమూ సమర్పించదగిన భర్తకు సగం ఆస్తి ఇవ్వలేవూ?—అలా చెయ్యకు అమ్మా, అతను వింటే చాలా దుఃఖపడతాడు."

సమాధానమేమీ చెప్పలేదు కమల. ఒక అరగంట దాకా ఇద్దరూ మౌనంగా కూర్చుండిపోయారు. చీకటి పడొచ్చింది. దాసీది గదిలో దీపం వెలిగించిపోయింది. కమల కూడా కళ్ళు తుడుచుకుని తన పనిమీద వెళ్ళింది.

మరునాడు-ప్రియబాబు ప్లీడర్ని పిల్చి "వీలునామా మార్చాలి' అన్నాడు. "ఏం మార్చాలనుకున్నారు?" అని ప్లీడరు అడిగాడు. "అల్లుడి పేర మానేసి, ఆస్తి అంతా అమ్మాయి పేరనే రాయించదలిచాను!' అని చెప్పాడు, ప్రియబాబు.

"ఎందుకని?" ప్లీడరు ప్రశ్నించాడు.

"మీరడగాల్సిన ప్రశ్నకాదిది. నే చెప్పినట్టూ మార్చిరాయించండి" అన్నాడు ప్రియనాథబాబు.

# 10

ప్రియబాబు మరణించాడు. కర్మకాండలన్నీ పూర్తి అయాయి. మామ రాసిపోయిన వీలునామా చూసి, కాశీనాథుడు కాస్తంతయినా దుఃఖపడలేదు. ఆశ్చర్య పడనూ లేదు. లోకంలో ప్రతీ నిత్యం ఏం జరుగుతూంవో, ఏం జరగాల్సి వుందో అదే జరిగిందిప్పుడు. ఇందులో దుఃఖపడేటంతగాని, ఆశ్చర్యపడవలసినంతగాని విశేషమేముందీ?—

అయినా, దివాను కాశీనాథుణ్ని ఒంటరిగా పిల్చి చెప్పాడు—"అబ్బాయిగారూ, బాబుగా రలా చేస్తారని నే కల్లోనూ అనుకోలేదు. మొదట ఒక విల్లు రాయించారు—సగం ఆస్తి మీకూ, సగం ఆస్తి కూతురికీ చెందాలని. అది మళ్లా ఎందుకు మార్చారో యేమో, ఎవరి సలహావల్ల వారి బుద్ధి ఇలా తిరిగిందో తెలియకుండా వుంది."

"అంత అవసర మేముంది తెలుసుకోవాలని? దాని గొడవ మీకేం, నాకేం? ఎవరి ఆస్తో ఎవరికో ఇచ్చిపోయారు!" అన్నాడు కాశీనాథుడు.

"అయినా....అయినా....?" అన్నాడు దివాను, తటపటాయిస్తూ.

"అయినా గియినా అంటూ సందేహ పడతారెందుకూ? నిజం ఆలోచిస్తే, ఈ సంపత్తిమీద నాకున్న అధికారమేమిటి? అయితే—అందులో నాకూ సగం ఇచ్చిపోతే మాత్రం అది ఆశ్చర్య పడాల్సిన విషయం. ఇంతకూ—నాకు సగం ఇచ్చిపోవటమన్నా, ఆమెకు పూర్తిగా ఇచ్చేశారన్నా రెండూ ఒకటే, తేడా యేముందీ?—" అని ప్రశ్నించాడు, కాశీ.

మరీ తెల్లబోయాడు దివాను. "లేదు, లేదు. తేడా యేంలేదు. నేనన్నది పెదబాబు గారిని గురించి. వారి ఉద్దేశం నాకు బాగా తెలుసు. అందుకే ఈ మాటన్నాను" అన్నాడు, శుష్కవదనంతో.

."వారు కర్తవ్యం నెరవేర్చుకున్నారు. స్త్రీకి పతికన్న మరోగతి లేదుగా? కాని, పతికి మరొక గతి ఉండవచ్చు. నేనా, స్థితి తక్కువవాణ్ని. ఒక్కమాటుగా ఇంత ఆస్తి చేజిక్కేటప్పటికి కథ అడ్డం తిరగొచ్చు. ఈ అనుమానంతోటే వారిలా మార్చివుంటారు" అని జవాబిచ్చాడు, కాశీ.

లోగడంతా ఆ ముసలి దివాను కాశీనాథుణ్ని గురించి చదివిన మూర్ఖుడనుకుంటూ వచ్చాడు. కాని ఇప్పు డతని నోటినుండి ఇటువంటి తెలివైన మాటలు వచ్చేప్పటికి ధన్య

వాదా లర్పించకుండా ఉండలేకపోయాడు. క్రమక్రమంగా కాశీనాధుడి తెలివి తేటలు ఆ ముసలి ఉద్యోగికి అవగాహ నవుతూ వచ్చాయి.

అక్కడ కమల ఇంకా ఎక్కువగా తబ్బిబ్బులో పడుతూవుంది. భర్త ఎటువంటి మనిషి? అని రోజుకి వందసార్లయినా తనకు తను ప్రశ్నించుకునేది. వందసార్లూకూడా ఆ విఫల ప్రశ్న నిరాశతో తిరిగివచ్చి" అర్థం కావటంలేదు" అని జవాబు చెబుతూండేది.

ఎన్నో సంకల్పాలు చేసింది కమల. ఎన్నెన్నో ప్రయత్నాలు చేసింది. అయినా, ఆ వింత మనిషిని అర్థం చేసుకోలేకపోయింది. అతడు తన మనస్సును తన శరీరంలోనే ఉంచాడా, మరెక్కడయినా విడిచి వెళ్లాడా?—అదీ తెలియదు. ప్రపంచమంతా ఎలా పోతుందో, అలాగే తన భర్తకూడా లోకంతోపాటు పోతున్నాడని మాత్రం ఆమెకు తెలుసు.

భోంచేస్తాడు, నిద్రపోతాడు, జమీందారీ పనులూ, గృహకృత్యాలూ చక్కబెట్టు కుంటాడు, అన్నీ చేస్తాడు, అన్ని విషయాల్లోనూ శ్రద్ధచూపిస్తాడు. అన్ని విషయా ల్లోనూ అతడికి నిరుత్సాహమూ ఉంటుంది. ఆఖరికి తనభర్త కే వస్తువు ఇష్టమో, దేని మీద మక్కువో అన్న సంగతికూడా ఇంతవరకామె తెలుసుకోలేకపోయింది.

కమలకు ఎప్పుడయినా కాస్త సుస్తీ చేస్తేసరి, కాశీనాధుడు రాత్రిం బవళ్ళు ఆమె మంచం దగ్గరే కనిపెట్టుకు నుంటాడు. అప్పుడతని ముఖంలో విచారం, ప్రేమ, వాత్సల్యం—ఇవన్నీ పొర్లు కొస్తుంటాయి. ఆమె కొంచెం కులాసాగా ఉండి తిరుగు లాడుతుంటే—ఎదురుపడినా మరి ఆమెవైపు కన్నెత్తి చూడడు. తన పనిమీద తను పోతూ వుంటాడు.

అలిగి, వరసన రెండేసి రోజులు అన్నం తినకుండా ఉండి చూసింది, కమల. దానివల్ల లాభమేం కనిపించలేదు. మామూలుగానే దగ్గిరకొచ్చేవాడు. వెళ్ళిపోయేవాడు. అంతే కాని, బతిమాలేవాడు కాదు, కంట తడిపెట్టేవాడు కాదు, పలకరించేవాడు కూడా కాదు. ఎప్పుడయినా కమల పలకరిస్తే చాలు, చిరునవ్వుతో ఎప్పటిలాగే మాటాడేవాడు. ఏనాడూ ఆమెపై కోపగించుకోలేదు, "రెండు రోజులుగా మాటాడ్డం మానేశావే, ఎందుకు నామీదకోపం?" అనైనా అడగలేదు.

ఉదాసీనంగా ఉంటున్న తన భర్తను గురించి కొన్నాళ్ళపాటు కమల తర్జన భర్జన చేసుకుంది. "నువు నన్ను లక్ష్యం చెయ్యటంలేదు, నేనూ నిన్ను లక్ష్యపెట్టకుండా ఉండ గలుగుతానని" తన ఉద్రేకాన్ని వెల్లడించటానికి నిశ్చయించుకుంది.

"నీ కాళ్ళకింద పడి నలగటానికీ, నీ పాదాలు పట్టుకు తిరగటానికీ కాదు—నేను నిన్నంతగా ప్రేమించడం. దయదలిచి నిన్ను నా భర్తగా చేసుకున్నాను. అంతమాత్రాన

నా ప్రాణాలు నీ పాదాల ముందు పడివున్నాయనిగానీ, నిన్ను చూడగానే తియ్యటి చిరు నవ్వులతో ప్రేమ లాలింపులు చేస్తాననిగానీ అనుకోవద్దు—" అన్నట్టుగా, భర్తను చూడగనే మొహం తిప్పుకుని గంభీరంగా తన పనికిపోయేది, కమల.

ఎప్పుడయినా కమల నవుకర్లని కోప్పడుతున్నప్పుడు దైవ వశాత్తు కాశీనాధుడు, ఏమైనా అందుకుంటే చాలు, ఆ మాట వినీ విననట్టుగా—"నా నౌకర్లు, నా యిల్లు, నా యిష్టం, ఏమైనా అనుకుంటా. మధ్యని కల్పించుకోటానికి నువ్వెవరవు?" అన్నట్టు మరింత రెచ్చిపోయేది.

అయితే, అంత మాత్రాన సంతృప్తి ఏం కలుగుతుంది? ఈ విధంగా ఆమె కోరిక ఏం తీరుతుంది? కించిత్తయినా కాశీనాధుణ్ణి కదిలించగలిగితే అప్పుడు కాస్త సంతృప్తి కలిగేదేమో!—

ఎవరెన్ని చేయనీ—కాశీనాధుడి ప్రశాంతమైన గంభీర లలాటం ఇలా సమాధాన మిస్తూండేది—"నాలో నేను నిశ్చలంగానే వున్నా. నేను మేరుపర్వతాన్ని. నన్ను కదిలించే శక్తి అణుమాత్రమైనా నీలో లేదు. నువ్వెన్ని తుఫానులు రేపినా నన్ను కదల్చ లేవు."

కమల ప్రేమిస్తూందో, లేదో! కాని, ఆ ప్రేమ అనంతమూ అగాధమూ కాదు. ఆమె ఒక గీటు గీసి "ఇది దాటి పోవద్దు నువ్వు. పోతే నేను సహించలేను. అప్పుడూ ప్రేమిస్తాను, కాని ఇప్పటిలా నిన్ను గౌరవించలేను" అంటూ చెప్పాలనుకుంటుంది.

*   *   *

ఒక రోజున—

ముసలి దాసీ ముందు ఆమె తన దుఃఖాన్ని వెల్లడించింది: "బాబుగారు నన్నొక జంతువు చేతిలో పెట్టి పోయారు" అన్నది.

"అదేమిటమ్మా?"

"నన్నడుగుతా వెందుకు? మీరంతా కలిసి కాళ్ళూ చేతులూ కట్టి నూతిలో పారెయ్యక?"

"అలాంటి మాట లనగూడదమ్మా!"

"ఎందు కనగూడదు? మీరు చేసిన పనిని ఒక్కమాటైనా నోరెత్తి అనుకోకూడదా నేను?

"అది కాదమ్మా. కొంచెం మతిభ్రమణ కనబడుతుందిగానీ, ఆయన చాలా మంచి మనిషమ్మా. తండ్రిలో కూడా కాస్త ఇలాటి లక్షణాలే ఉండేవి. అలాగే కొడుక్కి కూడా—"

"వాగబోకు, మతిభ్రమ అనేమాట రానియ్యబోకు. తండ్రికి ఉంటే కొడుక్కి ఉండాలని వుందా? మతిభ్రమా కాదు, ఏం కాదు, తెలిసే నన్నిలా వేధిస్తున్నారు"

భర్తకి మతిభ్రమ అనే విషయం ఒప్పుకోవాలంటే ఆమె మనస్సుకి చాల కష్టం కలిగింది.

మూడు రోజులయింది ఇవాల్టికి. అంతూ పొంతూలేదు కాశీనాధుడు. కమలకు తెలిసినా కూడా పట్టించుకోలేదు రెండ్రోజుల దాకా. కాని, మూడోనాడు జవాన్ని పిలిచింది. "రెండు రోజులాయె బాబుగారు ఇంటికి రాలేదు గదా, ఏమీ పట్టించుకోనే లేదేమ్రా ఒక్కరున్నూ? మరి మీరంతా ఎందుకురా?" అంటూ వాడిమీద మండిపడింది.

"బలేగా వుందే. ఎవరెక్కడికి వస్తారో, పోతారో మాకేం తెలుస్తుందమ్మా!" అని సణుక్కుంటూ పోయాడు జవాను. తరవాత తెలిసింది షరాబు ద్వారా—బాబుగారు మూడువేలు తీసుకుని వెళ్ళారని. కాని, ఎక్కడికి వెళ్ళారో, తిరిగి ఎప్పుడొస్తారో ఎవరికీ చెప్పిపోలేదాయన.

నెత్తిమీద చేతులు పెట్టుకుని, కాస్సేపు దిగాలుపడి కూర్చుంది కమల. తరవాత తండ్రిగారి వకీల్ని పిలిపించింది. "చూడండీ, మా జమీందారీ వనిపాటులు చూసుకోగల సమర్థుణ్ణి ఒక వారం రోజుల్లోగా కుదర్చండీ—జీతం ఎంతైనా సరే, ఇద్దాం!" అని చెప్పింది.

# 11

రోజల్లా ధారపోతగా వర్షం, ఎక్కడ చూసినా, మోకాళ్ళలోతు నీళ్ళు. బాడి-వీటిల్లో పడి, సాయంత్రానికల్లా ఎలానో ఒకలా ఓ చిన్న గొందిలో ఉన్న ఇంట్లో ప్రవేశించాడు కాశీనాధుడు, కలకత్తా చేరుకున్నాక. అతడి చేతిలో ఉన్నవి రెండు మందు సీసాలు, ఒక బిస్కత్తుల టిన్ను, పై పంచే, మూటలో ఏవేవో ఫలజాతులు.

ఆ యింటి గదిలో ఒక రోగి మంచం మీద మూలుగుతూ పడివున్నాడు. తలవైపున ఒకామె కూర్చుని తలొత్తుతూంది. కాశీనాధుడు లోపలికెళ్ళగానే ఆమె అన్నది: "ఇంత వానలో తడుస్తూ వొచ్చావెందుకు, బావా? కాస్సేపు ఎక్కడయినా నిలబడకపోయావ్?"

"నిలబడితే కలిగేటంత నష్టం తడిస్తే ఉండదమ్మా."

కాశీ బావ చెప్పిన మాట అబద్ధంకాదని తెలుసుకుంది బిందు. అందుకని మాటాడలేదు.

కొన్నేళ్ళపాటుగా బిందు పడుతున్న కష్టాలు తనకు తెలుసు, దేవుడికే తెలుసు. అవిడ పుట్టింటినుంచి వెళ్ళిపోయింది కదా? ఆ నాడు జమీందారుగారి అమ్మాయిని చూదామని ప్రయాణమై కూడా వెళ్ళలేక పోయింది. మర్నాడే, తన మామ గోపాలబాబుకి జబ్బుగా ఉన్నట్టు కబురు వచ్చేటప్పటికి బయల్దేరి అక్కడికి వెళ్ళింది.

నిజానికి అతగాడికి ఎంతో జబ్బు చేసింది. ఎవరెన్ని మందులిచ్చినా మాట దక్కలేదు. చాలా గడ్డుగా వున్న స్థితిలో ఆయన 'చిన్న కోడల్ని ఒక్కమాటు పిలిపించండి. కడసారిగా చూసుకుంటాను' అని చెప్పాడు.

ఆ చిన్న కోడలే మన బిందువాసిని. ఇహ పోతాడనగా గోపాలబాబు కోడల్ని పిల్చి "ఇదిగో, ఈ తాళంచెవి తీసుకో అమ్మా! ఆ పెట్టెలో ఉన్నవన్నీ నీకే. నే నిచ్చి పోతున్నది గాక, తృణమో పణమో సంపాయించుకున్నారంటే మీకు హాయిగా గడిచి పోతుంది" అని చెప్పిపోయాడు.

చెయి జాపి, బిందు తాళంచెవి అందుకుంది. ఉన్న ముల్లె అంతా ముసిలాడు చిన్న కోడలికే ఇచ్చిపోయా డనుకున్నారు, తక్కిన కోడళ్ళు.

మరోసంగతి: చనిపోతూ గోపాలబాబు కొడుకుల్ని పిల్చి—"అబ్బాయిలూ, మీలో ఒకళ్ళకూ ఒకడిపొత్తు ఒకడికిలేదు. మీ అమ్మ కూడా పోయింది కదా. నా తదనంతరం మీరు కలిసి మాత్రం ఉండొద్దు" అని హెచ్చరించాడు.

తండ్రి పోయిన మర్నాడే అన్నదమ్ములు నలుగురూ వేరుపడ్డారు. ఒకరోజున మామ యిచ్చిపోయిన పెట్టె తెరిచి చూపింది, బిందు. అందులో రామాయణం, మహాభారతం తప్ప మరేమీలేవు. తన ఆశ నిరాశ అయిపోయింది. అయినా, చచ్చి స్వర్గాన ఉన్న మామగారి దానం కదా అని, భక్తితో కళ్ళకద్దుకుని తీసుకుంది. వారిచ్చిపోయిన ఈ స్నేహదానమే ఒక రతనాల మూటగా చూసుకుంది.

బిందు జీవితం కొంతకాలంపాటు సుఖంగానే గడిచింది. ఆ తరవాత ప్రారంభ మైనాయి కష్టపరంపరలు.

ఆమె భర్త యోగేశబాబు జబ్బు పడ్డాడు. తన ఒంటికవుతుందా అని చూడక, రాత్రీ పగలూ అనక, బిందువాసిని భర్తనే కనిపెట్టుకు నుండి శుశ్రూష చేసింది. వారి కున్న కొంద్ర కాస్తా కొదువపెట్టి తెచ్చి, చికిత్స చేయించింది. జబ్బేం నయం కాలే. "ఇక్కడ కాదు, కలకత్తా తీసుకువెళ్ళారంటే నిమ్మళిస్తుంది" అంటూ ఇరుగు పొరుగులు సలహా ఇచ్చారు. వాళ్ళ మాట ప్రకారం బిందు తన వంటినున్న నగ నాణ్యం శీదాగా అమ్మేసి భర్తను కలకత్తా చేర్చింది. అక్కడ లెక్కలేనన్ని రకాల చికిత్సలు జరిగాయి. కాని వ్యాధిమటుకు మళ్ళలేదు.

ఇంకా ఘన వైద్యులచేత గొప్ప వైద్యం చేయిస్తే ఆయనకు బాగవుతుందన్నారు కొంతమంది. అటువంటి పని చేయించాలంటే ఇప్పుడు చేతులో డబ్బేదీ? ఈ పరిస్థితులన్నీ బిందు తన పెద్ద బావకు వివరంగా రాసింది, కాని జవాబయినా రాలేదు. ఇది పనిగాదని




మరదు లిద్దరికీ ఉత్తరాలు రాసింది. వారూ అంతే. ఇక చేసేదేముందీ?—పస్తులైనా ఉండాలి, విషమైనా తాగి చావాలి. మరో ఉపాయంలేదని నిశ్చయించుకుంది, బిందు.

యోగేశబాబు భార్య మొహం చూసి అంతా గ్రహించేవాడు. ఒక రోజున ఆమెను పిలిచి దగ్గర కూర్చోబెట్టుకుని ఇలా అన్నాడు, స్నేహపూర్వకంగా చెయ్యి నిమురుతూ: "బిందూ!—నన్ను మనవూరికి తీసుకుపోరాదూ? చస్తే అవతలి కీడ్చిపారేసే దిక్కు కూడా లేదిక్కడ."

ఈ మాట బిందుకు హృదయశల్యమైంది. చావు తప్ప గత్యంతరం లేదనిపించింది. భర్తని ఇంటికి తీసుకుపోవాలి, ఎలా? భర్తను ఈ స్థితిలో వుంచి, తను చావాలంటే మాత్రం కుదురుతుందా?—మరి చావాలే అనుకుంటే సిగ్గూ ఎగ్గూ చూస్తే ఎలా?—ఇలా పరిపరివిధాల పోయింది ఆమె మనస్సు. బాగా ఆలోచించింది, ఆఖరుకి సిగ్గు విడిచి ప్రస్తుత స్థితిగతులూ తన దీనావస్థా వివరిస్తూ కాశీనాథుడి పేర ఒక ఉత్తరం రాసింది.

* * *

లోగడ ఒక వార్త విన్నాం: ఒకనాడు కాశీనాథుడు మూడువేలు షరాబునడిగి పుచ్చుకొని ఎక్కడికి వెళ్ళిపోయాడో ఎవరికీ తెలియదు—అని. బిందు రాసిన పై ఉత్తరానికి ఫలితమే ఈ సంఘటన.

* * *

కాశినాధుడు తెచ్చిన పైకంతో కలకత్తాలో దిగాడు. తగినంత ఖర్చుపెట్టి మంచి మంచి డాక్టర్ల సలహాలు తీసుకున్నాడు. వారందరూ ఒకే ఒక సలహా ఇచ్చారు— గాలిమార్పు కావాలి, అందాకా స్వస్థత చిక్కదు, అని.

ఆ ప్రకారం యోగేశబాబునీ, బిందునీ తీసుకుని కాశీనాధుడు "వైద్యనాథ్"కి వచ్చాడు. అక్కడ ఆర్నెల్లున్న మీదట యోగేశబాబుకి కొంచెం వ్యాధి మళ్ళుముఖం పట్టినట్టు కనిపించింది. అయినా ఇంకో నెల రోజులు అక్కడే ఉండటం అన్ని విధాలా మంచిదని తోచి, కాశీనాధుడు వాళ్ళని వదిలిపెట్టి ఇంటికి వచ్చేశాడు.

# 12

ఉదయానే కనబడింది, కమల. "ఎప్పుడొచ్చారూ?" అనడిగింది.

"రాత్రి" అన్నాడు కాశీనాధుడు.

తన పనిమీద వెళ్ళిపోయింది, ఆమె.

కాశీనాధుడు ఇవతలికి వచ్చేసి, మామూలుగా కచేరీకి వెళ్ళాడు. చాలా రోజులకు ఇవాళ హఠాత్తుగా చూసేటప్పటికి అంతా లేచి నిలబడ్డారు. కాని, సూట్‌తో వున్న ఒక యువకుడు మాత్రం కుర్చీలో అలా కూర్చుని, తనపని చూసుకుంటూనే ఉన్నాడు. ఇప్పుడు లోపలికి వచ్చిన ఆ వ్యక్తికి పరివారమంతా స్వాగతమివ్వటమూ అతడు గమనించ లేదు.

ఒకచేత్తో కాశీనాధుడు ఈజీచైర్ దగ్గరికి లాగి కూర్చున్నాడు.

కొత్త మేనేజరుగా వచ్చినతడిపేరు విజయకిశోరదాసు. కలకత్తా బియ్యే. మంచి కార్యదక్షుడు. అందుకనే వినోదబాబు అతన్ని మేనేజరుగా నియమించాడు. కొత్త మేనేజరు కొంచెంసేపటికి తల ఎత్తి చూసి, "యేం పని మీద వచ్చారూ?" అని అడిగాడు.

"లేదు. పనేమీలేదు. ఇక్కడి పని పాటులు చూట్టానికని వచ్చాను".

అంతలో దివాను లేచి, "వేరే జమీందారుగారి అల్లుడు" అని చెప్పాడు.

విజయబాబు వెంటనే లేచి అతనికి నమస్కరించాడు. ఇంతలో లోపలి నుంచి నవుకరొచ్చి,—"మిమ్మల్ని పిలుస్తున్నారు" అన్నాడు.

లోపలికి వెళ్ళాడు విజయబాబు.

* * *

దివానుని అడిగాడు కాశీనాధుడు—

"ఇతనెవరు?—"



"కొత్త మేనేజరు."

"ఎవరు నియమించారు?"

"అమ్మగారు."

"ఎందుకని?"

"పన్లు సరిగా సాగటంలేదని కాబోలు."

"ఇప్పుడెక్కడికి వెళ్ళారు?"

"లోపలికి___"

* * *

ఇంకేం మాటాడలేదు కాశీనాధుడు. లోపలికి వెళ్ళాడు, చూశాడు___గదిలో పరదాకి ఎదురుగా నిలబడి వున్నాడు విజయబాబు. లోపలినుంచి ఒక మృదుస్వరం వినబడుతూంది. గ్రహించాడు కాశీ. ఎవరు ఎవరితో మాటాడుతున్నదీ తెలుసుకున్నాడు. మౌనంగా బయటికి వచ్చేశాడు.

మధ్యాహ్నం ఎదురుపడింది కమల.

"ఆరోగ్యం బాగుందా?" అని గంభీరంగా అడిగింది.

"బాగానేవుంద"న్నాడు కాశీనాధుడు.

మరేం మాటాడకుండా వెళ్ళిపోయింది, కమల.

* * *

నించునైనా మాటాడ్డానికిగాని, హస్కొవేసుకోటానికిగాని ఇప్పుడామెకు తీరికలేదు. అబ్బా___ఎన్నిపనులు!___జమీందారీ పన్లతో కమల ఉక్కిరిబిక్కిరయి పోతూంది. ఊపిరి పీల్చుకోటానికి కూడా తీరటంలేదు.

ఒకనాడు ఉదయాన___కొత్త మేనేజర్ని ఒకమాటు రమ్మని కబురెట్టాడు కాశీనాధుడు. "ఇప్పుడు తీరికగాలేదు. తీరిక కాగానే వస్తా"నంటూ సమాధానం చెప్పి పంపాడు, నవుకరుతో, ఆయన.

తనే స్వయంగా కచేరీకి వచ్చాడు కాశీనాధుడు. విజయబాబును ఒంటరిగా పిల్చాడు___ "మీకు తీరికలేదని నేనే వచ్చాను. ఇవ్వాళ నాకు ఐదువందలు అవసరం. మీ తీరిక చూసుకుని పంపించండి" అని చెప్పాడు.

"ఎందుకోసం?"

"అది మీ రడగవలసిన ప్రశ్నకాదు."

"నిజమే. అడగవలపిన ప్రశ్నకాదు. కాని అమ్మగారి అనుమతి లేకుండా నేనెలా యివ్వగలనూ?"

"నే చెబితే చాలదా, ఇంకెవరిదో అనుమతి ఎందుకోసం?"

"ఎవరికిబడితే వారికి డబ్బివ్వొద్దన్నారు"___నిష్కర్షగా చెప్పాడు, విజయబాబు.

కాశీనాధుడు కమల దగ్గిర కెళ్ళాడు.

"ఆ కొత్త మేనేజర్ని తొలగించాలి" అన్నాడు.

"ఎవర్ని?"

"మీ కొత్త మేనేజరుగా వచ్చినతన్ని."

"ఎందుకని? ఏం తప్పు చేశాడూ?"

"నా పట్ల సరిగా మసులుకోవటంలేదు."

"ఏం చేశాడేం?"

"నేను రమ్మనమని కబురంపితే రాకపోవటం సరికదా, నా కిప్పుడు తీరికలేదు, తీరిక కాగానే వస్తానంటూ నవుకరుతో చెప్పి పంపాడు."

"తీరిక లేదేమో, చేతిలో పనివుంటే వొదిలేసి ఎలా రావటం, చెప్పండీ" అంది కమల నవ్వుతూ.

"సరే, తీరికలేదు, చేతిలో పనివుందీ.అందుకని రాలేకపోయాడు.అంతవరకూ బాగానే వుంది. నేనే స్వయంగా వెళ్ళి డబ్బడిగితే "అమ్మగారి అనుమతి లేందే నే నెలా ఇవ్వ గలనూ?" అనడం ఏమన్నా బాగుందా?" అని అడిగాడు కాశీనాధుడు, భార్య మొహం వేపు చూస్తూ.

"ఎంత అడిగారు?" అని ప్రశ్నిస్తూ కమల విరగబడి నవ్వింది.

"అయిదు వందలు."

"ఇవ్వలేదూ?"

"లేదు. నా కివ్వొద్దని నువ్వేమైనా చెప్పావా?"

"అవును—ఇలా డబ్బు హరించటం నా కిష్టంలేదు."

ఎంత జడుడని అనుకున్నప్పటికీ, కాశీనాధుడికి చాలా దుఃఖం కలిగింది. ఇటువంటి వ్యవహారం, ఇలాంటి మాటలూ ఇంతకుముందెప్పుడూ అతడు వినలేదు. "నా కివ్వడ మంటే హరించటమా!" అని ఎంతో బాధతో పదేపదే అన్నాడు.

"ఏ రూపంగా నయితేనేం, నష్టపరచడం హరించడమే అనిపించుకుంటుంది"అన్నది, కమల.

"అవసరానికి డబ్బు ఖర్చు పెట్టుకోవడం హరించడం కింద రాదు." అన్నాడు కాశీనాధుడు.

"ఏమిటా అవసరం, ఇప్పుడు?"

"ఎవరికో ఇవ్వాలి."

"ఇస్తే మళ్ళీ వచ్చే విధానం?—నీ ముల్లె ఏమయినావుంటే పోయి యిచ్చిరా, నే వొద్దన్ను!"

మరి మాటాడలేక పోయాడు కాశీనాధుడు. ఈ మాట లతని హృదయానికి అగ్ని బాణాల్లా గుచ్చుకుని లోపలికంటా చొచ్చుకుపోయాయి.

బయిటికి వచ్చేశాడు. తన అధీనంలో వున్న చే గడియారం వేలి ఉంగరం అవ్వీ అమ్మేసి, వైద్యనాథ్‌కి మనియార్డరు కట్టాడు. కూపన్‌లో ఇలా రాశాడు: "బిందూ!—మరి అడగవద్దు. ఇంకేమీ లేదు."

# 13

ఆనాడు మొదలుకుని మళ్ళీ లోపలికి రాలేదు కాశీనాధుడు. కమల ఏమీ అడగనూలేదు.

కొన్నాళ్ళు గడిచింది.

ఒకరోజున నౌకరు వచ్చి చెప్పాడు కాశీనాధుడితో: "మీ కోసం ఎవరో బ్రాహ్మడు వచ్చాడండి!"

కాశీనాధుడు వెళ్ళిచూశాడు. ఒక ముసిలి బ్రాహ్మడు జందెం నలుపుకుంటూ వాకిట్లో నిలబడి వున్నాడు. కాశీనాధుణ్ణి చూడగనే—"బాబూ!—మీరు మహాదాతలు. ఈ పేద బ్రాహ్మడి సర్వస్వాన్ని అపహరించకండి...." అంటూ విన్నవించుకున్నాడు.

"ఏమిటి విషయం?" భయపడుతూ అడిగాడు కాశీనాధుడు.

"తమరు శ్రీమంతులు. దేవుడిచ్చింది బోలెడంత ఐశ్వర్యముంది మీకు. నాకీ గడ్డ తప్ప మరో ఆధారంలేదు. దీన్ని కాస్తా నిలపండి స్వామీ!—" అంటూ లబలబా ఏడిచి మొత్తుకున్నాడు.

కంగారెత్తింది కాశీనాధుడికి. బ్రాహ్మడి చెయ్యిపట్టుకుని దగ్గరసా కూర్చోబెట్టుకున్నాడు. అసలు జరిగిన సంగతేమిటో చెప్పమని లాలనచేసి అడిగాడు.

బ్రాహ్మడింకా ఏడుస్తూనే వున్నాడు. మాన లేదు. "మీరు ధర్మాత్ములు, క్షేత్రపాల్ భూమి నాదవునా కాదా, నిజం చెప్పండీ" అన్నాడు.

"మీదే. కాదని ఎవరంటారు?"

"అయితే—మీ కొత్త మేనేజరుగారు నా మీద దావా ఎందుకు వేసినట్టూ?"

"దావా వేశాడా!—నాకు తెలియదే?"

సమను చూపించాడు, బ్రాహ్మడు.

"బాబుగారూ! ప్రభువులు దావావేస్తే నేనూ అంతు చూడగల. అంత చచ్చు దద్దమ్మ నేంగాదు. మిమ్మల్ని సాక్ష్యం వేసుకుంటా, అనుగ్రహించండి. నాలాటి పేదవాడు వ్యాజ్యంలోకి దిగడమంటే—కొండతో గొర్రె పోట్లాడటం లాంటిది, నాకూ తెలుసు. మంచిది కాదని నేనూ ఎరుగుదును. అయితేనేం?—కాలం అడ్డం తిరిగిందే? ఇదుగో బాబుగారూ, ఒకటేమాట! ఇందులో ఓడిపోతే చివరికి జోలెవేసుకుని బిచ్చమైనా ఎత్తుకు బతుకుతా గానీ, జాగా మాత్రం అంత తేలిగ్గా వొదిలేస్తా ననుకోకండి!" అన్నాడు, దుఃఖంతో మిళితమైన పౌరుషంతో.



కోపంతో పోబోతున్న బ్రాహ్మడి చెయిపట్టుకుని ఆపుజేశాడు కాశీనాధుడు. "మీరేం అనవసరంగా తొందరపడబోకండి. నేనూ ప్రయత్నించి చూస్తా" నని అభయమిచ్చాడు.

బ్రాహ్మడు వెళ్లిపోయాడు.

*　　　　*　　　　*

తరవాత కాశీనాధుడు విజయబాబుని పిలిచి అడిగాడు: "ఆ క్షేత్రపార్ పొలం మనది కాదు. ఉత్తపుణ్యానికా బ్రాహ్మణ్ణి ఏడిపిస్తారెందుకూ?"

"అమ్మగారి అనుజ్ఞ!"

"ఏమిటనుజ్ఞ? పరాయివాళ్ళ సొమ్ము అపహరించటం నేర్పిందా, అమ్మగారూ?"

"అది మనభూమి."

"కాదు, మనది కాదు."

కొంచెంసేపు ఊరుకున్నాడు విజయబాబు, మళ్ళీ చెప్పాడు: "నేను నవుకర్ని. యజమాని ఎలా చెబితే అలా చెయ్యాలి."

*　　　　*　　　　*

ఈ మాట కమలకు చెప్పాలంటే కాశీనాధుడికి సిగ్గుతోచింది. అయినా ఆపుకోలేక పోయాడు. "ఆ భూమి నీది కాదు. బ్రాహ్మడి ఆస్తి అపహరించటం న్యాయం కాదు" అన్నాడు.

"అపహరిస్తున్నారని ఎవరన్నారు?"

"ఎవరంటే యేం? ఆ భూమి మాత్రం నీది కాదు. అన్యాయపు వ్యాజ్యం వెయ్యొద్దని చెప్పు, విజయబాబుగారితో."

కమలకు కోపం వచ్చింది. "విజయబాబుకంతా తెలుసు. అతడు కార్యశూరుడు. వారి పనిలో మీరు అనవసరంగా జోక్యం కల్పించుకోవటం మాత్రం మంచిది కాదు," అన్నది.

అనుకున్నట్టుగానే దావా పడింది. కాశీనాధుడు ఒకసాక్షి కదా! కోర్టువారి ఎదుట బోనెక్కి నిలబడి ఇలా సంజాయిషీ చెప్పాడు: "మా మామగారు ప్రియనాధబాబు జీవించి ఉన్నప్పటినుంచీ నే నీ జమీందారీ వ్యవహారాలు చూస్తూ వచ్చాను. ఆయన తదనంతరం కూడా చాలా కాలంవరకూ నేనే చూశాను. సదరు క్షేత్రపాల్ భూమి కమలాదేవిది కాదు అని మాత్రం నాకు బాగా తెలుసు."

వ్యాజ్యం ఓడింది. విజయబాబు మొహం వాడింది. చిన్నబోయిన వదనంతో ఇల్లు చేరుకున్నాడు.

ప్రతివాది అయిన పేద బ్రాహ్మడు చేతులు రెండూ ఎత్తి కాశీనాధుణ్ణి ఆశీర్వదిస్తూ ఇంటికి వెళ్ళిపోయాడు.

# 14

విజయబాబు పరదాముందు నిలబడి, వ్యాజ్యాన్ని గురించి అమ్మాయిగారికి విశద పరుస్తున్నాడు. వ్యాఖ్యానం చేసి చేసి, చివరికి—"బాబుగారి మూలాన్నే మన దావా పోయింది" అని తన అభిప్రాయాన్ని వెల్లడించాడు.

దానిమీదట—ఇంతవరకూ చాలాసేపట్నించి మౌనంగా ఉన్న కమల ఉద్వేగంతో అంది: "మీ రొక్కసారి లోపలికి రండి, ఇంకా మాటాడవలసిన విషయాలు చాలా వున్నాయి." లోపలికెళ్ళాడు విజయబాబు. చాలాసేపు ఇద్దరిమధ్యా రహస్య గోష్ఠి జరిగింది. తర్వాత విజయబాబు బయటికి వచ్చేశాడు.

* * *

చాలా రోజుల తరవాత—

కాశీనాధుడు భోంచేస్తుండగా కమల వచ్చి కూర్చుంది. కాస్సేపయ్యాక ఇలా అడిగింది: "సువర్ణలంక భస్మమైపోయింది కుటుంబద్రోహి అయిన విభీషణుడి మూలానే. తెలుసు కదూ?—"

"ఆఁ—తెలియకేం?—తెలుసు" అని తింటూనే సమాధాన మిచ్చాడు కాశీనాధుడు.



"మీకు తెలియకపోవడమేమిటి లెండి? అతడూ పరభోజనంతో పెరిగినవాడేగా?" అన్నది కమల.

జవాబు చెప్పలేదతడు.

కాస్సేపు కమల ఊరుకుని ఇలా అంది: "ఇప్పటిదాకా పరాన్నం తిని పెద్దవాడైన వ్యక్తికి— "ఇహముందయినా వారు దయతలిస్తేనే నీ నోటి దగ్గరికి ముద్ద వచ్చేది" అనే సత్యం చెప్పాల్సిన అవసరమేముందో?—ఏం చూసుకునో, ఆ పెద్దమనిషి కింత అహంకారం?"



ఆ వెంటనే మళ్ళీ అన్నది: "గొడ్లను కోసుకునే కసాయివాడైనా సొమ్ముతిన్నవారిని రొమ్ము గుద్దుతాడనుకోను."

"కమలా!__" అని పిలిచాడు కాశీ.

"పెళ్లాం సొమ్ము తిని బతికే వాడికి ఇంత అదిరిపాటు పనికిరాదు. రాను రాను మీ వాలకం చూస్తూంటే...." అన్నది కమల.

సగం సగం తింటున్న కంచం దూరంగా అవతలికి తోసేశాడు కాశీనాధుడు. కమల మొహంకేసి తదేకదృష్టితో చూస్తూ అన్నాడు: "కమలా!—ఇంతకు ముందెప్పుడూ నోరు తెరిచి నిన్నొకమాట కూడా అనలేదు, నేను. ఇటువంటి మాట—అంటే, ఇప్పుడు నువ్వన్నటువంటి మాట—ఇంతవరకూ ఎవరూ అనివుండ లేదు. దీనివల్ల నీకు కలిగే సుఖమేమయినా వుందా? ఉంటే, ఇదుగో-ఇవ్వాళనుంచే మీ ఇంట ముద్ద నోట పెట్టను" అని చెప్పి లేచి నిలబడ్డాడు.

కమలా లేచి నిలబడింది అతనితోపాటు సగర్వంగా, "నువ్వు సత్యవాది వయితే—నీది మనిషి జన్మ అయితే—నీ ప్రతిజ్ఞను పాలించుకుంటావు" అన్నది అహంకారంతో.

"ఆఁ—తప్పకుండా పాలించుకుంటాను. అయితే ఒకటి గుర్తుంచుకో. నువ్వన్న మాట నీకు చిరశత్రువు సుమా! నిన్ను నేను క్షమించాను. కాని భగవంతుడు క్షమించడు."

"ఇలాంటి పిల్లిశాపాలు చాలా చూశాం," అంటూ మరీ మండిపడింది కమల.

"శాపం కాదిది. ధర్మబుద్ధి కలిగి ఉండు, సుఖపడు అని ఆశీర్వదిస్తున్నా" అన్నాడు కాశీనాధుడు.

ఇలా అనేసి కాశీ బయటికి వచ్చాడు. తన గ్రంధజాలమంతటినీ-వ్యాకరణ, సాహిత్య, దర్శన, స్మృతి గ్రంధాలన్నింటినీ ఒక్కొక్కటే చించిపారేశాడు. నవుకర్లను పిలిచాడు, తన కున్నది కాస్తా వాళ్ళకు పంచిపెట్టేశాడు.

రాత్రి—కమల గదికి వెళ్ళి, "కమలా! కమలా!" అని తలుపు తట్టి పిల్చాడు. ఆమె మేలుకునే వుంది, కాని పలక లేదు. తలుపు తీసే వుంది. తోసుకుని లోపలి కెళ్ళాడు, చూశాడు. కళ్ళు మూసుకుని కమల మంచం మీద పడుకునుంది. మంచం మీది కెళ్ళి కూర్చుని, తల నిమురుతూ "కమలా!" అని పిలిచాడు కాశీ. సమాధానం లేదు. లేచి వచ్చేస్తూ, "నీ కిదే నా ఆశీర్వాదం!" అని ఇవతలకి వచ్చేశాడు.

కాశీనాధుడు వెళ్ళిన తరవాత పక్క మీదినించి లేచింది, కమల. కిటికీ దగ్గరి కెళ్ళి కూర్చుంది. ఆమె అలా కూర్చుని ఉండగానే తెల్లవారుతూంది. మళ్ళా వెళ్ళి పక్కమీద పడుకుంది.

## 15

మెలుకువొచ్చి కన్ను తెరిచి చూసేటప్పటికి చాలా పొద్దెక్కింది. ఇల్లంతా గల్లంతుగా వుంది! కమల ఇంకా బాగా మేలుకోకముందే దాసీది వొచ్చింది, పరుగెత్తుకుంటూ: "ఎంతపని జరిగిందమ్మగారూ! బాబుగారి నెవరో ఖూనీ చేశారు!!" అంటూ కంగారుగా అరిచింది.



తడబడుతూ లేచి వచ్చింది, కమల.

"ఖూనీయా!?"

"అవును, ఖూనీ:—" ఎవరో బదులు చెప్పారు.

కట్టుబట్ట ఒంటి మీద సరిగా లేనే లేదు, గభీమని పరుగెత్తి కొచ్చింది కమల. చూసింది—స్మృతి తప్పిపడివున్నాడు కాశీనాథుడు!—సోఫా మీద. ఒళ్ళంతా నెత్తురు మయం—ముక్కులోంచి నోట్లోంచి ప్రవహించిన రక్తం ఎక్కడి దక్కడే ఎండి పోయింది. అంతటా దుమ్ము పేరుకుపోయింది!

ఒక్క కేకవేసి, తెలివి తప్పి పడిపోయింది, కమల.

ఊరంతా పాకిపోయింది వార్త. "జమీందారుగారి అల్లుడు అర్ధరాత్రి వేళ ఎక్కడికో వెళుతుంటే, దార్లో ఎవరో ఖూనీ చేశారు!—"

రెండురోజులయాక కాశీనాధుడికి తెలివొచ్చింది.

"ఎవరు మిమ్మల్నిలా చేశారు?" అని పోలీస్ ఇన్స్పెక్టరు కాశీనాథుణ్ణి అడిగాడు.

"వాడు" అని చెప్పాడు, కాశీనాధుడు పైకి చూపించి.

"వాళ్ళని మీరు గుర్తించలేదా?"

"గుర్తించాను" అస్పష్టంగా జవాబిచ్చాడు కాశీనాధుడు.

"ఎవరు వాళ్ళు?" కంగారుగా అడిగాడు ఇన్స్పెక్టరు.

కొంచెంసేపు ఊరుకొని, కాశీనాధుడు—"పొరపాటు. నేను వాళ్ళని గుర్తించలేదు" అన్నాడు.

మళ్ళీ మళ్ళీ అడిగాడు పోలీసు అధికారి. లాభంలేకపోయింది. ఏమీ చెప్పలేదు కాశీ.

కాశీనాధుడు మర్నాడు దివాన్‌ని పిలిచి, 'వైద్యనాధ్‌లో ఉంది బిందువాసిని, ఆమెను చూడాలని వుంది, ఎవరినైనా పంపించి తీసుకురమ్మనండి" అని చెప్పాడు.

మూడోరోజుకల్లా బిందువాసినీ, యోగేశబాబూ వచ్చారు. నిబ్బరం గలది బిందు. కాశీని చూడగనే, కమలలాగ ఆమె ఆత్రపడలేదు, తెలివి తప్పనూ లేదు. కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ—"ఇంతపనికి ఒడిగట్టింది ఎవరు బావా?" అని ప్రశ్నించింది.

"ఏమో, ఎట్లా తెలుస్తుంది?"

"నీ కెవరిమీదయినా అనుమానముందా?"

"ఆ సంగతి అడక్కు, బిందూ!"

బిందు కాశీనాధుని మొహంకేసి చూస్తూ ఉండిపోయింది.

ఆ గాయాలు నయమవుతాయనీ, కాశీ బతుకుతాడనీ ఎవ్వరికీ నమ్మకం లేదు! అవసానకాలం దగ్గిర కొస్తూంది. జ్వరం ప్రకోపించింది, సంధి పుట్టింది. పిచ్చిమాటలాడుతున్నాడు. ఆ పేలాపనలోనే "కమలా, ఇది నీ పనికాదుగద చెప్పు — కమలా!" అంటున్నాడు.

బావ మొహం దగ్గరసా మొహంపెట్టి—"ఏమి టంటున్నావు, బావా?" అనడిగింది బిందు.

# 16

పూర్తిగా రెణ్ణాళ్ళు స్మృతిలేని స్థితిలోనే ఉండిపోయింది, కమల. ఆమె దగ్గరే విడవకుండా కూర్చుని, జాగర్తగా కనిపెట్టి ఉండమని డాక్టర్ల హెచ్చరిక. అలానే చేశారు దాసదాసీలు. ఈ రెండురోజుల ప్రయత్నం, సేవ, శుశ్రూష—వీటివల్ల కమలకు కొంచెం తెలివొచ్చింది. లేవదీసి కూర్చో బెట్టారు.

కళ్ళు తెరిచి బాగా చూసింది, కమల. ఇప్పటి దాకా తన తలని ఒళ్ళో పెట్టుక్కూర్చొన్న వ్యక్తి ఎవరో తెలియదు, కొత్తగా కనబడింది.

"ఎవరవు నువ్వు?"

"మీ ఆయనకి మేనమామ కూతుర్ని. నన్ను బిందు అంటారు!" అని చెప్పిందా కొత్తామె.



ఎంతోసేపు అలానే ఆమె మొహంకేసి చూసింది, కమల. అందర్నీ అవతలికి పొమ్మని సైగ చేసింది. వాళ్ళంతా వెళ్ళిపోయారు.

మెల్లిగా అడిగింది :"ఎంతసేపట్నించి నేనిలా వున్నానూ?"

"మొన్న పొద్దుట స్మృతి తప్పిపడిపోయావు అక్కా!—అప్పట్నించి ఇంతవరకూ తెలివి రాలేదు" అన్నది బిందు.

"మొన్ననా!—" చకితురాలయింది, కమల. తల వంచుకుని కదలిక లేకుండా కూర్చుంది. ఇదేస్థితిలో చాలా సేపటివరకు ఉండిపోయేటప్పటికి బిందుకి అనుమానం కలిగింది. చెయ్యి పట్టుకు చూపి, "అక్కా!—" అని పిలిచింది.

తల ఎత్తలేదుగాని, కమల అలానే వుండి చెప్పింది: "భయంలేదమ్మా నేను తెలివి లోనే ఉన్నా ఇప్పుడు."

ఆమె తెలివి తెచ్చుకునేయత్నంలోనే ఉందని తెలియగానే, బిందు ధైర్యపడింది. కాస్సేపయ్యాక కమల మాటాడ నారంభించింది: "ఈ రెండురోజులాయె నన్ను ఇలాగే ఒళ్ళో పెట్టుకూర్చున్నావా, బిందూ!—నాకు సేవ చెయ్యాలని నీ కెలా బుద్ధి పుట్టిందీ? నే నెప్పుడూ ఇటువంటి ఉపచారాలు చేసి ఎరగనే?"

ఈ మాటలు సరిగా అర్థంకాలే, బిందుకి.

"ఎందుకు బుద్ధిపుట్టదు, అక్కా!—నువ్వేం పరాయిదానివా? మాతో పరిచయమంటే లేదుగాని, బావలాగే నువ్వూ మా దానివే. నీ సేవ చెయ్యటం నాకు విధి కదూ. నువ్వు మా లోకంలో ఉంటేగా? నీకేం తెలుస్తుంది? నే వచ్చిన క్షణం నించీ ఈ రెండు రోజులూ ఎలా గడిచాయో ఆ భగవంతుడికే తెలుసు. నా మనసులో ఆత్రం ఏమని చెప్పను?—ఓసారి నీ గదిలోకీ, ఓ మాటు బావ గదిలోకి—బావదగ్గర కెళ్ళినప్పట్నించీ నీ కెలావుందోననీ, నీ దగ్గరకొస్తే బావకెలావుందోననీ—ఇలా భయంతో, గుండెదడతో చెప్పలేని ఆత్రంతో గడిచాయి ఈ రెండు రోజులూ. ఇవ్వాళ కాస్త కంటిమీద కునుకు పట్టింది బావకి. అది చూసుకుని నీ దగ్గర కనిపెట్టుకూర్చోగలిగా. అయ్యో దేవుడ! బావస్థితి చూసి, బతుకుతాడని యెవరన్నా అనుకున్నారా!" అంటూ హృదయావేదన వెల్లడించింది.

"ఇంక ఫరవాలేదా?" అడిగింది, కమల.

"ఫర్వాలేదుట. జ్వరం కూడా తగ్గింది. మరి భయంలేదని డాక్టరు చెప్పి వెళ్ళాడు" అని జవాబు చెప్పింది.

ఒక్కమాటు కమల మొహం కలకల్లాడింది. మళ్ళీ కమల వెంటనే తెలివితప్పి, బిందు ఒళ్ళో పడిపోయింది.

బిందు ఆత్రపడలేదు, గల్లంతుచెయ్యలేదు, ఎవర్నీ పిలవలేదు. కమల తల తన ఒళ్ళో పెట్టుకుంది, విసనకర్రతో మెల్లిగా విసురుతూ కూర్చుంది.

పుట్టుకతోటే బిందు మంచి ధైర్యశాలి. ఆమెలో సహజ సిద్ధమైన నిబ్బరం ఎంతగా వున్నదో. ఆమె భర్త జబ్బులోనే తెలిసిపోయింది. మృత్యుదేవత స్వయంగా వచ్చి భర్త మంచంమీద కూర్చున్నప్పుడే ఆమె కాస్తయినా చలించలేదు. అటువంటి దిప్పుడు తెలివి తప్పిన కమల కోసమని భయపడుతుందా? కాస్సేపటికి కమల కళ్ళు తెరిచి, తనెక్కడ ఉన్నానా అని చూసింది. అదేపనిగా బిందు ఒళ్లో మొహం పెట్టుకుని వెక్కివెక్కి ఏడుస్తూంది.

గాఢమయిన ఆ ఆక్రందన బిందు ఒడిలోనే ఎండి, పేరుకు పోయింది. అందులో ఒక్క తరంగమయినా బయటికి రాలేదు, ఎవరి చెవినీ పడలేదు. బయటచూస్తే నిర్జనాంధకారం. నిశ్శబ్దంగా అది గాఢమయిపోయింది. ఇక లోపల—ఒక తరుణి తన హృదయ జ్వాలల్ని మరొక శాంతమూర్తి ఒళ్ళో ప్రశాంతంగా కుమ్మరిస్తూంది!—

క్రమంగా శాంతించి, స్థిమితంలో పడింది, కమల. తన భర్త గురించి ఎన్నో విషయాలడిగింది. అయితే, ఆమె స్వయంగా వెళ్లి అతన్ని చూసి రావాలనే కోరికను ఎందుకు బయటపెట్టలేదు?—ఈ సమస్య ఎంత ఆలోచించినా బిందుకు అర్థం కాలేదు. అర్థంగాక, ఇలా అనుకుంది—ఒహో, పెద్ద వాళ్ళ ఇళ్ళళ్ళో శిక్షా, సంస్కారమూ



ఇలానే వుంటుంది కాబోలు. ఉపచర్యలు చేసే పనంతా నవుకర్ల మీద పెట్టి ఇవతలే ఉండి ఊరికే కబుర్లు మాత్రం తెలుసుకోవడం వారి అలవాటు కాబోలు.

అంతలో కమల అడిగింది, బిందుని:

"అవునుగాని బిందూ!—మీ బావకి తెలివొచ్చాక నన్నుగురించి ఏమయినా అడిగారా?—"

"ఒక్కమాటు అడిగాడు" అని చెప్పి, బిందు గప్పున ఆగిపోయింది, మరేమీ అన కుండా. ఇది గుర్తించింది కమల. ఇంకేం, అడగలేదు. అడగాలని ఉత్సాహమున్నా. ఉత్సాహంతోబాటు వ్యాకుల దృష్టితో ఆమె మొహంకేసి చూస్తూ ఉండిపోయింది.

కాస్సేపు ఊరుకుంది బిందు. తరవాత ఇలా చెప్పింది: "తెలివిరాగానే బావ నన్నే నువ్వనుకుని చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. "చెప్పు కమలా!—ఈ పని చేసింది నువ్వు కాదు గదా. నేను చచ్చీ సుఖపడలేను, కమలా!—"ఈ పనికి నా ప్రోత్సాహంలేదు" అని ఒక్కమాట చెప్పు, కమలా!" అని అడిగాడు.

"తర్వాత?" తరుముకొస్తున్న నిట్టూర్పు ఆపుకుని అడిగింది, కమల.

"బావ దేన్నిగురించి అడిగాడో నాకు తెలియదు అక్కా!"—అంది బిందు.

"వారేం తెలుసుకోవాలని అడుగుతున్నారో, ఆ విషయం నాకు తెలుసులే బిందూ!-" అంటూ కమల ఒక్కసారి లేచి కూర్చుంది.

కమల చెయ్యి పట్టుకుంది, బిందు. "నువ్వాగదిలోకి వెళ్ళొద్దు, అక్కా!"—అంది.

"ఏం, ఎందుకు వెళ్ళొద్దూ?"—

"వెళితే ప్రమాదమని చెప్పారు డాక్టరు!"

"బిందూ!—నా కొచ్చే ప్రమాదం గురించి నా కంటే ఎక్కువ తెలియదులే డాక్టరికి. నేను వారి దగ్గర కెళతాను. తెలివి వచ్చాక కూడా వారింకేమయినా తెలుసుకోవాలంటే, దానికి సమాధానం నేనే చెప్పాలి" అంటూ బిందు చెయ్యి తన చేతులోకి తీసుకుని విన యంగా అంది కమల: "దయవుంచి నన్నొక్కమాటు అక్కడికి పంపించు బిందూ!— లేకపోతే ఆజన్మాంతం నేను తలెత్తుకు తిరగలేను."

ఇలా అన్న తరవాత మనస్సులో దేవుణ్ణి ధ్యానించుకుంది: "భగవంతుడా!—ఇప్పటి వరకూ నా పసుపు కుంకుమలు నిలిపినవాడివి నువ్వేనా?—నువ్వే అయితే, న్యాయాన్యాయా లిప్పుడు నిర్ణయించు. వాటిని మాత్రం అపహరించకు!—నా శిక్ష అప్పుడే ఎక్కడ పూర్తయింది. లేదు, ఇంకా చాలా వుంది. నువ్వు విధించే కఠిన దండన సంతోషంతో స్వీకరిస్తా. కాని, ఆ కాస్త దారీ మట్టుకు తొలగించకు మహాప్రభూ!"—

భర్త ఉన్న గదిలోకి ఇంకా వెళ్ళిందో లేదో, కమల—స్థిరంగా ఉండలేకపోయింది. రెండు రోజుల్నించి ఉపవాసం కదా, ఆమె శరీరం ఇంకా బలహీనమైపోయి౹ గిర్రున తిరిగి భర్త పాదాలమీద పడింది, అప్రయత్నంగా.

కాశీ మేలుకునే వున్నాడు. పాదాల దగ్గిర ఎవరో పడినట్టయింది. తలెత్తి చూదా మంటే శక్తిలేదు. "ఎవరది, బిందూ!—" అడిగాడు.

"కాదు, అక్క—" అని బిందు చెప్పింది.

"నువ్విక్కడి కెందు కొచ్చావ్, కమలా!" అన్నాడు కాశీ.

తలవైపు కూర్చున్న బిందు మృదుస్వరంతో ఇలా చెప్పింది: "ఇక్కడికి వచ్చింవి గాని, తమాయించుకోలేక పడిపోయింది."

మళ్ళీ చెప్పింది—"ఇవాళ ఇక్కడికి రావొద్దన్నాను నేను. రెండు రోజులాయె, మూసిన కన్ను తెరవకుండా పడివుందే, ఇక్కడికొస్తే, తమాయించుకో లేదని నాకు ముందే తెలుసు."

భర్త పాదాల దగ్గర కమల అలానే పడివుంది. తన చల్లటి పాదాలమీద వేడి కన్నీటి ధారలు పడుతున్నట్టు తోచింది, కాశీనాధుడికి. "అవును బిందూ, ఇవాళ ఇక్కడికి రాకుండా వుంటే బాగుండేది" అన్నాడు.

కమల కేసి చూస్తూ చూస్తూ కళ్ళ నీళ్ళు తిరిగాయి, బిందుకి.

"బాగుండేదే కాని, అలా ఉండగలమా? మనసొప్పుతుందా? ఈ రెండు రోజులూ అక్కడెలా గడిచాయో నాకు తెలుసు, ఆ భగవంతుడికి తెలుసు. ఆమెకూడా ఈ విషయం ఎరగదు" అన్నది కన్నీళ్ళు వత్తుకుంటూ.

కాశీనాథ్ కళ్ళు మూసుకున్నాడు. దృష్టిని లోపలికి మరల్చాడు. క్షణంసేపు దేవుడ్ని స్మరించాడు. తన ప్రశ్నకి సమాధానం ఏమేనా దొరుకుతుందేమోనని చూశాడు.

కాస్సేపు వూరుకుని కళ్ళు తెరిచాడు, "ఏం?—ఇప్పుడు నాకేమయింది?—నా ప్రాణానికేమీ ముప్పులేదు. లేచి కూచో కమలా!—" అన్నాడు.

కాశీ పెదవులమీద చిరునవ్వు చిందులాడింది. "బిందూ!—ఇంకిప్పుడు నాకెవ్వరూ సంజాయిషీ ఏం చెప్పనక్కర్లేదు. ఈ రెండ్రోజులూ తెలివి లేకుండా పడివున్నాగా. చాలు, అదే నాకు సరయిన సమాధానం" అంటూ ఎడంచేతిని వూతగా చేసుకు లేచి కూచున్నాడు.

కుడిచేత్తో కమలను లేవదీయ బోయాడు.

"కమలా."

కమల పలకలేదు. కానీ కాళ్ళ దగ్గర అలాగే వలవల ఏడుస్తూ పడివుంది.

"ఉహుం—లేవకు—నువ్వలా లేవకూడదు. డాక్టరు మరి మరి చెప్పిపోయాడు' అంది బిందు.

"డాక్టరు వెయ్యి చెప్పనీ లక్ష చెప్పనీ. ఇక నాకేం భయంలేదు. గండం గడిచింది. నన్ను కాపాడుకున్నది మీరు. మరెవ్వరూ కాదు." అన్నాడు కాశీనాథ్ నవ్వుతూ.

రేగిపోయిన కమల కురులను సద్దుతూ, ఆమె తల నిమురుతూ అలాగే పడుకున్నాడు కాశీ.






# కుక్కలున్నాయి జాగ్రత్త!

అందే గోపాలకృష్ణమూర్తి

జడ్జీగారు విపరీతంగా సిగరెట్లు కాలుస్తూ, ఉధృతంగా ఆలోచించసాగారు. "ఈ కేసు చూట్టానికి చిన్నదే. అయినా ముద్దాయిని పట్టుకోవడం ద్వారా తన అనుభవాన్నీ, తెలివితేటలనూ, ప్రజ్ఞాప్రాభవాలనూ ప్రజలకు తెలియజేయాలి. దోపిడీలూ, దొంగతనాలూ, హత్యలూ వగైరాలైతే ముద్దాయిల తాలూకు 'క్లూ'లు ఏవో కొన్ని అతిసునాయాసంగా లభిస్తాయ్. దోపిడీలు జరిగితే ముద్దాయి తాలూకు గుర్తులూ, ఆనవాళ్ళూ ఏవో ఒకటి ఎవరో ఒకరి ద్వారా బయట పడకమానవు. అలాగే హత్యలు జరిగితే హంతకుల వ్రేలి ముద్రలో, సిగరెట్ పీకలో, బూటు గుర్తులో ఏవో ఒకటి హత్యాప్రదేశంలోగాని, పరిసరాలలోగాని లభించకపోవు. అయితే ఇప్పుడెలా? తన కొచ్చిన కేసు ఎంత చిన్నది?! తన ఇరవై రెండేళ్ళ అనుభవంలోనూ ఇంతటి అతి స్వల్పమైన కేసు గురించి ఇంతసేపు, ఇంత విపరీతంగా ఆలోచించలేదే! అయినా ఇంతటి చిన్న కేసు అసలు తనవరకూ రాకూడదు. పోలీసులే ఏదోవిధంగా ముద్దాయిని నిర్ణయించేయాలి? ఊళ్ళో కోడి పెట్టలు పోవడమేవిటి, దానికి కోర్టులో ముద్దాయిని నిర్ణయించడ మేవిటీ? రోడ్లు సర్వేచేసే పోలీసులకే ఈ వ్యవహారంలో

ఎక్కువ అనుభవ ముండడానికి అవకాశం హెచ్చు. అందులోనూ పరిష్కారం దొరకని కేసులను పాత కేడీల మీదే బనాయించి, కోర్టు వ్యవహారాలను సులభ సాధ్యం చేసే నేర్పు, చాకచక్యం పోలీసు డిపార్టుమెంట్‌కే కదా పుట్టుకతో వచ్చిన విద్య! అటువంటిది తనేం నిర్ణయించ గలడు?"

ఆలోచనలతో సతమతమైపోసాగారు జడ్జీగారు. ఇంతలో ఫోను అదేపనిగా మ్రోగనారంభించింది.

"యస్, సెషన్స్ జడ్జి రామనాధం స్పీకింగ్........ఆఁ, ఆఁ, హలో, గుడ్ మార్నింగ్....ఎస్. పీ. గారా—ఓహ్.... డిన్నరా?....రేపే....ఉహూఁ! . మెనూ ఏవిటీ?....'వెట్' పార్టీయేనన్నమాట?. ... వెరీ గుడ్—అంతా 'చికెన్' మయమే?... నాకేమి ఇష్టమంటారా? ...'చికెన్—లెగ్ ఫ్రై'....సరే, చూద్దాం—మినిమమ్ ఒన్ డజన్ లెగ్స్—ఆఁ—చూసోక్కండిమరి... ఓ యస్స్—థేంక్యూ, థేంక్యూ!... భలే వారే! రేపు సాయంత్రం ఆరింటికల్లా వచ్చేయనూ? ఓ. కే."

ఫోన్‌లో మాట్లాడేసేక జడ్జీగారు హాయిగా నవ్వుకొన్నారు. "చాలా చిత్రంగా వుందే! కోడిపెట్టల దొంగలను నిర్ణయించే వ్యవహారం మీద తను ఆలోచనలు సాగిస్తుంటే కోడిపులావు, కోడి 'ఫ్రై' లతో కూడుకొన్న 'విందు భోజనం'-కాదు,మందూ భోజనాలకు ఆహ్వానంరావడం చాలా చిత్రమైన కోయిన్సిడెన్సు! సరే, ఇక ఈ వ్యవహారాన్ని గూర్చి బుర్ర పాడుచేసుకోవడం వృధా। రేపు పార్టీలోనే కోడిపులావు ముగించేక, కోళ్ళ దొంగను గురించి ఎస్. పీ. తో చర్చించి, అక్కడే నిర్ణయించుకోవచ్చు" ననుకొని వేరే పని మీద బైటకు వెళ్ళిపోయారు జడ్జీగారు.

*   *

ఎస్. పీ. గారి ఆఖరమ్మాయి రజస్వల అయిన సందర్భంగా, భారీ ఎత్తున—నగరంలోని 'బిగ్‌షాట్స్'. కు యేర్పాటు చేయబడిన 'బూజ్‌పార్టీ'. కలెక్టరూ, డిప్టీ కలెక్టరూ, తాసిల్దారూ, సూపర్నెంటులూ, సి. ఐ. లూ., ఎస్సైలూ, పెద్ద పెద్ద వ్యాపార సంస్థల యజమాన్లూ, సినిమా థియేటర్ల ప్రొప్రయిటర్లూ, వీరందరి తాలూకు హైక్లాసు ఆడమనుషులూ, వారి వారి చిన్న పిల్లలను ఎత్తుకున్న పనిమనుషులూ, పనిమనుషుల చిరిగిపోయిన పవిట చెరగులను పుచ్చుకుని వ్రేళ్ళాడుతూ వచ్చిన పనిమనుషుల చీమిడి ముక్కు, చింపిరి జుత్తు పిల్లలూ, విపరీతమయిన బందోబస్తు చేసేస్తూ, పై అధికారి అనబడే ప్రతివాడికీ చెయ్యి ఎత్తి సెల్యూట్ చేస్తున్న పోలీసు జవాన్లూ (వారి ఆడమనుషులు లేరు) ఒకరేమిటి, ఊళ్ళో పేరున్నవాడూ, కారున్నవాడూ — అంతా ఆ ఉత్సవం తాలూకు విందు భోజనానికి హాజరై పోయారు.

హోదాలను బట్టి విందు స్థలాలను వేరు చేసేరు. ఎస్. పీ. గారు. అసిస్టెంట్



సూపర్నెంట్ లగాయితూ పైవారందరికీ తమ మేడ మీద ఆరుబయట ఖరీదైన 'గార్డెన్ చైర్స్' ఏర్పాటు చేయించేరు. వాటి ఎదురుగా అందమైన చిన్న చిన్న టేబుల్స్, వాటి మీద పొడుగాటి సీసాలూ, గ్లాసులూ, సోడా కాయలూ, అందంగా అమర్చారు. వాటి ప్రక్కనే ఘుమ ఘుమ లాడిపోతున్న 'చికెన్ ప్రిపరేషన్లూ' తదితర తినుబండారాలూ సర్దేరు.

'బ్లూ రిబ్బన్ జిన్' కి జిందాబాద్ అన్నారు. 'ఓల్డ్ టేవర్న్ విస్కీ' 'వహ్వా' అన్నారు. 'గో యేహెడ్ విత్ గోల్డెన్ ఈగిల్' అని 'బీర' కాయలను పగల కొట్టేరు. 'త్రైరి ట్రిప్లెక్స్ రమ్మ' న్నారు. ఆనక 'చికెన్ లెగ్స్' ఏవీ? అన్నారు. అవీ 'వండ్రఫుల్' అన్నారు.

"జడ్జీగారికి మరో రెండు వడ్డించు, అహ్హహ్హా!" అన్నారు ఎస్. పీ. గారు.

"థేంక్యూ" అంటూనే జడ్జీగారు, "చూడండి సూపర్నెంటుగారూ! చికెన్ ఫ్రై ఈజ్ వండ్రఫుల్! అయితే ఈ మధ్య మన ఊళ్ళో జరుగుతున్న కోడి పెట్టల చోరీ మీద బనాయించిన కేసులో రేపు జడ్జిమెంటు ఈయవలసి ఉన్నది. ఈ సందర్భంలోనే ఆ కేసు విషయమై మీ సలహా ఇస్తే బావుంటుంది. ఏమంటారు?" అని ఎస్. పీ. గారి వైపు తిరిగారు.

"అహ్హహ్హా!" అన్నవ్వేరు ఎస్. పీ. గారు. ఆనక "అయ్యో, అది మనం ఆలోచించడం అనవసరం. జంతువులూ, పక్షులూ వగైరాల దొంగతనం కనుక మన మానవమేధస్సును అటువంటి చిన్నచిన్న

కేసుల పరిష్కారానికి వినియోగించడం అనవసరం. మొన్ననే హైద్రాబాద్ నుండి రెండు జమాజెట్టీల్లాంటి పోలీసు కుక్కలను తెప్పించాను. ప్రస్తుతం అవి నా వద్దనే ఉన్నయ్. వాటి నొక్కసారి ఒదిలేస్తే ఈ కోడిపెట్టల దొంగ వెధవలను క్షణాల్లో పట్టేయ గలవు. మీరేమీ ఆత్మ్రశమ పడకండి''అన్నారు ఆయాసపడుతూ.

''లేదు, ఆలస్యం జరిగేందుకు వీల్లేదు. ఆ కేసులో ముద్దాయెవరో రేపుదయం లోపలే తెలిసిపోవాలి. రేపు నేను జడ్జిమెంటీయాలంటే ఇది ఈరాత్రే తేలిపోవాలి. ప్లీజ్ హెల్ప్ మీ విత్ యువర్ డాగ్స్!'' అని ప్రాధేయపడ్డారు జడ్జీగారు.

ఎస్ పీ. గారు వెంటనే సి. ఐ.గార్ని పిల్చారు. ఆనక సి. ఐ. గారు 'ఎస్సయ్యా' గార్ని పిల్చారు. ఎస్సైగారు 'హేడ్' ని పిల్చారు. 'హేడ్' గారు 'జమానుగార్ని' పిల్చారు. పది నిముషాల్లో రెండు భయంకరమైన పోలీసు కుక్కలు ఆ 'సీను' లో కొచ్చినయ్. ఎక్కువగా కోడిపెట్టలు దొంగిలించబడిన ప్రాంతంలోని పెద్దమనుషులకు అర్జెంటు కబుర్లు అప్పటి కప్పుడే వెళ్ళి పోయినయ్.

'బిగ్ షాట్స్' డిన్నరు అరగంట తర్వాత పూర్తయిపోయింది. ఎస్. పీ. గారు పోలీసు కుక్కల ప్రతిభా విశేషాలను ఏకరువు పెడుతూ ఆడియన్స్‌ను ఆశ్చర్యపరుస్తున్నారు. ఇంతలో కోడిపెట్టలను విపరీతంగా కోల్పోయిన నలుగురు పెద్దమనుషులు వినయంగా ఎస్. పీ. గారి ముందు హాజరుపెట్టబడ్డారు.

''నావి ఈ మూడు నెలలలోనూ పదహారు పెట్టలూ, అయిదు పుంజులూ పోయినయ్ సార్!''

''నావి ఈ ఒక్క నెలలోనే ఇరవై పైచిలుకు పోయినయ్ సార్, మా బామ్మర్ది తాలూకు ఎనిమిది పందెంపుంజులు పత్తా లేకుండా పోయినయ్ సార్!''

''మా జీవనాధారమే ఆ కోళ్ళు సార్. జనవరి నుండి ఈ రోజు వరకూ పాతిక పైగా మాయమై పోయినయ్ సార్!''

''అయ్యా అయ్యా, నా వెన్ని పోయినవో, నాకే గుర్తు లేదుగాని, ఈ సంచిలో ఈకలూ, కాళ్ళూ-ఇందాక మా తోడల్లుడు మన సందుమొగలోవి అనుమానం మీద పట్టుకొచ్చేడు సార్. అవన్నీ మా తాలూకు కోడిపెట్టలవేనని నేను ఖచ్చితంగా చెప్ప గలను బాబూ! ఆ దొంగ ముండాకొడుకెవడో తఁవరి ఇంటి చుట్టుప్రక్కలే ఉండుంటాడు సార్! సచ్చి తఁవరి కడుపున పుడ్తాను, తఁవరే ఎలాగో ఓలాగ యీ అన్యాయం అపుజేయాలి సార్!''

నలుగురు పెద్దమనుషులూ ఏకరువు పెట్టారు. ఎస్. పీ. గారు శ్రద్ధగా అంతా విన్నారు. 'చూసేవోయ్'' అన్నట్టు జడ్జీగారు ఎస్పీ వైపు చూశారు. ఎస్పీ కళ్ళల్లో నలుగురు పెద్దమనుషులకూ సానుభూతి ద్యోతకమైంది. 'తప్పకుండా సూపణ్టెంటుబాబు మమ్మల్ని రక్షిస్తాడు!' అనుకొంటున్నట్టుగా నలుగురూ చేతులు నలుపుకోసాగారు.

ఉన్నట్టుండి జడ్జీగారు బ్రేవ్‌మని తేన్చి, 'వండ్రఫుల్ ఐడియా' అన్నారు ఉత్సాహంగా. 'వాటీజిట్?' ప్రశ్నించారు ఎస్పీగారు. "మీ కెవరిమీదైనా అనుమానంగా వుందా?" అని పెద్దమనుషులను ప్రశ్నించారు.

"ఉంది బాబూ వుంది, అప్పన్న అని-మా యీధిలోనే వుంటాడు. ఆడి కీ అలవాటుంది బాబూ! నా అనుమానం ఆడిమీదే మరి. కాపోతే ఆడి స్నేహితుడెవరైనా ఈ సందు మొగలోగాని వున్నాడేమో నాకు తెలీదు బాబూ!"అన్నాడు అందర్లోకీ పెద్దగా వున్న పెద్దమనిషి.

"అప్పన్న అనేవాణ్ణి అయిదు నిముషాల్లో పట్టుకురండోయ్ పోలీసులూ!" అన్నారు జడ్జీగారు ముందుగా.

ఆరో నిముషానికి అప్పన్న సీనులో ప్రవేశపెట్టబడ్డాడు. ఎస్పీగారు వాణ్ణి ఎగాదిగా చూసి, "అలా చూస్తావేంరా, వెధవ కోళ్ళు పట్టే వాటం నువ్వూను!" అని చీదరించుకున్నారు.

జడ్జీగారు గర్వంగా నవ్వుకొన్నారు. ఒకసారి మీసాలు తడుముకొన్నారు. ఎస్పీగారి వైపు చూస్తూ "చూడండి, ఈ నలుగురిలోనూ ఈ చివ్వరి ఆసామీ సంచిలో తెచ్చిన కోడికాళ్ళూ, ఈకలూ మన పోలీసు కుక్కలకు వాసన చూపుదాం. ఆనక వాటిని విచ్చల విడిగా ఊళ్ళో వదిలేద్దాం. ఆ ఈకల తాలూకు కోళ్ళు ఎక్కడ చంపబడినవో, అక్కడి మనుషుల జాడ మనం ఈజీగా తెల్సికోగలం. ఎలావున్నదీ ఐడియా? ఈ కుక్కలు ఆ మనుషులనుగానీ, మనిషిని గానీ అతి సులభంగా పట్టుకోగలవనే నమ్మకం నా కున్నది. రావయ్యా, 'ఏదీ నీ సంచీ?" అంటూ, పెద్దమనిషి దగ్గరి సంచిని అంది పుచ్చుకున్నారు.

పోలీసు కుక్కలకు సంచిలో సామాను వాసన చూపడం జరిగింది. అవి నాలుకలను గజం పొడుగున పైకి వ్రేలాడదీసి, ఒగురుస్తూ, కోపంగా అందరివైపూ ఓ సారి చూసినయ్. అందరి గుండెలూ 'ఝల్లు' మన్నయ్!

కుక్కలు అన్ని దిక్కులకూ ఓసారి చూసి, మెల్లగా నడక ప్రారంభించినయ్. రెండూ అప్పన్న దగ్గరగా వచ్చి ఒక్కక్షణం ఆగినయ్. వణికిపోతున్న అప్పన్నను చూసి అందరూ జాలిగా, భయంగా నిట్టూర్చేలోపలే కుక్కలు రెండూ ఎస్పీగారి ఇంటి లోపలికి పరుగెత్తినయ్. వాటి వెనకే పరుగెత్తి వెళ్ళేరు జడ్జీగారు.

ఎస్పీగారి వంటింటిని చుట్టుముట్టి, వంట జేసిన ఆడమనుషులందరినీ అనుమానంగా చూసి, ముందు చోటకొచ్చి నిలబడి పోయినయ్ రెండు కుక్కలూను! వాటి కెదురుగా-ఎస్పీగారు, జడ్జీగారూ, నలుగురు పెద్దమనుషులూ, అప్పన్నా, జవాన్లూను!

"మనిషి చేయలేని పని మన కప్పగించేరేవిటి? మనిషిలోని మంచి-చెడ్డలను పసిగట్టవలసిన గురుతర బాధ్యత మన భుజస్కంధాల మీద వదిలేయడం ద్వారా



మానవజాతిని కించపర్చుకుంటున్నామేనన్న బాధ వీళ్ళెవరికీ లేనే లేదేమిటి? మనిషిని శిక్షించడాన్కి న్యాయాన్యాయాలను నిర్ణయించే బాధ్యత మనిషిచేత చులకన చేయబడే శునకాలకు వప్పగించబడడం కలికాలపు విడ్డూరం కాకపోతే మరేవిటీ? అయ్యో ఓ మనిషీ! ఆకాశపు టంచులు అవలీలగా దాటి, ఎక్కడో వున్న గ్రహాల ప్రాంగణంలోకి చొచ్చుకుపోగలిగిన నీ మేధస్సు, నీ విజ్ఞానం, తోటిమనుషుల్లోని తప్పొప్పులను గుర్తించగలగలేక పోతున్న దంటే నిజంగా ఆశ్చర్యపడవల్సిందే!"— అనుకొని బాధపడ్తున్నట్టుగా కుక్కలు రెండూ దిక్కులు చూడసాగినయ్.

రెండు నిముషాలు అందరూ నిశ్శబ్దం పాటించారు. ఏదో జ్ఞాపకమొచ్చినటుగా కుక్కలు రెండూ మెడలు విదిలించుకొని, ఒక్క ఉదుటున వెళ్ళి ఎస్పీగారి పంట్లాంను కరిచి పట్టుకున్నయ్!

అందరి కళ్ళూ అంగుళంన్నర బైటికొచ్చేసినయ్. సంభ్రమాశ్చర్యాలతో కొయ్యబారిపోయారంతా! ఎస్పీగార్కి ఇంచుమించు స్పృహ పోయింది.

"ఇంపాజిబుల్!" గద్దించినట్లు అరిచారు జడ్జిగారు అందరూ ఉలిక్కిపడి తేరుకున్నారు. కుక్కలు మాత్రం జంకలేదు సరిగదా, పట్టుకొంచెమైనా విడువలేదు. సి. ఐ. లూ, ఎస్సైగార్లూ, కంపించి పోసాగారు. హెడ్‌లూ, కానిస్టేబుళ్ళూ కరెంటు ముట్టుకుంటున్నట్టు వణికి పోసాగారు.

"హౌ ఈజ్ దిస్ పాసిబుల్! నో నో- ఇంపాసిబుల్! ఎస్పీగారు కోడిపెట్టల

దొంగా? సిల్లీ నాన్సెన్స్! ఈ పోలీసు కుక్కలమీద పరువునష్టం దావా వేయిస్తా!" జడ్జీగారు కోపంలోనూ, మైకంలోనూ ఏం మాట్లాడ్తున్నారో వారికే తెలీదు.

కుక్కలు పట్టు ఏమాత్రం విడవలేదు. "ఇతనే కోడిపెట్టెల దొంగ!" అని ఖచ్చితంగా చెప్తున్నట్టు, ఎస్పీగార్ని కదలకుండా పట్టేసుక్కూర్చున్నయ్

"హా? ఎలా ఇది సంభవం? సి. ఐ గారూ, మీకేమైనా పాలుపోతుందా?" నిస్సహాయంగా అడిగారు జడ్జీగారు.

ఉలిక్కిపడిన సి ఐ గారు 'ఎస్సైని' గారి వైపు తిరిగారు 'ఎస్సైనిగారు' 'హెడ్' గారివైపు తిరిగి అదేవిధంగా ప్రశ్నించారు 'హెడ్'గారు జవానుగారి వైపు తిరిగారు. జవాను 'అప్పన్న'వైపు తిరిగారు

వణుకుతున్న అప్పన్న వణకడం ఆపి, చిర్నవ్వు నవ్వేడు! చిర్నవ్వు నవ్వుతున్న అప్పన్నను చూసి ఉలిక్కిపడ్డారు, ఎస్సైనిగారు ఉలిక్కిపడ్డ ఎస్సైనినీ, చిర్నవ్వు నవ్వుతున్న అప్పన్ననూ చూసి అదిరిపడి 'అప్పన్నగారూ!' అనేసేరు కంగార్లో, జడ్జీగారు, హెల్ప్‌లెస్‌గా

అప్పన్నగారు మళ్ళీ నవ్వేరు "ఎందుకు నవ్వుతున్నారో చెప్పండి అప్పన్నగారూ? ఎస్పీగారే కోళ్ళ దొంగా? ఎలా? హా? ప్లీజ్!" తల బాదేసుకున్నారు జడ్జీగారు

"నా కేటి ఎరుక బాబూ? ఎప్పుడ్లాగానే కోళ్ళు పట్టినప్పుడు సగం వాటా ఎస్సైనియ్య బాబుగోర్కి హేడుబాబు చేత యిప్పించేస్తాను. ఆనక మరేటీ నా కెరుకనేదు!" అన్నాడు అప్పన్న.

గుడ్లు మిటకరిస్తూ ఎస్సైని వైపు చూసేరు జడ్జీగారు గుటకలు మింగుతూన్న ఎస్సైనిగారు "అవున్సార్, మొన్న సి ఐ. గారు మాంచి కోళ్ళు పంపించమంటేనూ " అంటూ తల వంచేసుకొన్నారు వెంటనే తడుంకొంటూ సి ఐ గారు అందుకొన్నారు—"యస్సర్ మరి నా కోసంకాదు, ఫలానా ఫంక్షనుందీ, అన్ని ఏర్పాట్లూ చెయ్యమని ఎస్పీ దొరగారు సెలవిచ్చారు సార్! అంచేత ఎస్సైనికి ఆ విషయం పురమాయిస్తే ఈ అప్పన్నగాడి దొంగ కోళ్ళను "—ఇక మాట్లాడలేక మౌనం వహించారు సి. ఐ. గారు

జడ్జీగారు నివ్వెరపోయారు! కుక్కలు రెండూ ఎస్పీగార్ని మాత్రం బహు జాగ్రత్తగా పట్టుక్కూర్చున్నయ్ "తిన్నింటికే వాసాలు లెక్కపెడ్తారా కుక్కల్లారా?!" అన్నట్టుగా నిస్సహాయంగా కూలబడిపోయాడు ఎస్పీగారు.

ఎస్పీగారు 'కోడిపెట్టల దొంగ' అని పోలీసు కుక్కలు పసిగట్టేసినవన్న వార్త ఊరంతా ప్రాకిపోయింది. "ఔరా!" అని ప్రజలంతా విస్తుబోయారు. వారిని బహుశ సస్పెండ్ చేస్తారేమోనని వారి వల్ల నష్టపోయిన వ్యాపారస్థులూ, తదితర పెద్ద మనుషులూ ఆశించారు.

మర్నాడు కోర్టు విపరీతంగా కిటకిటలాడి పోయింది. ఎక్కడ చూసినా, ఏనోట



విన్నా ఇదేమాట! సంభ్రమాశ్చర్యాలతో ఆబాలగోపాలం పోలీసు కుక్కల ప్రతిభా విశేషాలను ఒకేరీతిగా చెప్పుకోసాగేరు 'కుక్కలు ఎంతపని చేసినవి!' అని ముక్కు మీద వేలేసుకుని, తియ్యడం మర్చిపోయేరు.

జడ్జీగారు గంభీర ముద్రవహించి నగరంలో జరుగుతున్న కోడిపెట్టలచోరీ విషయం విపులీకరించి, కేసుకు కావల్సిన సాక్ష్యాలూ, ఆధారాలూ అన్నీ వదివివిన్పించి, చివరకు, "ముద్దాయిగా రుజువు చేయబడ్డ వ్యక్తిని ఘోరంగా శిక్షించవలసిన అవసరం ఎంతైనా వున్నది అందుచేతనే ముద్దాయి అప్పన్నకు రెండు సంవత్సరాలు కఠినశిక్ష విధిస్తున్నాను!" అంటూ లేచి వెళ్ళిపోయారు

కోర్టంతా కోలాహలంతో నిండిపోయింది! "కుక్కలు చూపిన న్యాయానికీ. మనిషి చెప్పిన న్యాయానికీ ఎంత తేడా?" అనేది సందేహంగానే నిల్చిపోయింది

"పాపాన్ని చేసినవాడు అప్పన్న ఫలితాన్ని అనుభవించిన వాడూ అప్పన్నే! అయితే 'ఫలాన్ని' అనుభవించినవాడు ఆఫీసరుబాబు కూడా! న్యాయాన్ని అన్యాయంగానూ, అన్యాయాన్ని న్యాయంగానూ మార్చి చూపగల మహత్తరశక్తి మనిషికున్నది. న్యాయాన్ని కేవలం న్యాయంగానే చూపించే అలవాటు కుక్కకున్నదని నిరూపించినయ్ 'ఎస్పీ'గారి కుక్కలు! అందుకే గామోసు, గొప్పగొప్ప వారంతా 'కుక్కలున్నాయి జాగ్రత్త!' అని పెద్ద పెద్ద బోర్డులు తగిలిస్తుంటారు!" అనుకొంటూ అక్కడి నుండి నిష్క్రమించారు, అప్పన్న మీద సానుభూతి చూపిన ప్రజలు.

———



## ఇచ్ఛాపురపు రామచంద్రం

"గాలీ వానా వస్తే కథే లేదు" ఈ సామెత అన్ని సందర్భాలలోనూ నిజం కాక పోవచ్చును. తరువాత ఆ 'కథ' హరికథ అయివుండవచ్చును గాలీ వానా రాబట్టే, యీ కథ!

గాలీ వానా వచ్చింది.

వంతెన కొట్టుకుపోయింది

నిషాలో- కారులో ఉన్న రాజావారికి- లేని వంతెన ఉన్నట్లుగా తోచింది.

ఫలితం—కారూ, రాజుగారూ కాల గర్భంలో కలసిపోయారు రాజుగారంటే ఛెయిర్మన్ మా వూరి పురపాలక సంఘా నికి నిజంగా మహారాజే ఆయన.

రాజ్యం అరా .కం కాకుండా, గద్దె బోసి పోకుండా, ప్రజలు అనాధలు కాకుండా— ఎలక్షన్లు వచ్చేయి

హడావిడంతా నిజానికి మాదే కారణం చనిపోయిన ఛెయిర్మనుగారు మా వార్డు కౌన్సిలరు

కౌన్సిలర్ ఎన్నిక వరకూ సందడి వార్డు ప్రజలది

ఛెయిర్మన్ ఎన్నిక పండుగంతా కౌన్సి లర్లది ప్రస్తుతం యీ దేశంలో ఏ ఎన్నిక స్వచ్ఛంగా జరుగుతూంది కనుక యిది కూడా సజావుగా జరుగుతుందని మనసును మభ్యపెట్టుకుందుకు?

ఎన్నికలకు పోటీ చేస్తున్న అభ్యర్థులు తోలుబొమ్మలు

పార్టీలు—వాటికి కట్టబడిన సూత్రాలు.

ఈ దారాలను పట్టుకుని తాము తెర వెనుక ఉండి బొమ్మల నాడిస్తూంటారు- అసలు పెద్దమనుషులు మామూలుగా ఉండే పార్టీలకు తోడు- మా వూళ్ళో కులాలు కూడా బలమైన శక్తులే పలుకు బడిలోనూ ఐశ్వర్యంలోనూ పోటీ పడేవి రెండే రెండు కులాలు అవకాశం రావాలే కాని తమ ఆధిక్యత నిరూపించుకోవాలని అవి ప్రయత్నించక మానవు కాలేజి కర స్పాండెంట్ మొదలు కౌన్సిలర్ వరకూ దేనికైనా రెండు కులాలూ పోటీ చేస్తూనే ఉంటాయి కనుక ఏ యెన్నికయినా రంజు గానే ఉంటుంది మా వూళ్ళో

అలవాటుగానే యిద్దరభ్యర్థులు పోటీ చేస్తున్నారు

ఎలక్షన్లింకా ఎక్కడ అనిపించి నన్నాళ్ళు అభ్యర్థులు మీ ఓటు మాకే అంటూ బోర్డులు పట్టుకు తిరిగేవారు. జరిగే ఎలక్షన్ మా వాడ్డకే పరిమితమైనా వూళ్లో ప్రాసాదాల ప్రహరీగోడలు మొదలు పాకీ దొడ్ల గోడల వరకూ అన్నిటి మీదా తమ గుర్తులూ, నామధేయాలూ ఓట్లకొరకు ప్రార్థనలూ నింపి వాటిని ఖరాబు చేసేశా రిక ఎందుకూ చోటు మిగలకుండా

ప్రొసెషన్లు సాగించారు

కాఫీహోటళ్ళ ముందరా, కిళ్ళీకొట్ల ముందరా చిన్న యెత్తున ఉపన్యాసాలు పెట్టేవారు సోప్ బాక్స్ ఆరేటర్స్ మల్లె.

తెలిసిన వారికీ (ఎందుకయినా మంచి దని) తెలియని వారికీ తమను తాము పరిచయం గావించుకోసాగారు

అభ్యర్థు లిద్దరూ ఎవరికి వారే తానే ఏకైక ప్రజాసేవకుడినని నొక్కి వక్కా ణించుకోసాగారు సిసలైన ప్రజాసేవకుల పోజులు, డైలాగులు వారికి కరతలా మలకమై పోయాయ్

ప్రజాసేవయే తన ఊపిరని ఒకరంటే- తను ప్రజాసేవకోసమే జన్మించాననీ, అది తప్ప తన కింకేమీ చేతకాదనీ రెండవవారు చెప్పుకోసాగారు ప్రజలిటువంటి మాటలు నమ్మరని వారికి తెలిసినట్లే-అవునన్న ఓటర్ని కూడా ఒకటికి పదిసార్లు అదనంగా హెచ్చరికలు చేశారు

ఎలక్షన్లు దగ్గర పడుతున్నయ్.

అభ్యర్థులకు ఆత్మవిశ్వాసమే తగ్గి పోయిందో లేక ప్రజల మీద విశ్వాసమే తగ్గిపోయిందో కాని ఎలక్షన్ కార్య క్రమాలు ఉధృతం చేయసాగారు

బంధుత్వాలు తిరగదోడటంలో, స్నేహాలు కలుపుకోవడంలో ఒకరి కొకరు సమఉజ్జీలమని నిరూపించుకుంటున్నారు ఉభయులూ

ఎన్నికల గోదాలోకి ప్రత్యక్షంగా దిగక పోయినా తెరచాటు వ్యవహారాల కుస్తీ పోటీలలో వూరి పెద్దమనుషులందరూ మల్లా గుల్లా లౌతున్నారు.

మా వూరి మనుషుల మెంటాలిటీ విచిత్రమైనది తాము ఓడిపోయినందుకు




కలిగే బాధకంటే ప్రతిపక్షం వాళ్ళ గెలుపే ఎక్కువ బాధాకరంగా పరిణమిస్తుంది. అందుచేత-తాము గెలవడం కంటె ఎదుటి వాడు ఓడిపోవడం పట్ల పట్టుదల హెచ్చు మా వూరి వారికి. వూళ్ళో డాక్టర్లు— మా వార్డుకి తరచుగా వచ్చి విజిటింగ్ ఫీస్ లేకుండానే పేషంట్లను పలకరించి వెడుతున్నారు. రెండుపూటలా వాళ్ళ మంచి చెడ్డలూ, ఓట్లూ అడిగివెళ్తున్నారు.

లాయర్లు క్లయింట్ల యిళ్ళకే వెళ్తున్నారు! టీచర్లు కూడా ఉడతా భక్తిగా— పిల్లల యిళ్ళకు వెళ్ళి వాళ్ళ పెద్దలను ప్రాధేయపడుతున్నారు ఓట్ల కోసం.

ఎలక్షన్లు మరీ దగ్గర పడ్డాయి.

పువ్వు గుర్తు అభ్యర్థి తాలూకు ఆడవాళ్లు వార్డులో అందరాడవాళ్ళకీ మొదట నిజం పువ్వులు పంచిపెట్టారు. తరువాత కాగితపు పూవులు పంచిపెట్టారు. ఆ తరువాత ప్లాస్టిక్ పూలూ, ఆ తరువాత పూల కుండీలూ, పూల డిజైన్లున్న రవికెల గుడ్డలూ పంచిపెట్టారు.

పువ్వు గుర్తు అభ్యర్థి కోటుకి పావు గంట కొకటి చొప్పున పువ్వులు మారుతున్నాయి. భవిష్యత్తులో అత నెంత త్వరగా రంగులు మార్చే ప్రతిభ కలవాడో ముందే చెప్తున్నట్లు.

పగలూ రాత్రీ సినిమా వరసలలో ఓట్ల పాటలు వినిపిస్తున్నయ్. ఓట్ల పాట్లు కనిపిస్తున్నయ్. అభ్యర్థులు ఓటు జపం చేస్తూ తమవారి ఓట్లను లెక్కించుకుంటున్నారు రుద్రాక్షమాలలో పూసలను లెక్కించే దొంగ భక్తుడిలా.

ఎక్కడ చూసినా ఓటు నామస్మరణ.

ఎలక్షన్ ఫీవర్ ఎక్కువై పోతూంది.

అభ్యర్థులూ మద్దతుదారులూ మల్లా గుల్లాలైపోతున్నారు

మార్కెట్‌లో పువ్వులు మచ్చుకి కన పడటం లేదు అక్కడక్కడ పువ్వుల చీరెలు కూడా పంచి పెడుతున్నట్లు గాలి వార్తలు

మగవాళ్లకి ఆడళవ్వా మీద అసూయగా ఉంది. అభ్యర్థి పువ్వు గుర్తు కాకుండా టెరిలిన్ చొక్కా గుర్తు పెట్టుకుంటే బాగుండేదని మనసులో అతని మీద కోపం తెచ్చుకుంటున్నారు కొందరు మగ వాళ్లు. కనీసం పెన్ను గుర్తయినా కొంత నయం అనుకున్నారు కొందరు మొగవాళ్ళు

రెండవ అభ్యర్థి గుర్తు ఎద్దు

ఎడ్లని పంచిపెడతారేమో అని యెదురు చూశారు ప్రజలు. కనీసం నాగళ్ళయినా యివ్వరా అని ఆశపడ్డారు ఎద్దేమిటి నాన్సెన్స్ సైకిలో స్కూటరో పెట్టుకుని ఓటర్లకు స్కూటర్లు పంచిపెట్టవలసిందని వాపోయారు విద్యాధిక ఓటర్లు

ఏ రోజు రావడానికైనా ఎదురు చూసి నంతసేపు పట్టదనిపిస్తుంది ఆ రోజు వచ్చాక

తెల్లవారితే ఎలక్షన్లు

ఎద్దు గుర్తు తరపున—వీధి పెద్దలకీ, కులపెద్దలకీ, ఛోటా లీడర్లకీ పులిబుర్రలూ గాంధీ బుర్రలూ (వందరూపాయల నోట్లు) అందాయని వదంతి పువ్వు గుర్తువాళ్ళు టెరిలిన్ చీరలూ గట్రా అందించారని అవతలి వర్గం లేవదీసిన వదంతులు.

నోట్లు చల్లేది ఓట్లు (గింజలు కావు) పండుతాయని పులిబుర్ర లందుకున్న పెద్ద మనుషులకుండేవి ఒక్క ఓటూ, రెండు చేతులూ అయినా ఆ చేతుల కింద ఎన్నో చేతులుంటాయనీ, ఆ మనుషులందరూ తమ పెద్ద చెప్పిన వారికే ఓటు వేస్తారనీ.

పవిత్ర భారతదేశంలో సామాన్యులు ఓట్లు కూడా త్యాగం చేస్తారు

ఏవేవి ఎలక్షన్లదృష్ట్యా నిషేధాలో అవన్నీ ఒక్కటీ మరచిపోకుండా అమలు జరపబడిన అనంతరం ఆ రాత్రి తెల్ల వారింది

యుద్ధసన్నాహాలు ముగిసి ప్రత్యక్ష రణరంగం ఆరంభమైంది ఇక గొరిల్లా ముట్టడికి స్వస్తి చెప్పి బాహాటంగానే పోట్లాడుకోసాగారు అభ్యర్థులు ప్రజలనబడే దళాన్ని వినియోగించుకుంటూ

[పాఠకులు రచయితను మన్నించాలి ఇంతవరకూ చెప్పింది కథ కాదు పూర్వ రంగం ఇక చెప్పబోయేదే అసలు కథ అందులో రచయిత కూడా పాత్రధారుడు కావలసివస్తోంది

షరా —కథకు క్లుప్తత అవసరం కనుక—పువ్వు గుర్తు మనుషులకు బదులు 'పువ్వు' అనీ, ఎద్దు గుర్తు మనుషులకు 'ఎద్దు' అనీ ఉదహరిస్తాను అన్నీ మన్నిం చండి ]




సెంటర్లో నిలబడ్డాను — ఎన్నికల చోద్యం చూస్తూ ఇంతవరకూ అభ్యర్థులు చేసిన సేద్యం ఎలా ఫలిస్తుందో అన్న ఆత్రుత నాకు లేకపోలేదు

నా కంతా తమాషాగా వుంది.

నాకు అదృష్టవశాత్తూ ఓటులేదు కనుక స్వేచ్ఛ వుంది

ఎదురుగా పోలింగ్ బూతుంది

నా ముందు రిక్షా ఆగింది

అందులోంచి ఓ ముసలమ్మా, కుర్రాడూ దిగారు.

నలుగురూ చుట్టుముట్టేశారు వాళ్ళిద్దరినీ గుంపు మూలంగా దృశ్యం అస్పష్టమై పోయింది కొన్ని క్షణాల అనంతరం

పువ్వు గుర్తులు కల నలుగురు, ముస లమ్మనూ కుర్రాణ్ణీ చిక్కించుకున్నారు. (ఈ ప్రయోగం నిజం)

ముసలమ్మకి ముందొకడు, వెనుక ఒకడు అటూ ఇటూ చెరొకరు కాలేజీ అమ్మాయికి మల్లె నాలుగువైపులా బాడీ గార్డ్స్

గ్రెద్ద వచ్చి ఎక్కడ తన్నుకుపోతుందో అని చిన్నపిల్లడు చొక్కాకింద మిరాయి పొట్లం దాచి భద్రంగా అడుగులు వేసేటట్లు గానే, కొన్ని రవాణా సంస్థలు భద్రతను బొమ్మలు వేసి చూపేటట్లు—పువ్వులు నలుగురూ ముసలమ్మను ఎడ్ల బారిన పడ కుండా కంటికి రెప్పలా కాపాడుతూ

పోలింగ్‌బూత్ వంక దారి తీయబోయారు. కాని

"ఆగండి బాబులూ అడుగు తీసి అడుగెయ్యలేక పోతున్నాను" అంది అవ్వ

"ఏం అవ్వా?" తనవాళ్ళు అటూ ఇటూ అన్నట్లుంటే ఆత్మీయులు ఆత్రుత పడే టట్లుగా పువ్వులు నాలుగూ కలవరపడి పోతూ అడిగారు

"కూడు తిననివ్వకుండా రెక్కట్టు కీడ్చుకొచ్చి రిక్షాలో కుదేసినారు ఓటియ్యా లని ఆకలి కడుపు మండిపోతది కుర్ర నాయాలికి. హోటేలుకి పోదాం పదండి బాబులూ మీరూ ఎప్పుడు తిన్నారో యేటో"

తప్పదన్నట్లు అవ్వనూ, కుర్రాణ్ణీ హోటల్‌కి నడిపించారు నలుగురూ. నేనూ కదిలాను

"ఇడ్లీ తింటావా అవ్వా? రెండు చెప్పేదా?" అడిగాడొక పువ్వు

అతని మాటలు వినకుండానే "స్పెషలే టుంది? పత్రూ" అందవ్వ సర్వర్‌ని చూస్తూ

పువ్వులు తెల్లబోయి తమాయించు కున్నాయి. అవ్వా మనవడూ వెజిటబుల్ పులావ్ తిన్నారు.

"కాఫీ చెప్పేదా అవ్వా?"

"నోరంతా మంట స్వీటేటుందో?"

స్వీటు వచ్చి—మాయమైంది.

"మసాలాదోసె రోస్టుగా కాల్చి తీసుకురా"

అదీ అయింది

"కారప్పొడుంటే యిడ్లీ తే" ఆర్డ రిచ్చిందవ్వ

"కారప్పొడి లేదు—" చెప్పాడు సర్వరు

"సాంబారుందిగా? సాంబారులో రెండిడ్లీ వేసి తే" అది పుచ్చుకున్నాక —ఆకలీ, ఆత్మా శాంతించినట్లు బ్రేవ్‌మని త్రేన్చిందవ్వ

వృద్ధురాలి జఠరాగ్ని నా కాశ్చర్యంగానే వుంది

"కాఫీ తాగవు కదూ అవ్వా?"

"ముసిలిముండని నాకు కాఫీ దేనికి బాబులూ? కూల్‌డ్రింక్ తెప్పించు కడుపు చల్లగా వుంటది"

కౌంటర్ దగ్గర గలాటా జరగ బోయింది ఎద్దు గుర్తు వాడొకడు ఎడ్వాన్స్‌గా అవ్వ బిల్లు ఇచ్చేసి నిలుచున్నా డక్కడ

అలా వీల్లేదు,బిల్లిచ్చినవాడే డబ్బిలివ్వ డాని కర్హుడని పువ్వులు ముఖా లెర్ర జేశాయి

కొన్ని క్షణాలైతే పువ్వులూ ఎడ్లూ కొట్టుకోబోయే వారే కాని—

'ఎద్దు' వంక చూసి ఏదో చెప్తున్నట్లు నవ్వింది అవ్వ

కలహం సమసిపోయింది.




–డాబా మీదకు దారెలాగండీ?

హోటల్ గడపదాటేసరికి. ఒక 'ఎద్దు' కారాకిళ్ళీ తెచ్చి అవ్వకిచ్చేశాడు పువ్వులు వారించబోయాయ్ ఆ పువ్వుల గుండెల్లో ముళ్ళు గ్రుచ్చుకున్నట్లయింది కాబోలు దీనంగా అవ్వ వంక చూశారు

"కుర్రాడికి బిస్కత్తులు మీరు కొనండి—" మందహాసం చిందిస్తూ—బోసినోటితో వరమిచ్చినట్లే అందవ్వ పువ్వుల ముఖాలలోకి పరికించి చూస్తూ

పువ్వుల గుండెలు కుదుటపడ్డాయి.

ఎద్దుల గుండెలు మండిపోయాయ్.

"అవ్వా నిన్న రాత్రి.." తొందర పడబోయాడొక ఎద్దు.

"వాళ్ల కోరా నాకు తెల్దేటా పాటి?" ప్రేమగా కసిరింది

"నీ వోటు మాకే అవ్వా పువ్వుకే నీ వోటు" పువ్వుల విలాపం

. "పిచ్చి సన్నాసులూ ఆ పాటి తెల్దేట్రా నాకు?" లాలనగా చిరాకు పడింది

పోలింగ్ బూత్ దగ్గరపడింది

ఓటర్లు కాని వారు సరిహద్దు దగ్గర నిలిపివేయ బడుతున్నారు అభ్యర్థుల మనుషులు (పువ్వులూ, ఎడ్లూ) ఓటర్లకు వెయ్యి విధాల చెప్పి సాగనంపుతున్నారు. వినగలిగితే—అక్కడ వేలకొలదీ వాగ్దా నాలు లక్షలకొలదీ ఆశలు.

"అవ్వా, పువ్వు"

"అవ్వా, ఎద్దు."

నడచి వెళ్తున్న అవ్వ ఒక్కసారి తిరిగి చూసి ఒక్క మందహాసం చిందించింది ఇద్దరినీ సమానంగా పంచుకోమన్నట్లు

లోపలకు వెళ్ళిన అవ్వ వచ్చేవరకూ నేనూ నిలుచున్నాను రోడ్డు మీద ఆమె వచ్చాక ఆమె ననుసరించ సాగాను

"ఎవరికి వేశావవ్వా?" పువ్వు గుర్తు పలకరింపు అవ్వ పెద్ద నవ్వు నవ్వింది— ఓరి అమాయకుడా అన్నట్లు

"మాకే వేశావా అవ్వా?"

మళ్ళీ అదే నవ్వు పువ్వుకీ ఎద్దుకీ అవ్వ నుంచి సమాధానం అదే నవ్వు

రిక్షా లేక కాబోలు నడుస్తోందవ్వ

"బాగున్నావా అవ్వా?" కదిపాను మెల్లగా

"ఓటేసేసినాను బాబులూ, ఇక నా సంగతెందుకు తమకి"

"ఓట్ల మనిషినిగానవ్వా."

"మరి నా యెంట పడతావేం?"

"నాదీ మీ వీధే రిక్షాలో వచ్చినట్లున్నావ్ నడిచి వెళ్తున్నావేం?"

"ఆ బోగం అయిపోనాది ఓటెయ్యడానికంటే రిక్షాలేటి, కార్లన్నా తెప్పిస్తారు తిరిగెళ్ళేటప్పుడు ముఖం చూసే ముండాకొడుకెవడు?" ఎండలో నడుస్తుందేమో అవ్వ ఎండలాగే చిరచిర లాడుతోంది

"ఇంతకీ ఓటెవరికేశావవ్వా?!" మెల్లగా అడిగాను. అనుమానంగా చూసిందవ్వ. "గుడిమింగే వాడొకడు, గుళ్ళో లింగం మింగేవా డింకోడు రెండూ గుడ్డి కళ్ళే అయితే ఏది కోరుకుంటే ఏటొరిగింది?

"ఇద్దరూ తెలిసినోళ్ళే రాత్రికి రాత్రి ఎద్దులోడొచ్చి ఓటిమ్మని అయిదు రూపాయలు చేత బెట్టాడు కాదనలేక పోయాను మనవాడేకదాని తెల్లారకుండా పువ్వులోడు తయారై ఓటిస్తేగాని వొల్లకాదన్నాడు సేరు బియ్యం, మూడ్రూపాయలూ యిసిరేసి పోనాడు వొద్దన్నా వినకుండా అదే రిక్షా తీసుకొచ్చినాడు హోటల్లో నాకూ పిల్లడికీ ఆకలితీరేలా టిపినెట్టించినాడు

"ఎవరి అభిమానాన్ని కాదనేది?

"అయినా—మనసు ప్రదానం కానీ ఓటుకేటుంది బాబూ ఒట్టి కాగితంముక్క. అందులోనూ నా నెన్నో ఎలచ్చన్లు చూసి నాను ఈ చిన్న ఎలచ్చన్లలో ప్రాణానికి హైరాణాయే తప్ప పెద్ద లాభముండదు బాబూ ఇంతా జేస్తే కిట్టిందేపాటి? అదో అయిదూ, యీడూ మూడూ యిదే పెద్ది లచ్చన్లైతేనా, అదమపచ్చం పచ్చనోటు కళ్ళ జూసేదాన్ని లేకపోతే గడిప చీరే దాన్నా!

"పెద్దెలచ్చన్లెప్పుడు బాబూ?"

"చాలాకాలం వుంది"

"నేను బతికుంటానా బాబూ అప్పటికి? ఏటో ఆటితీరూ, ఆ అదావిడీ అదంతా పెద్దలెక్క ఓటేసినా మంటే నెల్లాళ్ళు రాజాలాగెళ్తుంది

ఇయేటి బాబూ. .బొత్తిగా అల్పం"

ఇక నాకు నోరు పెగలలేదు

అడుగు ముందుకు పడక ఆగిపోయాను.



# అచ్యుతరామారావు వార్ధక్యం

## కాళూరి హనుమంతరావు

సామానంతా కట్టడమయింది. పెట్టెలు, వెడ్డింగులు, టేబుళ్ళు, కుర్చీలు, రేడియో, ఫేను, జాడీలు, సీసాలు, మంచాలు, బుట్టలు, పుస్తకాలు, పాత్ర సామాను వేసి కుట్టి పెట్టిన గోనెసంచులు, బోయిలరు, డబ్బాలు, అవీ ఇవీ, అబ్బ! ఎంత సామానుందీ! ఇలా కట్టి పరచిన సామానే రెండు గదులని ఆక్రమించి వుంది. పన్నెండేళ్ళయి ఆ ఇంట్లో పాతుకు పోయి వున్నాడు ఇప్పుడా ఇల్లు ఖాళీ చేసి ఇంకొక చిన్న ఇంట్లోకి వెళ్తున్నాడు అచ్యుతరామారావు ఈ సామానంతా ఆ క్రొత్త యింట్లో పడుతుందా? ఒకవేళ సామానుని కష్టపడి ఎలాగో యింట్లో ఇరికించినా ఇక తా ముండడానికి చోటుం టుందా?

అయినా తా మెందరు కనుక? తానూ కూతురు శారదా యిద్దరే కదా!

హుస్సేన్ బళ్ళు పిల్చుకొని వచ్చాడు. శారద పనిచేస్తున్న ఆఫీసులో హుస్సే నొక బంట్రోతు సామాను కట్టడానికీ, కొత్త ఇంట్లో అమర్చడానికీ వాణ్ణి శారద పిలిచింది హుస్సేన్ మూడు బళ్ళు పిల్చుకుని వచ్చాడు ఆ బళ్ళు చాలవనీ, రెండు ట్రిప్పులు వెయ్యావలసి వుంటుందనీ అచ్యుత రామారావు తలచాడు.

"చూసుకోండయ్యా, సామాను. ఈ సామానంతా నల్లకుంట చేరవెయ్యాలి ఏం బేరం చెబుతారో చెప్పండి" అన్నాడు హుస్సేను బళ్ళవాళ్ళతో బేరం సాగి చివరికి ఇరవైకి కుదిరింది

బళ్ళవాళ్ళు సామాను బళ్ళ మీద జమాయించడం ప్రారంభించారు. పెట్టెలు, వాటి మీద పరుపుచుట్టలు, ప్రక్క ప్రక్కన డబ్బాలు, వాటి మీద కుర్చీలూ టేబుళ్ళూ, వాటి మీద మంచాలు—ఇలాగ సామా

నంతా మూడు బళ్ళలో ఇరికించి సర్ది తాళ్లు వేసి బిగించి కట్టారు. అచ్యుతరామారావు ఆశ్చర్యపోయాడు ఆరు బళ్ళనుకొన్నది మూడు బళ్ళలో పట్టేసింది. అంతే మరి కుదించుకు పోవడం, ఇరుక్కు పోవడం నేటి జీవనధర్మం!

బళ్ళు కదిలాయి. వాటిని అనుసరించి హుస్సేన్ సైకిల్‌మీద వెళ్ళాడు రిక్షాలో తానూ కూతురూ బయలుదేరారు. వెళ్తూ బళ్ళను చూశాడు అచ్యుతరామారావు. మూడు కదులుతున్న కొండల్లాగ ఉన్నాయి. మూడు అంబారీ కట్టిన ఏనుగులు లాగ వున్నాయి. ఎడ్లు అమిత భారాన్ని లాగుతున్నాయి తలకు మించిన బరువుతో ఎడ్లు కటకట లాడుతున్నాయి. అయినా సాధ్యమైనంత తొందరగా గమ్యాన్ని చేరే ధీమాతో లాగుతున్నాయి.

తానూ తన జీవితంలో అంతే చేశాడు అచ్యుతరామారావు తలకు మించిన భారాన్ని లాగాడు తన సంపాదనకు మించిన స్థాయిలో కుటుంబాన్ని నడిపాడు, అచిరకాలంలో దానికి తగిన ఫలితాన్ని పొందగలననే ధైర్యంతో.

అచ్యుతరామారావు ఇరవై ఏళ్ళ క్రితం స్కూలు మాష్టరుగా హైదరాబాదు వచ్చి, హెడ్‌మాష్టరయి ఇటీవల రిటైరయాడు. పెద్ద కూతురికి చాలాకాలం క్రితమే పెళ్ళి చేశాడు. కట్నమూ అవీ చాలా యెక్కువే ఇచ్చాడు. అల్లుడు ఇంజినీరు వాళ్ళు విజయవాడలో వుంటున్నారు. పెద్దకొడుకు లా పాసయి ఢిల్లీలో ఉద్యోగం చేస్తున్నాడు. రెండో కొడుకు ఎమ్ ఎస్‌సి. పాసయి రెండేళ్ళు యూనివర్శిటీలో పని చేశాడు. అప్పుడే అతనికి పెళ్ళయింది పెళ్ళాన్ని వాళ్ళ పుట్టింట్లో వుంచి పై చదువుకి ఫ్రాన్స్ వెళ్ళాడు రెండో కూతురు శారద బి ఎస్. సి పాసయింది ఎక్కువ మార్కులు రానందున ఎమ్ ఎస్‌సి లో సీటు రాలేదు. బి ఇడి చదవనంది క్రొత్తగా ప్రారంభమయిన ఒక కెమికల్ ఫేక్టరీలో అసిస్టెంట్ కెమిస్ట్‌గా చేరింది

పైకింత హోదాగా బాగా కనిపిస్తున్నా కొంచం లోపలికిపోయి చూస్తే అతని సంసారంలో చాలా లోటుపాట్లు కనిపిస్తాయి అతనికి ఆస్తిపాస్తులేవీ లేవు. ఇరవై ఏళ్ళయి వుంటున్నా హైదరాబాదులో స్వంతంగా యిల్లు కట్టించుకో లేదు సరికదా, స్థలమైనా కొనుక్కోలేదు. ఇష్టంలేకకాదు, శక్తిలేక పెద్ద కూతురు పెళ్ళికి పిత్రార్జితం అయిపోయింది నెల నెలా వచ్చిన జీతమేకాక ప్రోవిడెంట్ ఫండ్‌లో కొంత భాగం కూడా పిల్లల చదువుల కయిపోయింది. పెద్ద కొడుక్కి పెళ్ళాం, ఇద్దరు పిల్లలతో ఢిల్లీలో అతని జీతం అతనికే బొటాబొటిగా సరిపడుతుంది రెండో కొడుకు హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నన్నాళ్ళూ తన కుంటుంబ స్థితి బాగుంది అతను పై చదువులకి ఫ్రాన్స్ వెళ్ళాక పరిస్థితి కుంటుపడింది. తనకు ఎంతకష్టమైనా కొడుకు ఆశయానికి




అస్థుతగల తలచుకోలేదు అచ్యుతరామా రావు తాను రిటైరవుతున్నాడు, కొడుకు తన దగ్గరే వుండి సంసారాన్నాదుకొంటే తన బాధ్యతలు తీరిపోయి, చివరి రోజులు చల్లగా వెళ్ళిపోతాయి ఇది తన ఉద్దేశం కావచ్చును కాని తన కొడుక్కి అతని ఆశలు అతని కుంటాయి ఇక్కడుంటే తన రిసెర్చి బాగా సాగడం లేదు. ఫ్రాన్స్ వెళ్ళి మూడేళ్ళలో పిహెచ్. డి అయి తిరిగివస్తే ఇక తిరుగుండదు కేవలం డబ్బు, సంసార సుఖం వీటి దృష్టితోనే ప్రతివిషయాన్నీ చూడకూడదు ఎవరి జీవి తాశయాలూ, ఆశలూ వారివి. ఏముంది! కాలం గిరగిర తిరిగి మూడేళ్ళైటే గడు స్తాయి. అసలు కొడుకులు పెద్దవాళ్ళు కావ లనీ, పేరు ప్రఖ్యాతులు గడింపుకోవాలనే తాను తన స్థాయికి మించిన విధంలో జీవిత ప్రవాహానికి ఎదురీది వాళ్ళను చదివించాడు ఇంతవరకూ వాళ్ళని తెచ్చి చివరిదశలో ఇప్పుడు నీళ్ళు కారుతే ఏం ప్రయోజనం? కనుక కొడుకు ఫ్రాన్స్ వెళ్ళడాన్ని అచ్యుత రామారావు సమర్ధించాడు

రెండవ కొడుకు ఫ్రాన్స్ వెళ్ళి రెండే ళ్ళయింది తాను రిటైరయాడు శారద ఉద్యోగంలో చేరింది. నిజానికి శారద ఉద్యోగంలో చేరడంకన్నా ఇప్పుడాయనకు గత్యంతరంలేదు. పూర్వపు ఇల్లు అద్దె ఎక్కువని ఖాళీ చేసి, చిన్న యిల్లు తీసు కొన్నాడు.

అచ్యుతరామారావు భార్య పద్దెనిమిది సంవత్సరాల క్రితం చనిపోయింది. అది అతని జీవితంలో పెద్ద ఆఘాతం కాని అతను మనోధైర్యంతో ఆ ఆఘాతాన్ని సహించాడు. అప్పటికతని వయస్సు నలభై సంవత్సరాలు అతనికి రెండో పెళ్ళికి సంబంధాలు వచ్చాయి. కాని తన పిల్లల విషయంలో తనకు చాలా గొప్ప, పవిత్ర మైన బాధ్యత ఉందనీ, వాళ్ళను చక్కగా పెంచి యోగ్యులను చెయ్యడమే తన కర్తవ్యమనీ, రెండో పెళ్ళి చేసుకొంటే సవతి తల్లి హయాంలో తన పిల్లలకు అన్యాయం జరగవచ్చుననీ భావించి అతను రెండో పెళ్ళి చేసుకోలేదు. తన వైవాహిక జీవిత సౌఖ్యాన్ని పిల్లలకోసం త్యాగం చేసి తల్లీ తండ్రీ తానే అయి పిల్లలను పెంచి పెద్ద చేశాడు

రెండో కొడుకు ఫ్రాన్స్ వెళ్ళి దాదాపు మూడేళ్ళయింది అతని రాకకోసం అచ్యుత రామారావు తహతహ పడుతున్నాడు అతను వచ్చేసి ఎక్కడైనా ఉద్యోగంలో కుదురుకుంటే ఇక తన బాధ్యతలన్నీ తీరి పోతాయి ఎలాగో కష్టపడి శారద పెళ్ళి చేసేస్తాడు అది తన ఆఖరి బాధ్యత. అది తీరిపోతే ఇంక తన వార్ధక్యం ప్రశాంతంగా వెళ్ళిపోతుంది. ఆ తరువాత కొంతకాలం జీవించినా సంతోషమే, మరణించినా సంతోషమే.

ఈ ప్రణాళిక కంతటికీ ఆధారం రెండో కొడుకు. ఇంకో మూడు నెలలకి వస్తాడనగా అతడు ఉత్తరం వ్రాశాడు. తన రిసెర్చి బాగా నడిచిందనీ, రెండు నెలలలో పిహెచ్ డి. పూర్తవుతుందనీ, కాని తిరిగి వచ్చాక ఇండియాలో తనకు తగిన ఉద్యోగం దొరుకుతుందా అని సందే హిస్తున్నాననీను. అతను వ్రాసింది నిజమే. ప్రస్తుతం ఇండియాలో ఉద్యోగాల స్థితి బాగులేదు అందుచేత విదేశాలకి వెళ్ళి చదువుకొన్న వాళ్ళు అక్కడే ఉద్యోగాలు తెచ్చుకొని ఉండిపోతున్నారు

కొంపతీసి తన కొడుకు కూడా అలాగ చెయ్యడు కదా! అని ఏ ముహూర్తాన అచ్యుతరామారావు భయపడ్డాడో, ఆ భయం నిజమయింది ఇక్కడ నాకు మంచి ఉద్యోగం దొరికింది, కనుక నే నింకా కొంతకాలం ఇక్కడే వుంటాను అని పిహెచ్ డి పట్టం పుచ్చుకొన్నాం కొడుకు ఉత్తరం వ్రాశాడు. ఈ ఉత్తరంతో అచ్యుతరామారావు ధైర్యం జీవితంలో మొదటిసారిగా సడలిపోయింది ఎవరిమీద తన ఆశలు కేంద్రీకరించుకొన్నాడో ఆ రెండోకొడుకు తనకు వేళకు చేయూత నియ్యకమృగతృష్ణవలె కనిపిస్తున్నాడు తన పరిస్థితినీ, శారదకు సాధ్యమైనంత త్వరలో పెళ్ళి చెయ్యవలసిన బాధ్యతనూ వివరిస్తూ త్వరలో తిరిగి రమ్మని కొడుక్కి ఉత్తరం వ్రాశాడు. నెల రోజుల తర్వాత జవాబు వచ్చింది.

"నే నిక్కడొక ఫ్రెంచి స్త్రీని పెళ్ళి చేసుకొంటున్నాను. నా కిక్కడే అంతా



బాగుంది కనుక ఇప్పట్లో ఇండియాకి రాను" అని కొడుకు ఉత్తరం వ్రాశాడు అచ్యుతరామారావుకి నాలుగైదుసార్లు చదివిన తర్వాతగాని ఆ ఉత్తరం అర్థంకాలేదు గాలివానకు పూరిపాక కూలిపోయినట్లుగా కూలిపోయాడు కొడుకు వ్రాసిన ఉత్తరం చదివి.

"ఇలాటి పని చెయ్యొచ్చునా! ఇక్కడ నీకు పెళ్ళాం వుంది నువ్వెప్పుడొస్తావా అని నా కన్నా ఎక్కువ ఆతురతతో ఎదురు చూస్తోంది ఆమె గతేంకాను? ఇప్పుడు నువ్వక్కడ ఫ్రెంచి స్త్రీని పెళ్ళిచేసుకోవడమేమిటి? కనుక ఇటువంటి పనిచెయ్యక వెంటనే తిరిగివచ్చెయ్యి" అని కొడుక్కి వ్రాశాడు

"మీరు నా గురించి విచారించకండి. ఇక్కడ నేను ప్రస్తుతానికి సెటిల్ అయిపోయాను. అక్కడ మా ఆవిడని ఇంకెవరినైనా పెళ్ళి చేసుకోమని సలహా ఇస్తూ ఉత్తరం వ్రాశాడు. అంతగా ఇండియాలో ఆమెకు మళ్ళీ పెళ్ళిచెయ్యడం కష్టమయితే ఆమెను ఇక్కడికి పంపండి ఇక్కడామెకు నేను మరో మొగుణ్ణి కుదురుస్తాను" అని కొడుకు జవాబు వ్రాశాడు

నలుగురు పిల్లల్ని వదిలి తన భార్య చనిపోయినప్పుడైనా అచ్యుతరామారావు క్రుంగలేదు తాను ఎంతో గారాబంగా ఎత్తుకొని తిప్పిన కొడుకేనా వీడు? గోడకి అతని ఫొటో వ్రేలాడుతోంది ఎంత స్నిగ్ధంగా, మనోహరంగా కనిపిస్తున్నాడు

పైకి! చివరకు మాయలేడిలా తనను వంచించాడు

పెద్దకొడుకు ఢిల్లీలో దూరంగా సంసార బాధ్యతలు తగులుకోకుండా, అప్పుడప్పుడు ఊరడింపు మాటలుమాత్రం వ్రాస్తూ తామరాకు మీద నీటిబిందువువలె నిష్పుణంగా ఉంటున్నాడు ఇంకొక ఏడాది గడిచింది. శారదకి పెళ్ళి చెయ్యవలిసిన బాధ్యత దిగులుగా మారింది అచ్యుతరామారావుకి. ఇన్నాళ్ళూ రెండో కొడుకు మీద ఆశ పెట్టుకున్నాడు ఇప్పుడిక తానే పూనుకోవాలి బాధ్యతలు తీరి నిశ్చింతగా కాలం గడపవలిసిన వయస్సులో తనకు క్రొత్త బాధ్యతలు ప్రారంభమయాయి సంబంధాలు వెతుకుతున్నాడు తగినవి దొరకడం లేదు

శారదకి ఈ మూడు నాలుగేళ్ళలోనూ జీతం రెట్టింపుకి పెరిగింది. కాని పని చాలా హెచ్చు. అసలే ఫేక్టరీ ఉద్యోగం, పై పెచ్చు క్రొత్తగా ప్రారంభమయిన ఫేక్టరీ విపరీతమైన పని రాత్రయిపోతుంది కంపెనీ మేనేజరు తన కారులో ఆమెను ఇంటికి దిగబెడతాడు. ఆదివారాలు కూడా ఆమెకి పనే అంతరాత్రయాక పరాయి మొగవాడితో కార్లో తిరిగిరావడం, అతిభారమైన ఆ ఉద్యోగం అదంతా అచ్యుతరామారావుకి ఇష్టంలేదు "ఫేక్టరీలోనే ఆలస్యమైపోతుంది ఇంక అప్పుడు సిటీ బస్సులో రావడమైతే ఇంటికి వచ్చేసరికి ఇంకా ఆలస్యమవుతుంది. అంచేత తొందరగా మేనేజరుతో కార్లో వచ్చేస్తున్నాను" అంటుంది శారద

"ఫేక్టరీ పని చాలా కష్టమమ్మా! స్టేట్ బేంకులో నాకు తెలిసినాయన వున్నాడు. అందులో పని వేయిస్తాను అది చెయ్యకూడదూ?" అంటాడు అచ్యుతరామారావు కూతురుతో.

"ఇక్కడ నాలుగువంద లిస్తున్నారు. నాలుగేళ్ళయి పని చేస్తున్నాను. బేంకులో రెండువందలైనా యిస్తారో ఇవ్వరో! ఈ నాలుగేళ్ళ ఎక్స్‌పీరియన్సూ వృథా అయిపోతుంది ఈ ఉద్యోగమే మంచిది ఫేక్టరీ అభివృద్ధి చెందుతోంది" అంటుంది శారద

కూతురు సంపాదన మీద జీవించవలసి రావడం అచ్యుతరామారావుకు యిష్టం లేదు వేడి వేడి అన్నపుముద్దలు కాలిన ఇనపగుళ్ళలాగ మ్రింగుతున్నాడు. కూతురుకి పెళ్ళి చేయలేక పోవడం అవమానకరంగా వుంది కాని ఏం చేస్తాడు? అసలే సంబంధాలు లేవు ఒకటో రెండో దొరికినా శారద మూలంగా కుదరడం లేదు.

తాను పెళ్ళయాక కూడా ఉద్యోగం చేస్తుంది కనుక పెళ్ళి కొడుకు కూడా ఆ ఊళ్ళోవాడే అయివుండాలి అని ఆమె అభిమతం విజయవాడలో ఒక డాక్టరు, విశాఖపట్నంలో ఒక లెక్చెరరు, ఈ రెండు మంచి సంబంధాలూ యిలానే తప్పిపోయాయి హాయిగా మొగలిపువ్వు వంటి



మొగుడు వస్తూవుంటే కాదని ఈ వుద్యోగ వ్యామోహ మేమిటి ఈమెకు? మనిషికి డబ్బు మీద వుండే వ్యామోహం మహా చెడ్డది

ఎలాగైతేనేం హైదరాబాదులోనే ఉండే ఒక పెళ్ళికొడుకు కుదిరాడు బేంకులో పని చేస్తున్నాడు వయస్సు కొంచం ఎక్కువే ముప్పైఆరు ఈ పెళ్ళికొడుకు అచ్యుత రామారావుకి వ్యక్తిగతంగా నచ్చలేదు విశాఖపట్నంలో లెక్చెరరు చూడముచ్చటగా వున్నాడు తానెరిగిన మంచి సంప్రదాయంకల కుటుంబం అన్నీ బాగున్నాయి ఈ పెళ్ళికొడుకు తానెరిగినవాడుకాడు పైగా ఇతనిలో అప్పుడే వార్ధక్యలక్షణాలు కనిపిస్తున్నాయి సగానికిపైగా బట్టతల కళ్ళు చుట్టూ నీలి చక్రాల ఛాయలు. ఈచబోయి నట్లున్నాడు. మన్మధుడి వంటి విశాఖపట్నం లెక్చెరర్ని కాదని శారద వీడిని అంగీకరించడం చూస్తే అతనికి ఆశ్చర్యంగా వుంది. కన్యావరయతే రూపమ్ అన్న ప్రాచీనార్యోక్తి ఇన్నాళ్ళకు తన కూతురు విషయంలో అసత్యమయింది. ఇంతకీ తన కూతురు ఈ సంబంధాన్ని అంగీకరించడానికి, ఇతణ్ణి పెళ్ళి చేసుకొంటే ఈ ఊళ్ళోనే ఉంటూ ఆ ఉద్యోగం చేస్తూ వుండవచ్చునన్నదే కారణం ఏమిటీ ఉద్యోగవ్యామోహం తన కూతురికి! ఉద్యోగ వ్యామోహం నేడు స్త్రీలలో స్త్రీ సహజలక్షణాలనే నిర్మూలింప జేస్తున్నది!

ఏమైతేనేం, పెళ్ళయిపోయింది తన బాధ్యత తీరిపోయిందనుకొని తృప్తి పడ్డాడు కాని రెండు నెలలలో పరిస్థితి విషమించింది

పెళ్ళికి ముందే శారద షరతు పెట్టింది, పెళ్ళయాక కూడా తాను ఉద్యోగం చేస్తానని. పెళ్ళికొడుకు ఒప్పుకొనే పెళ్ళి చేసుకొన్నాడు ఇటు సంసారం చేస్తూ అటు ఉద్యోగం చేసి డబ్బు గడించే భార్యని ఏ మొగవాడు ఇష్టపడకుండా వుంటాడు? కాని పొద్దున్నే ఏడుగంటలకి ఇల్లు విడిచి రాత్రి ఎనిమిది గంటలకి పరాయి మొగవాడితో కార్లో వస్తున్న తన భార్యను చూడగా చూడగా అతనికి అనుమానం, అసూయా కలిగాయి అతని తల్లి కూడా గొణుక్కోవడం మొదలెట్టింది "ఈవిడ రాణీలాగ పొద్దున్న వెళ్ళి రాత్రి వస్తుందట, నే నన్నీ అమర్చి పెట్టాలిట! కోడలు వస్తే ముసలి కాలంలో నాకు సాయపడుతుందనుకొన్నాను గాని ఇలా నెత్తెక్కుతుందనుకోలేదు." అంటూ.

"ఈ ఉద్యోగం మానేశెయ్. పని ఎక్కువ. మా బేంకులో ఒకటి ఖాళీ వుంది. అది నీకు వేయిస్తాను పదిగంటలకి వెళ్ళి ఐదు గంటలకి వచ్చేసేవచ్చు." అన్నాడు భార్యతో. తండ్రికి చెప్పిన జవాబే భర్తకీ చెప్పింది శారద. అతను నెమ్మదిగా ఆమె పని చేస్తున్న ఫేక్టరీ, దాని వ్యవహారాలూ, లోపలిగుట్టూ అంతా తనకి తెలిసిన వారి ద్వారా సంగ్రహించాడు అతనికి నిజం తెలిసిపోయింది

ఆ ఫేక్టరీలో ఆమెతోబాటు చేరినవారికి ఈ నాలుగేళ్ళలోనూ ఏభై అరవై రూపాయలకన్నా జీతం ఎక్కువ పెరగలేదు. ఛీఫ్ కెమిస్ట్‌కి కూడా నూట ఏభై రూపాయలు మాత్రం పెరిగింది ఒక్క శారదకి మాత్రం రెండువందలు పెరిగింది దీనికి కారణం ఆమె మేనేజర్‌కి భోగినికావడమే. ఆఫీసులో తక్కిన స్టాఫ్ కట్టెదుటే సరాగాలాడతారు అందరూ వెళ్ళిపోయాక గంటసేపు వీరిద్దరే వుంటారు ఆదివారాలు యధేచ్ఛగా విహరిస్తారు

"ఇదీ మీ కూతురు సంగతి ఇదివరకు ఇదంతా మీకు తెలుసునో తెలియదో నాకు తెలియదు కాని నాకు మాత్రం చాలా మోసం జరిగింది" అన్నాడతను మావగారితో. అచ్యుతరామారావు మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్కలేదు ఎంతో గౌరవంగా బ్రతికిన బ్రతుకు చివరికి యే దశకు వచ్చింది! తన భార్య అదృష్టవంతురాలు ఇదంతా చూడకుండా గౌరవంగా వెళ్ళిపోయింది తానెందుకిలా ఇన్నాళ్ళు జీవించి ఉన్నాడు? శివరాత్రి నాడు రాత్రంతా జాగరంచేసి తెల్లవారుతోందనగా కునుకుపాటుపడి జాగరాన్నంతటినీ పాడుచేసుకొన్నట్లుంది తన వార్ధక్యదశ

"అయినా నే నిప్పుడు మీతో పోట్లాడ్డానికి రాలేదు.ఏజ్ ఏ జెంటిల్‌మన్ వచ్చాను.




గతించిందేదో గతించింది ఇప్పటికైనా ఆమె ఫేక్టరీలో ఉద్యోగాన్నిమాని, బుద్ధిగా నడుచుకొంటే ఆమె గత చరిత్రనంతా మరచిపోయి విశాలహృదయంతో స్వీకరిస్తాను. లేకపోతే ముప్పైరెండు పళ్ళూ రాలగొడతాను" అన్నాడు మళ్ళీ అల్లుడు. అచ్యుతరామారావు తన కూతురుకి నచ్చజెప్ప చూశాడు

"ఆ రాలగొట్టడమేదో నేనూ చూస్తాను అంత అనుమానం మనిషైతే చదువుకొని ఉద్యోగం చేస్తున్న నన్నెందుకు పెళ్ళాడాలి? అందుకు తగిన దానినే చేసుకోవలసింది ఇలా హద్దుమీరి ప్రవర్తించాడంటే చెప్పుతీసి కొడతాను" అందామె తన పెట్టె బేడా తీసుకొని తండ్రి దగ్గరకు వచ్చేసింది

భర్తతో ఈ పోట్లాటలో మూడు రోజులు వరసగా శారద ఫేక్టరీకి వెళ్ళలేదు నాలుగోరోజు వెళ్ళేసరికి ఆమెకి ఆఫీసులో స్థానభ్రంశం కలిగింది అంటే ఆమె ఉద్యోగం పోయిందని కాదు. మేనేజరు ఒక వక్కాని చుక్కాను లేడీ స్టెనోను వేసుకొన్నాడు. ఇదివరకటి తన స్థానాన్ని ఇప్పుడామె ఆక్రమించుకొంది. పేరుకి స్టెనో గాని, మేనేజరు తర్వాత మేనేజరు లాగవుంది

రాత్రి తిరిగి వస్తున్నప్పుడు కార్లో ముందు సీట్లో మేనేజరూ అతని లేడీ స్టెనో

కూర్చొన్నారు. వెనక సీట్లో ఒక్కర్తే తను. మేనేజరు తనని యింటి దాకా దిగబెట్టలేదు దార్లో దించేసి "ఇక్కడినుంచీ నీకు బస్సు దొరుకుతుంది, నే నీమెను వాళ్ళ ఇంటికి దిగబెట్టాలి" అన్నాడు అసూయతో ఒళ్ళు మండిపోయింది శారదకు

మర్నాడు ప్రొద్దునే ఆమె తండ్రితో చెప్పింది తానా ఫేక్టరీలో ఉద్యోగం మానేస్తాననీ, బేంకులో ఉద్యోగం వేయించమని భర్తతో చెప్పమనీను ఆమె హృదయ పరివర్తనానికి అ చ్యు త రా మా రా వు ఆశ్చర్యపడ్డాడు అల్లుడితో చెప్పాడు అతడు మరీ ఆశ్చర్యపడ్డాడు ఆమెకు బేంకులో ఉద్యోగం వేయించాడు శారద ఫేక్టరీలో మానేసి బేంకులో చేరింది భర్త దగ్గిరకి వెళ్ళిపోయింది భర్త ఆమె గత చరిత్ర నంతా మరచిపోయి విశాలహృదయంతో స్వీకరించాడు పాపం! అతను మాత్రం ఏంచేస్తాడు? ముప్పైఆరేళ్ళ దాకా పెళ్ళికాక పెళ్లాం కోసం మొహం వాచిపోయి ఉన్నాడు దొరికిన పెళ్లాన్ని ఎలాగో ఒకలాగ ఏలుకోవాలి తప్ప ఆమెను కూడా కాలదన్నుకొంటే ఎలాగ? ఇంతకీ తను మాత్రం ఇంతకాలం మహనీతిగా నడుచుకొన్నాడా ఏం? ఎలాగైతేనేం, పరిస్థితి చక్కబడింది అచ్యుతరామారావు పెద్దకొడుకు దగ్గరకి ఢిల్లీ వెళ్ళిపోయాడు

ఢిల్లీ వె ళ్తూ నే జబ్బుపడిపోయాడు అచ్యుతరామారావు. కోలుకొన్నాడు కాని చాలా నీరసపడిపోయాడు జబ్బుకన్నా, వస్తూనే జబ్బు పడ్డ తనను గురించి విసుక్కొంటూ గొణుక్కొంటున్న పెద్దకోడలు అతణ్ణి ఎక్కువ క్రుంగదీసింది. పెద్ద కొడుకు పిసినారి, భార్యా విధేయుడు అని అతనికి తెలుసును మనస్ఫూర్తిగా అతనికి పెద్దకొడు కింట్లో ఉండాలని లేదు. కాని ఇంకెక్కడుంటాడు?

నిశ్చింతగా కాలుమీద కాలు వేసుకొని వార్ధక్యాన్ని గడపాలని కలలు కన్నాడు. అవి అసత్యములయాయి జీవితంలో తాననుకొన్నట్లు ఒక్కటీ జరగలేదు అయినా అతను విచారించలేదు తన కర్తవ్యాన్ని తాను చేశాడు ఆ పైన దైవేచ్ఛ ఇలా ఉంటే తానేం చెయ్యగలడు?

అతనిలో నైరాశ్యం కలిగింది ఒక్క తన వ్యక్తిగత జీవితం గురించి కాదా నైరాశ్యం. మొత్తం మానవజాతి మీద అతనికి విశ్వాసం పోయింది ప్రపంచంలో మనిషికీ మనిషికీ, తల్లిదండ్రులకూ బిడ్డలకూ, భార్యకూ భర్తకూ ఉన్న అనుబంధం నేటి కాలంలో ఎంత క్షీణించింది! అని అతను వాపోయాడు నిస్సారమైన జీవితంలో నుంచి శూన్యమైన మరణం కొరకు ప్రతీక్షించసాగాడు వార్ధక్య చరమదశలో అచ్యుతరామారావు




# బ్రతుకు బావ

కృపశ్రీ

చంద్రయ్యా మేస్టరు చచ్చిపోయాడు.

చచ్చిపోవడ మంటే మరెందువల్లా కాదు!—అందరిలాగా ఆయుష్షు తీరే చచ్చిపోయాడు

"డెబ్బయ్యేయిదేళ్లు బతికాడు-అదృష్ట వంతుడే!-ఇంకా ఎంతకాలం బతుకుతారె వరు మాత్రం?" అన్నారు ఊళ్లో వాళ్ల కొందరు

"పోనీ—ఎలాగో ఇంతకాలానికేనా వెళ్ళిపోయేడు!—ఆ కొడుకు విసుక్కోవ డమే తప్పింది" అన్నారు మరికొందరు

ఈ రెండో వర్గం వాళ్ళు అనుకున్నట్టు గానే చంద్రయ్యా మేస్టరు మీద అతని కొడుకు సత్యం ఎప్పుడూ విసుక్కుంటూ వుండేవాడు— "బాగా వచ్చింది ఈ ముస లాడి సంత!" అని రోజుకి ఎన్నోసార్లు తండ్రి మీద చిరాకు పడేవాడు

"ఈ ముసలాడి పీడ ఏనాడు విరగడవు తుందో!" అని కూడా ఎన్నోసార్లు అను కున్నాడు

అయితే చంద్రయ్యా మేస్టరు మీద అతని కొడుకు పడిన చిరాకుకి, విసుగు బాటుకి తగినంత కారణం లేకపోలేదు చంద్రయ్యా మేస్టరుకి దర్జా, డబ్బుదూబరా తనం ఎక్కువ, తిండిపోతు తనం జాస్తి. సొంతయిల్లు, రెండెకరాల పంట భూమి వీటి మూలంగానే అప్పులలో మునిగి చివ రికి అమ్ముడు పోయాయి రిటైరయ్యాక వచ్చిన పదిహేను వందల రూపాయిల ప్రావిడెంటు ఫండు కూడా వీటికే ఖర్చ యింది కొడుక్కి రవ్వంత ఆస్తికూడా మిగల్లేదు పైగా తండ్రిని పోషించే భారంకూడా మీద పడింది కొడుకు పంచన చేరినా చంద్రయ్యా మేస్టరుకి ఆ దర్జా, డబ్బు

దూబరాతనం, తిండిపోతు తనం వీస మంతయినా తగ్గలేదు సరికదా ముసలి తనంవల్ల మరింత చపలత్వం కూడా ఎక్కువయింది

చంద్రయ్య మేష్టరు కొడుకు సత్యం స్కూలు ఫైనల్ పాసయాక కాలేజీ చదువు చదువుదామని ఎంతో ఉత్సాహ పడ్డాడు కాని తండ్రి కాలేజీ చదువు చెప్పించ లేననడమే కాక వెంటనే ఏదో ఉద్యోగంలో చేరకపోతే తనింక సాక లేనని కూడా చెప్పడంచేత, తొమ్మిది మాసాల ఎమర్జన్సీ కోర్సులో మేష్టరు ట్రయినింగయి సెకండరీ గ్రేడు మేష్టరుగా ఉద్యోగంలో చేరాడు. నెలకి నూటా అరవై రూపాయిల జీతంతో భార్యా ఇద్దరు పిల్లలూ గల సంసారాన్ని గుట్టుగా కాలక్షేపంచేసి లాగుకొస్తున్నాడు. అయితే చంద్రయ్య మేష్టరు కొడుకు గుట్టుని రట్టు చేయసాగాడు డబ్బెక్కడినుంచి వస్తుంది, ఎలాగ వస్తుంది అన్న ఆలోచన లేకుండా కొడుకుని రోజూ రూపాయి, అర్ధా సాదరు ఖర్చుకి అడిగేవాడు దగ్గర డబ్బులేక కొడుకివ్వకపోతే ఊళ్ళో అరువులు, అప్పులు పెట్టేవాడు నెల తిరిగేసరికి వాళ్ళంతా వచ్చి కొడుకుని తీర్చమని కూర్చొనేవారు అన్ని వస్తువుల ధరలూ రోజురోజుకీ ఆకాశాన్నంటుతూ వుండ డంతో ఒక మనిషి దగ్గర మరొక మని షిని భరించడం అంటేనే అసాధ్యంగా తయారైన కాలం అవడంచేత, నూటా అరవై రూపాయిల అల్పజీతంతో భార్యా ఇద్దరు పిల్లలూగల సంసారాన్ని యాత నగా లాగుకొస్తున్న సత్యంకి-డబ్బు దూబ రాతనం, తిండిపోతు తనమే కాని రవ్వంత జాగ్రత్త, ఆలోచనాలేని ఆ తండ్రి గుది బండగా తయారయ్యాడు — "ముందూ వెనకా చూడకుండా మీరిలాగ ఖర్చు పెడు తూంటే నేనెంతకని భరించగలను నాన్నా?" అని తండ్రితో ఎన్నోసార్లు అన్నాడు సత్యం కాని చంద్రయ్య మేష్టరు కొడుకు మాటని రవ్వంతైనా లక్ష్యపెట్టలేదు ఇందు వల్లనే సత్యం తండ్రి మీద రోజూ విసు క్కుంటూండేవాడు—"బాగా వచ్చింది ఈ ముసలాడి సంత!" అని చిరాకు పడు తూండేవాడు — "ఈ ముసలాడి పీడ ఎప్పుడు విరగడవుతుందో?" అని మన స్సులో అనుకుంటూండేవాడు.

ఎలాగైతేనేం, అతడికి ఆయుష్షు తీరి పోయిందనో, లేక కొడుకు సమస్య తీరు ద్దామనో—మృత్యుదేవత వచ్చి చంద్రయ్య మేష్టరుని తీసుకుపోయింది ఇదివరకు మనసులో ఎంతనుకున్నా తండ్రి చని పోయాడనగానే సత్యం కొంచెం ఫీల యాడు

ఐతే కన్న తండ్రి చనిపోవడం రక్త సంబంధంవల్ల బాధ కలిగించినా—కొన్ని ఇబ్బందులు కూడా తండ్రి మరణంతో తీరి పోతాయన్న భావం లేశ మాత్రంగా సత్యం మనస్సులోకి రాకుండా వుండలేదు.

చంద్రయ్య మేష్టరుకి భార్యలేదు. ఆవిడ పదేళ్ళ కిందటే పోయింది వెధవప్ప




చెల్లెలు, మేనల్లుడు, మేనకోడలు దగ్గర ఊళ్ళలో వున్నారు పెళ్ళయిన కూతురు ఆ దగ్గర ఊళ్లోనే భర్త వద్దవుంది చంద్రయ్య మేస్టరు వచ్చిపోయాడని తెలియగానే కూతురు, విధవప్ప చెల్లెలు, మేనకోడలు వచ్చారు ఆ వూళ్ళోవున్న బంధువులు, మిత్రులు, ఎరిగున్నవాళ్ళు, ఇరుగు పొరుగువాళ్ళు, వీధిలో వాళ్ళు — అంతా వచ్చారు

కొంతసేపు ఏడుపులూ మొర్రలూ పరామర్శలూ వగైరాలయాక పెద్దలు లేచి దహనానికి ఏర్పాట్లు చేదామన్నారు చంద్రయ్య మేస్టరుకి-వరస కన్నదమ్ముడైన అవధాని సత్యాన్ని చాటుకి పిలిచి- "ఎంతసేపు శవాన్ని పెట్టుక్కూచుంటారు? ఎంతసేపుంచినా పోయిన ప్రాణం తిరిగొస్తుందా?- ఇంక తరవాయి పనిచూడు!" అని చెప్పాడు

"తరవాయి పనేమిటి?" అని అడిగాడు సత్యం.

"అదేన్రా! — దహనానికి ఏర్పాట్లు చెయ్యొద్దూ?" అన్నాడు అవధాని

"అవన్నీ నాకు తెలియవు బాబాయ్!- మీరే జరిపించాలి!" అన్నాడు సత్యం

"జరిపించడాని క్కాకపోతే మరిదేనికున్నాం మేమంతా?—కాని డబ్బో?" అన్నాడు సత్యంకి వేలు విడిచిన మేనమామ సీతారామయ్య.

"ఎంత డబ్బుండాలి మామయ్యా?" అని అడిగాడు సత్యం

"ఇప్పుడు దహనానికే అధమ పక్షం రెండు వందల రూపాయిలుండాలి" అన్నాడు పౌరోహిత్యుడు శాస్త్రిల్లు

"రెండు వందల రూపాయిలే!" అన్నాడు సత్యం ఆశ్చర్యపోతూ

"అవవురా మరి?—మోసే బ్రాహ్మలు నలుగురూ నాలుగు పాతికలేనా ఇవ్వందీ రారు వచ్చిన తరువాత వాళ్ళకి నలుగురికీ కొత్త పంచల చాపులు పెట్టాలి - శవం మీదికి, కిందికి కొత్త బట్టుండాలి-దహనపు వస్తువులు కొనాలి అక్కడ వాళ్ళకి సుంకం చెల్లించాలి!-వీటన్నిటికీ అవవూ?" అని అడిగేడు అవధాని.

సత్యం వద్ద అప్పుడు రెండు వందల రూపాయిలు కాదు-రెండు వందల పైసలు కూడాలేవు రెండు వందల రూపాయిలు వుండాలనే సరికి అయోమయా వస్థలో పడ్డాడు ఏం చేయడమా అని ఆ వెంటనే- "మోయడానికి కూలి బ్రాహ్మలెందుకు బాబాయ్?" అని అడిగాడు

"లేకపోతే ఈ శవాన్ని ముట్టుకొని ఎవరు మోస్తార్రా?" అని అడిగారు అవధాని, శీతారామయ్య, శాస్త్రిల్లు యేక కంఠంతో

నత్యంకి చాలా కోపం వచ్చింది — "మరి మీరంతా ఏం చేదామని వచ్చినట్టు?" అని గట్టిగా అడుగుదా మనుకున్నాడు. కాని, బాగుండదని తమాయించుకొని, "కూలి బ్రాహ్మల్లెందుకు?—ఊళ్ళోవున్న గాంధీసేవా సమాజం వాళ్ళు కావాలంటే ఇలాటి సమయాలలో ఉచితంగా ఎంతో సహాయం చేస్తారు వెళ్లి వాళ్ళ నడుగు తాను!" అన్నాడు

సత్యం ఈ మాట అనడంతోనే బంధువులు, కులపెద్దలు ఎగిరి పడ్డారు—

"నీకేమైనా మతిపోయిందిట్రా?" అని అడిగాడు అవధాని

"మతెందుకు పోవడం బాబాయ్?" అన్నాడు సత్యం

"లేకపోతే ఏమిట్రా యిది?—తండ్రి శవాన్ని ఆ సమాజం వాళ్ళ చేత మోయిస్తావా?—ఆ సమాజంలో అంతా శూద్రులు, మాలవాళ్లే కాని బ్రాహ్మడొక్కడు లేడురా!" అన్నాడు సీతారామయ్య

"బ్రాహ్మడు లేకపోతే ఏమయింది?— నిస్వార్థంతో సేవచేసి ఆపదలలోను, కష్టాలలోను వున్న వాళ్ళకి ఎంతో సహాయ పడుతున్నారు వాళ్ళు!" అన్నాడు సత్యం.

"అందుకని పవిత్రమైన బ్రాహ్మణ కులంలో పుట్టి, ఆ శూద్రుల చేత, మాల వాళ్ళ చేత తండ్రి శవాన్ని మోయిస్తావుట్రా?" అని అడిగాడు శాస్త్రిల్లు

"పవిత్రమయినది ఒక్క బ్రాహ్మణ కులమే కాదండీ!—అన్ని కులాలూ పవిత్రమైనవే!—ఇంత ఖర్చుపెట్టి కూలి బ్రాహ్మలచేత మోయింపించడానికి నా దగ్గర డబ్బులేదు!" అన్నాడు సత్యం

సత్యం ఇలాగ అనగానే అక్కడున్న వాళ్ళంతా అతడి వంక అతి నిరసనగా చూశారు. తండ్రంటే భక్తి గౌరవాలు




లేనివాడని, అభిమానం లేనివాడని నిందించ సాగారు-వెంటనే అవధాని, శీతారామయ్య, శాస్త్రుల్లు ఇంట్లోకి వెళ్ళి సత్యం భార్యతో సంగతంతా చెప్పేరు—

"చూడమ్మాయ్ మీ ఆయన మాటలు!- పవిత్రమైన బ్రాహ్మణ కులంలో పుట్టి, తండ్రి శవాన్ని గాంధీసేవా సమాజంలోని శూద్రుల చేత, మాలవాళ్ళ చేత మోయిం పిస్తానంటున్నాడు. మతున్న మాటలేనా యివి? — మన ఆచార వ్యవహారాలూ సాంప్రదాయమూ యేమిటి, ఘన ప్రతిష్ఠ యేమిటి?—వాడికేమేనా ఆలోచనవుందా?" అని అడిగేరు

సత్యం భార్య జానకికి వయస్సు పాతిక ముప్ఫయ్ సంవత్సరాల మధ్యే వున్నప్పటికీ పాతకాలపు భావాల మనిషి మూఢనమ్మ కాలు—అంతకంటే ఎక్కువగా, లోకం అంతా నడిచిన దారిలో నడవకుండా ఎది రిస్తే అంతా ఏమనుకొని పోతారో, ఏమని నిందిస్తారో అన్న భయమూ జాస్తీ అవ ధాని, సీతారామయ్య, శాస్త్రుల్లు వచ్చి ఇలాగ చెప్పగానే ఆమె భర్తని ఇంట్లోకి పిలిచి, "ఏమిటండీ యిది?" అని అడిగింది.

"అవును, వంద రూపాయిలు కూలి, పంచలచాపులూ పెట్టి బ్రాహ్మల చేత మోయింపించాలంటే అంత డబ్బెక్కడి నుంచి తేవడం?" అన్నాడు సత్యం

"అందుకని శూద్రుల చేత మాలవాళ్ళ చేత తండ్రి శవాన్ని మోయింపిస్తార టండీ—అంతా మన నేమంటారు?—

డబ్బులేకపోతే ఇవుగో-ఇవి తీసుకెళ్ళి తాకట్టుపెట్టి డబ్బుతెప్పించి పని కాని వ్వండి!" అంటూ ఒంటినివున్న అయిదు తులాల చంద్రహారాలు, మూడు తులాల గాజులూ తీసి యిచ్చింది జానకికి ఆ బంగారం తల్లి చనిపోతూ యిచ్చింది ఇదివరకు సంసారంలో ఎన్ని ఇబ్బందులు వచ్చి, గడవడం ఎంత కష్టమయినా జానకి ఆ వస్తువులు తీసి ఇవ్వడానికి ఇష్టపడలేదు. పిల్లల చదువులకి, పెళ్లిళ్లకి అక్కరకు వస్తుందని సత్యం, జానకి ఆ బంగారాన్ని చాలా జాగ్రత్తగా చూసుకొనేవారు

భార్య శరీరానున్న బంగారమంతా తీసి ఇచ్చేయ్యగానే,—"జానకీ, నీ బంగారం ఇచ్చేస్తున్నావా?—అవకాశం దొరికిందని-రక్తం పిండినట్టు డబ్బు పిండే ఈ బ్రాహ్మలకంటే—శవాన్ని తాకితే మైలపడిపోతామనుకొనే, ప్రమాదం ముంచుకొస్తుందనుకొనే ఈ బంధువులు-సాంఘి కులస్థులకంటే శూద్రులు, ఇతర జాతివాళ్ళు అయిన ఆ సమాజం వాళ్ళు-నిస్వార్థంగా సేవచేస్తున్న ఆ సమాజం వాళ్ళు పనికి రాకపోయారా?-ఈ బంగారం ఇప్పుడు దీనికింద ఖర్చు పెట్టేస్తే రేపు పిల్లల చదువులకీ వాటికీ ఎక్కడ తెస్తాం?" అని అడిగాడు సత్యం

"ఆవేళ కేదో చేద్దాం!—ఇప్పటికే అంతా నానామాటలూ అంటున్నారు, ఉపన్యాసం చాలించి వెళ్ళి ఎక్కడో అక్కడ తాకట్టు పెట్టించి డబ్బు తెప్పించండి!" అంది జానకి చిరాకుగా.

భార్య చిరాకు, తక్కిన వాళ్ళ రుసరుసలు చూచి సత్యం ఇంకేమీ అనలేక బంగారు గాజులు మార్వాడీ దుకాణంలో తాకట్టుకి పంపి రెండు వందల రూపాయిలు తెప్పించాడు డబ్బు వచ్చాక అవధాని, శీతారామయ్య వెళ్ళి నలుగురు బ్రాహ్మళ్ళని, సామాన్లని తీసుకొని వచ్చారు.

వచ్చిన బ్రాహ్మల్ని—"వందరూపాయిలేమిటయ్యా ఘోరం?—మనిషి అయిదేసి తగ్గించుకొని ఎనభై తీసుకొండయ్యా!" అని అడిగితే,—"బాబూ, ఇంకో మాటుకి చూసుకుందాం!—ఇప్పుడు మరి బేరం ఆడకండి!" అని అన్నారు.

"హుం!—వీళ్ళు పవిత్రమైన బ్రాహ్మలట!—ఏకోశానా మానవత్వం లేని వెధవలు!" అని కసిగా అనుకున్నాడు సత్యం

ఆఖరికి ఎలాగైతేనేం, బంధువులు కుల పెద్దలు కలిసి, చంద్రయ్య మేష్టరు శవాన్ని కూలి బ్రాహ్మలచేత మోయింపించి తీసుకెళ్ళి, కొడుకు సత్యం చేత దహనసంస్కారాలు చేయింపించారు ఆ రోజు కాష్టం ముగిసింది.

వారం రోజులు గడిచాయి ఇదివరకు నుంచే అంతంత మాత్రంగా సాగుతూన్న సంసారంలో ఇప్పుడీ కష్టం, ఖర్చులూ ఏర్పడగా కాలూ చేయీ అందని స్థితిలో మునిగి వున్నాడు సత్యం ఇలాగ వుండగా ఏడో రోజున అవధాని, శీతారామయ్య, శాస్త్రుల్లు వచ్చారు మళ్ళీ—

"ఏంరా! రేపట్నించి మీ నాన్నకి రోజులు చెయ్యాలి!" అన్నాడు అవధాని.



"అంటే ఏం చేయాలి బాబాయ్?" అని అడిగాడు సత్యం.

"ఏం చేయడమేమిట్రా?—ఆ దహనం చేసిన స్థలానికి వెళ్ళి ఎత్తిపోతలుచేయాలి. ఆ స్థలంలోను, ఇంటివద్దా మంత్రాలు చదివించి కర్మ చేయాలి. బ్రాహ్మలకి దానాలిచ్చి, మూడు రోజులూ వూళ్ళోవున్న బ్రాహ్మణ కుటుంబా లన్నిటినీ పిలిచి భోజనాలు పెట్టాలి," అన్నాడు శీతారామయ్య.

"అయితే వీటి కన్నిటికీ ఎంత డబ్బుండాలి?" అని అడిగాడు సత్యం.

"ఎంత లేదన్నా పదిహేను వందల రూపాయిలుండాలి!" అన్నాడు శాస్త్రిల్లు.

ఆ అంకె వినగానే సత్యంకి గుండె

గుభెల్‌మంది.-"పదిహేను వందల రూపా యిలే?" అని అడిగాడు ఆశ్చర్యపోతూ.

"కావురా మరి?-నేనింకా చాలా తగ్గించే చెప్పాను. న్యాయంగా అయితే అయిదారు వేల రూపాయిలుండాలి. పద్ధతి ప్రకారంగా అయితే పెద్దవాళ్ళు చచ్చిపోయినప్పుడు భూదానం, గృహదానం, గోదానం, హిరణ్య దానం చెయ్యాలి. నీ కంత శక్తిలేదు కనుక భూదానం, గృహదానం చెయ్యకపోయినా గోదానం, హిరణ్యదానం చెయ్యకతప్పదు- గోదానం చేయాలంటే ఎంత తక్కువలో చూసుకున్నా మూడు వందల రూపా యిలు పెట్టనిదీ ఆవు రాదు. అలాగే హిరణ్యదానం చేయడానికి ఏభై రూపా యిలు పెడితే కాని పావుతులం బంగా రమేనారాదు. ఇంక ఇవి కాక వస్త్ర దానంలాటి చిల్లర దానాలు చాలావున్నాయి ఆ పైన మూడు రోజులూ బ్రాహ్మలకీ, బంధువులకీ భోజనాలు పెట్టాలి దక్షిణ లివ్వాలి. వీటన్నిటికీ కలుపుకొని ఆ మాత్రం డబ్బవదూ?" అన్నాడు శాస్త్రుల్లు. నిలువునా దోచుకుందామనే ఆ ధోరణికి సత్యం ఆశ్చర్యపోయాడు.

"అవొచ్చు కాని అంత డబ్బు నా దగ్గ రెక్కడుందండి?" అన్నాడు సత్యం అక్కడికీ ఇబ్బందిని వ్యక్తపరుస్తూ.

"అందుకని చచ్చిపోయిన తండ్రికి దినాలు చెయ్యడం మానేసి స్వర్గం లేకుండా చేస్తావుట్రా?" అన్నాడు శాస్త్రుల్లు,

శాస్త్రుల్లు అలా అనగానే సత్యంకి చాలా చిరాకెత్తు కొచ్చింది 'పదిహేను వందల రూపాయిలు ఖర్చుపెట్టి చేస్తే, మా నాన్న స్వర్గానికి వెళ్ళినా వెళ్ళకపోయినా ఇక్కడమేం నరకానికి వెళతామండీ' అని మనస్సులో అనుకొని, "దుక్కల్లాటి బ్రాహ్మలకి పీకమొయ్యామేపి, భూములూ, ఇళ్ళూ దానాలిచ్చేస్తే వచ్చిన వాళ్ళు స్వర్గా నికి వెళతారన్న నమ్మకం నాకు లేదండీ!" అని అన్నాడు కోపంగా.

"ఇదేం బుద్ధిరా నీకు—పవిత్రమైన బ్రాహ్మళ్ళని ద్వేషిస్తావు'-దినాలు చెయ్యక పోతే పై లోకంలో మీ నాన్నకి గతులుం టాయిట్రా?—అతగాడికి స్వర్గం వుండ దురా!—నరకానికి పోతాడ్రా!" అన్నాడు శీతారామయ్య

"ఆయన స్వర్గానికి వెళ్ళకపోతే మరేం ఫరవాలేదు మావయ్యా!—ఇప్పుడు పది హేను వందలూ, రెండువేలూ పెట్టి దినాలు చేయడానికి నా దగ్గర అంత డబ్బులేదు! అన్నాడు సత్యం.

"అయితే తండ్రి ఋణం తీర్చుకో వుట్రా?" అని అడిగాడు అవధాని.

"తండ్రి ఋణం తీర్చుకోవడమంటే అతను చచ్చిపోయాక దుక్కల్లాటి బ్రాహ్మ లకి పీక మొయ్యామేపడం, ఇళ్లూ భూములూ దానం చేయడం కాదు బాబాయ్!" అన్నాడు సత్యం.

సత్యం ఇలాగ అనగానే అవధాని, శీతారామయ్య, శాస్త్రుల్లు ఇంక అతడితో లాభం లేదనుకొని, వెళ్ళి లోపలింట్లోవున్న సత్యం భార్యతో చెప్పేరు—




"చూడమ్మాయ్, రేపణ్ణించి మూడు రోజులు మీ మామగారికి దినాలు చెయ్యాలి-ష్మీ ఆయనతో చెబితే తనకిలాటి వాటిమీద నమ్మకం లేదని, తన దగ్గర డబ్బులేదని-ఎమిటేమిటో అంటున్నాడు. దినాలు జరిపి శాంతి చేసుకోకపోతే పోయిన ఆ బ్రాహ్మడికి పై లోకంలో 'గతులుంటాయా?—మైలపడిన ఈ యిల్లు మళ్ళీ పవిత్ర మవుతుందా?—అసలిలాటి అవాచ్యపు పనులు మన బ్రాహ్మణకులంలో పనికొస్తాయా?-నిత్యాగ్ని హోత్రంతో నిరంతర యజ్ఞ యాగాది క్రతువులుచేసి పవిత్రత పొంది మన కులానికి అగ్రస్థానం సంపాదించారు మన పూర్వులు. అలాటి అగ్రస్థానం పొందిన మన వర్ణధర్మాల్ని మంటగలుపుతాడా?" అని అడిగారు కోపంగా.

జానకి వెంటనే గదిలో వున్న భర్త వద్దకు వెళ్ళి, "మళ్ళీ ఇదేమిటండీ ఈ వాదన?" అని అడిగింది.

"అవుమ, దీనికిప్పుడు పదిహేను వందల రూపాయిలేనా వుండాలిట!—గోదానంట!—హిరణ్యదానంట! — వస్త్ర దానంట!—పాత్ర దానంట! — ఏవేవో వందదానాలు—అవీ పోతుల్లాటి బ్రాహ్మలకి చేయాలిట!—మూడ్రోజులూ బ్రాహ్మలందరికీ భోజనాలు పెట్టి దక్షిణ లివ్వాలిట!—ఇవన్నీ చేయించడానికి నా దగ్గర డబ్బెక్కడుంది?" అన్నాడు సత్యం.

"డబ్బు లేదనిచెప్పి జరపవలసిన కార్యాలు మానేస్తారుటండీ—ఎలాగో ఒక లాగ జరిపించాలి కాని?" అంది భార్య.

"ఎలాగ జరిపించడమో చెప్పు!" అన్నాడు సత్యం.

"అందరూ ఎలాగ జరిపిస్తున్నారు అమ్ముకొనో, అప్పుచేసో?—అంతే కాని చచ్చిపోయిన తండ్రికి దినాలు చెయ్యం, తద్దినాలు పెట్టం అంటే అంతా నోట్లో గడ్డి పెడతారు!" అంది జానకి.

"గడ్డి పెట్టడానికి మనమేం తప్పు చేశాం? — అప్పులు చేసి, అమ్ముకొని ఇలాటివి చేయడంలో అర్థం వుందా?— తల్లిదండ్రుల ఋణం తీర్చుకోవాలి. చచ్చిపోయినవాళ్ళని సంస్మరించుకొని మన భక్తి గౌరవాలు చూపాలి! దానికి కాదనను! కాని అది ఈ విధంగా కాదు! డబ్బుంటే దానిని చచ్చిపోయినవాళ్ళ పేరుతో నలుగురికీ ఉపయోగించి శాశ్వతంగా నిలిచే మరిదేనికేనా వినియోగించాలి. డబ్బు లేనపుడు మన శక్తి బట్టి చచ్చిపోయినవారిపేరుతో-కష్టపడడానికి శక్తిలేని ఒక బీదవాడికి ఒక పూట భోజనం పెట్టినా చాలు!" అన్నాడు సత్యం. సత్యం మాటలు విని, "చాల్లెండి ఉపన్యాసం! మీపాటి తెలియకనే లోకంలో అందరూ చచ్చిపోయిన వాళ్ళకి దినాలు చేస్తున్నారేమిటి? ఆ మార్వాడీ దగ్గరికే వెళ్ళి డబ్బు తెచ్చి పనులు కానీయండి!" అంది చిరాకుగా.

జానకి ఇలాగనడంతో అవధానికి, సీతారామయ్యకి, శాస్త్రిలుకి చాలా బలం వచ్చింది—"చూడమ్మా! పెద్దవాళ్ళు చనిపోతే దహన సంస్కారాలు జరిపాక, పది రోజులు నిండకుండా, ఆ చచ్చిపోయిన వాళ్ళకి దినాలు జరిపి, బ్రాహ్మళ్ళకి భోజనాలు పెట్టి, దానాలిచ్చి శాంతి చేసుకోవాలి! ఆ తర్వాత ఏడాది వరకు నెలకొకసారి మాసికాలు పెట్టాలి. తర్వాత యేడాదినాడు సంవత్సరీకాలు పెట్టాలి! ఆ తర్వాత ప్రతి సంవత్సరం తద్దినాలు పెట్టాలి. ఇది ఏనాటి నుంచో వస్తున్న ఆచారం! ఈ ఆచారాన్ని అన్ని కులాలవారూ పాటించాలి! అందులో మన బ్రాహ్మలకి మరీ పట్టు! ఇవి పాటించని వాళ్ళకి పుట్టుగతులుండవు: కుటుంబమంతా నాశనమైపోతారు! మాధవరావుగరబ్బాయి ఇలాగే వాదించి తండ్రికి దినాలు చెయ్యడం మానేశాడు. మూడేళ్లు తిరక్కుండానే పదహారుసంవత్సరాల కొడుకు చచ్చిపోయాడు!" అన్నారు.

జానకికి వారలా అనగానే ఊరంత భయం వేసింది. "విన్నారా? ఆ చీడ వుంచుకోవడం మంచిది కాదు — వెళ్ళి వేగంగా బాబాయి, మామయ్యా చెప్పినట్లు చెయ్యండి! ఆ మార్వాడీ దగ్గరకు వెళ్ళి ఆ బంగారమంతా అమ్మేసి, డబ్బుచాలకపోతే వడ్డీకేనా అప్పు తీసుకురండి! త్వరగా వెళ్ళండి!" అంది భర్తతో.

సత్యంకి,భార్యకిచెప్పినందువల్లా ఆమెతో వాదించినందువల్లా ప్రయోజనం లేదని, ఇంట్లో అనవసరపు గొడవలు, శాంతిలేకపోవడమే జరుగుతుందని తెలుసు. అందువల్లనే అత నెప్పుడూ భార్యతో వాదించకుండా అలాగే అయిష్టంగా అన్నీ ఆమె చెప్పినట్టు చేస్తూ వుంటాడు. అలాగే ఇప్పుడు కూడా ఆమెకు చెప్పినందువల్లా, వాదించినందువల్లా అనవసరపు గొడవలే తప్పలాభంలేదనుకొనిమార్వాడీ దుకాణానికి బయల్దేరాడు సత్యం. దుకాణానికి వెళుతూ 'మనిషి బ్రతికున్నప్పటికంటె చచ్చిపోయినప్పుడే ఎక్కువ ఖర్చు, బాదర బందీ అన్నమాట!' అని అనుకున్నాడు మనస్సులో




ఉదయం ఆరుగంటలయింది.

ఊరు బద్ధకంగా నిద్రలేచింది.

కూరలవాళ్ల పాలవాళ్ల కేకలతో గోలగా ఉంది.

జానకి నిద్రలేచి డాబామీంచి వీధిలోకి చూస్తూ నిలబడింది.

గుడ్డిముష్టివాణ్ణి, వాడికూతురు కాటోలు నడిపించుకొంటూ తీసుకెళ్తోంది వాణ్ణి వీధి చివర ఒక ప్రక్కగా గోనె పరచి కూర్చోపెట్టి వెళ్ళిపోతుంది. పగలంతా అంట్లూ అవీ తోమి, చిన్న కూలి పనులుచేసి డబ్బు సంపాదిస్తుంది. సాయంత్రం ముసలాడు అడుక్కోగా వచ్చిన డబ్బులు తీసుకొని వాణ్ణి ఇంటికి తీసికెళ్తుంది.

దాని డబ్బంతా వాడి త్రాగుడికే చాలదు!

పని చేతకాకపోయినా కూతుర్ని బూతుల్ని తిడ్తూ డబ్బులు తీసికోవడం చేతనవును వాడికి!

పక్షులు పిల్లలకు బుద్ధులుచెప్పి డ్యూటీకి బయలుదేరుతున్నాయి.

ఎదురింటి అరుగుమీద ఉన్న ముసలాయన మనవరాల్ని కాటోలు నాకో చాక్లెట్ ఇస్తావటే అంటున్నాడు.

కాకి ఒకటి పిట్టగోడమీద గోలగా అరుస్తున్నది.

దానిని కొడదామని రాయి ఏదైనా దొరుకుతుందేమోనని ప్రక్కకు తిరిగింది.

చిన్న కాగితంమీద తన పేరు వ్రాసి ఉంది!

చిరునవ్వు నవ్వి మేడదిగి వెళ్ళి పోయాడు మేడమీద గదిలో అద్దెకుంటున్న అబ్బాయి. కాగితం తీసి చదివింది జానకి.

ఎంత ధైర్యం!

బుగ్గలు కెంపులయ్యాయి సిగ్గుతో.

కళ్ళు ఎర్ర బారాయి కోపంతో.

ఉత్తరం మరోసారి చదివింది

నన్ను పెళ్ళి చేసుకొంటాడట!

నాతో మాట్లాడాలట'

రామకృష్ణా బీచిలో సాయింత్రం ఎదురు చూస్తాడట! చూస్తే చూడనీ!

కాగితం ఉండలుచేసి ప్రక్కకు విసి రేసింది. ఎంతో పెద్ద మనిషనుకొన్నాను!

ఛీ! ఛీ!!

ఇలాంటి వాళ్ళకు బుద్ధి చెప్పాలి.

ఉత్తరంతీసి సాపుచేసింది.

గదిలోకి వచ్చి పర్సులో దాచింది.

సాయింత్రం వెళ్ళాలి.

"ఏడయి పోయిందే అమ్మాయి. కాలే జీకి వెళ్లవా ఇవాళ?"

"వస్తున్నా అమ్మా."

*　　*　　*

"జాకీ వస్తూందిరోయ్! రేసుగుర్రం,"

"ఒరే మా జానీని ఏమైనా అంటే ఊరుకోను."

"ఓసి! వెధవపోజు!"

"రంభలా ఉందిరా ఇవాళ."

"రంభయితేనేం ఇంకా పెళ్ళికాలే దురా!"

"భగ్నప్రేమేమో?"

"ఎంతో వయసు ఉండదురా."

"నయం! స్వీట్ సిక్స్టీన్ అన్నావు కాదు!"

"ఉష్-వస్తూంది."

కోపంతో ఉడికిపోతూ క్లాసులోకి అడుగుపెట్టింది.

క్లాసంతా ఒక్కసారి నిశ్శబ్దంగా ఉంది.

బోర్డు ప్రక్కకు తిరిగింది.

"రంభను తలదన్ను రమణి సొగసు."

గొల్లుమంది క్లాసు.

'బ్రూట్స్' అనుకొంది మనసులో.

"డిఫైన్ వాలన్సీ." అడిగింది కోపంగా.

క్లాసు ఏదో అయిందనిపించింది.

తలనొప్పిగా ఉందని శెలవుపెట్టి ఇంటికి వచ్చేసింది. ఆకలిగా లేదని ఆలోచిస్తూ మంచంమీద పడుకొంది.

కాలండరులమీద తేదీ ఇరవై ఎనిమిది చూపిస్తూంది. తన వయసు ఇరవై ఎనిమిది!

తన ఈడుదే అయిన సుశీలకు ముగ్గురు పిల్లలు!

ఎంత చలాకీగా ఉండేది! బాయ్సుని-భలే అల్లరి పెట్టేది!

ఆ సోడాబుడ్డీ కళ్లద్దాల కుర్రాడు ఏం చేస్తున్నాడో?

పప్పన్నం ఎప్పుడు పెట్టిస్తావే పిల్లా అంటూ వ్రాసింది.

గోడమీద ఫొటో తీసికొంది.

పి. యు. సి. పాసైన అప్పుడు స్నేహితురాళ్ళు కలసి తీయించుకొన్న ఫొటో రిసెర్చి చేస్తాను అనేది నిర్మల.

పెళ్ళయ్యాక బి. ఏ. పూర్తి చెయ్యలేదు! ఢిలాయిలో ఉంటున్నది.

అదృష్టవంతురాలు ఇంజనీరును పెళ్ళాడింది! వచ్చే నెలలో వస్తుందట.

రజని ఏం చేస్తూందో?

రెండేళ్ళయింది దాని దగ్గరనుంచి ఉత్తరం వచ్చి.

దాని పెళ్ళికి వెళ్ళలేదని కోపంవచ్చింది కాబోలు! పెళ్ళి కాకుండా ఉండిపోయింది తనొక్కర్తే!

కట్నం ఇచ్చి పెళ్ళిచెయ్యలేక నాన్న చదివించాడు.

ఈ అయిదేళ్ళూ ఉద్యోగంచేసి తను సంపాదించింది పదివేలు!

ఇప్పుడు తనే మొగుణ్ణి కొనుక్కోగలదు!

'రంభను తలదన్ను రమణి సొగసు.'

చదువులో చూపించరు ఈ తెలివి తేటలు!

అంత అందంగా ఉన్నానా!

అద్దంలో ఒకసారి చూసుకొంది.

సిగ్గుతో నవ్వుకొంది

ఎంత ధైర్యం ఆ అబ్బాయికి!

రాజు! వీర్రాజు!!

పర్సులో ఉత్తరం తీసి మరోసారి చదువుకొంది.

వంటింట్లోంచి మాటలు వినబడుతూంటే తెలివచ్చింది.

"ఇంకా ఎన్నాళ్ళని ఉంచుతాఁవండీ దాన్ని ఆ మూడుముళ్ళూ పడిపోతే మన బరువు తీరిపోతుంది."

"ఎమ్ ఎస్సీ పాసైన అమ్మాయిని చేసికోం అంటున్నారే"

"నేను ముందునుంచీ పోరుతున్నా ఆడదానికి చదువెందుకు పెళ్ళిచేసేయండీ అని నా మాట వింటేనా . ..కట్నం డబ్బులు జతపడేవరకూ చదువుతూ ఉండనీ అన్నారు దాని చదువు పూర్తి అయింది కానీ కట్నం కూడలేదు."

"అప్పుడు కట్నం కావాలన్నారు. పెళ్ళి చెయ్యక చదువు చెప్పించక ఏం చేస్తాం అని చదివించాను."

"కొంప అమ్మేసయినా ఆ మూడు ముళ్ళూ పడేలా చూడండి. పిల్లకి వయసు ముదిరిపోతున్నాది. దీని ఈడుదే అయిన విశాలాక్షికి అప్పుడే ముగ్గురు పిల్లలు."

"నా కాళ్ళరిగేలా తిరిగేను. ఇన్నాళ్ళూ అమ్మాయికి పెళ్ళెందుకు చెయ్యలేదు. ఎమ్. ఎస్సీ. చదివిందా .మా అబ్బాయి ఫారిన్ వెళ్దామనుకుంటున్నాడు. . పాతిక వేలు కట్నం ఇస్తారా?"

"ఇదా ఎమ్. ఎస్సీ పాసైంది. దీని కన్న ఎక్కువ చదువుకున్న ఏ రిసెర్చి స్కాలర్నో తీసుకురావాలంటే కనీసం పాతిక వేలుండాలి ...ఎలా తెస్తాం. . ....

అయినా దీనికన్న పెద్ద వరుళ్ళు దొరకడం కష్టం....వరహీనానికి ఒప్పుకోరు."

"మీ ప్రయత్నం మీరు చేస్తేనా .. ఎవరిపిల్లో అన్నట్టు ఊరుకున్నారు. మా అన్నకు ఉత్తరం రాస్తాను సంబంధం చూడమని."

"నేను చేతకాని వెధవాయిని....మీ అన్న మేనగోడలికి పెళ్ళిచేస్తాడు "

"దాని ఖర్మ అలా రాసి ఉంది "

కళ్ళొత్తుకుంది శాంతమ్మ.

"ఏమేవ్, చిన్నమాట."

"ఏమిటి?"

"నేను రెండేళ్ళలో రిటైర్డు అయిపోతాను ... ..దీని తరువాత ఇద్దరు పిల్లలున్నారు . అబ్బిగాడు పి. యు. సి. లోకి వచ్చాడా . వాణ్ణి ఓ దారిలో పడేయాలా... దీని ఉద్యోగం వచ్చాక అప్పులన్నీ తీరిపోయాయి పదివేలు వెనకవేశాం . నెల నెలా ఐదేసి వందలు తెస్తున్నాది. . దీని పెళ్ళి చేసాక ఈ సంసారం ఎలా లాగుతాం ..కుర్రాడు చేతికందుకున్నాక దీని పెళ్ళి సంగతి ఆలోచించవచ్చు "

"సిగ్గు లేదూ! ఆడదాని డబ్బు ఆశిస్తున్నారు. .. ఛీ! ఛీ! మీరు వెంటనే ఈ ఏడాది అమ్మాయి పెళ్ళి చేయకపోయారా నుయ్యో గొయ్యో చూసుకుంటాను."

"ఊరికే ఊరికే సరదాకు అన్నానే . . ఏదో సరదాకు అంటే అలా శోకాలు పెట్టావేమిటి?"

"ఛీ! మీరు మనిషి కారు! మీకు అభిమానం లేదు!"

"ఎవరు చచ్చేరనే ఆ శోకాలు?"

తింటూన్న కంచంలో చెయ్యి కడుక్కొని లేచిపోయాడు కుటుంబం. కూతురు గది గుమ్మంలోంచి బయటకు రావడం చూసి దిమ్మెరపోయాడు.

"ఆ!!!"

"కాలేజీ లేదా అమ్మాయి!!!"

"అదృష్టవశాత్తు లేదు నాన్నా!"

సిగ్గుతో వీధిలోకి వెళ్ళిపోయాడు.

డబ్బు దగ్గర మనిషి ఎంత నీచానికి దిగజారుతాడు!

కన్నవాళ్ళ అభిమానం కూడ కొనుక్కుంటున్నానా!

ఒంటి మీద తేళ్ళూ జెర్రెలూ ప్రాకుతున్నట్టుంది!

ఛీ! వెధవ బ్రతుకు!!

అభిమానాన్ని చంపుకొని ఉద్యోగం చేస్తూన్నందుకు ఫలితం!—

మెదడంతా మొద్దుబారిపోయింది.

పక్కమీద పడుక్కుంది వెక్కి వెక్కి ఏడుస్తూ.

* *

బీచంతా సందడిగా ఉంది.

రంగురంగుల అమ్మాయిలతో క్వాలిటీ హోటల్ ఇంద్రధనస్సులా ఉంది

ప్రేమికులు — సంసారులు—రోమియోలు—పిల్లలతో బీచంతా సందడిగా ఉంది.

"వస్తుందో రాదో? ఈ బస్సు చూసి పోదాం."




నెంబర్ టెన్ ఆగింది.

జానకి బస్ దిగింది.

"వచ్చింది! తన మాటకు విలువ ఇచ్చింది!"

"నమస్కారం."

"నమస్కారం."

"అలా నీటి వద్దున కూర్చుందామా!"

"పదండి!"

అలలు ప్రక్క చూస్తూ కూర్చుంది జానకి

పున్నమి అవడంచేత పోటు ఎక్కువగా ఉంది.

అందరాని చందమామను అందుకోవడానికి చేతులు చాస్తున్నాది సముద్రం!

అలసి మళ్ళా దించి మళ్ళా చాస్తున్నాది!

నీటి వద్దున పిల్లలు పిచ్చికగూళ్ళు కడ్తున్నారు.

ఉండుండి పెద్ద కెరటం వచ్చి ఆ గూళ్ళను పడగొట్టి వేస్తున్నది.

గూళ్ళు పడి పోయినప్పుడు పిల్లలు పెద్ద కేకలు వేస్తున్నారు.

విసుగు లేకుండా మళ్ళా మళ్ళా కొత్తవి కడ్తున్నారు.

దూరంగా జాలరివాళ్ళు చేపలు పడ్తున్నారు. వలపడ్డ చేపలు తీసికొని రాళ్ళు విసిరివేస్తున్నారు.

రంగు చేప పడిందట!

పిల్లలు గోలచేస్తూ చూడ్డానికి వెళ్ళారు.

"పోటు ఎక్కువగా ఉంది."

"పున్నమి కదూ"

ఇసుకలో వ్రేలితో గీతలు గీస్తూ కూర్చుంది జానకి.

"క్షమించండి! తొందర పడ్డందుకు. మీ అభిప్రాయం కనుక్కొని మీ తల్లి దండ్రులతో సంప్రదించవచ్చని మీకు ఉత్తరం రాశాను. చదువుకున్నవారు కాబట్టి మరోలా అనుకోరనుకుంటాను."

కొంగు వ్రేలికి ముడివేసికుంటున్నాది.

"నాకు మిమ్మల్ని మేరేజ్ చేసుకోవాలని ఉంది నాకు ముందూ వెనుకా ఎవరూ లేరు, ఓ ముసలి తల్లి తప్ప."

గాలికి ధూళి కంట్లో పడితే రుమాలుతో కన్ను తుడుచుకుంటున్నాది.

"నేను ఎమ్. ఏ. పాసైనాను. టెంపరరీగా రేఖా ఏజన్సీస్‌లో వర్కు చేస్తున్నాను. నాకు ఆస్తి ఏం లేదు."

"మా ఇంట్లోవాళ్ళందరి పోషణ భారం నా మీద ఉంది. మా నాన్న కట్నం ఇమ్మకోలేడు."

"కట్నం ప్రసక్తి ఎందుకు వచ్చింది. నాకు కట్నం పట్టింపు అంతలేదు. మీ అభిప్రాయం అడిగాగాని—"

"నాకు మిమ్మల్ని పెళ్ళి చేసుకోవడానికి అభ్యంతరంలేదు. కాని నేను పెళ్ళిచేసికొనే ముందు ఇంట్లో వాళ్ళకు దారి చూపించాలి మా నాన్న రెండేళ్లలో రిటైర్డు అయిపోతాడు. నా తరువాత ఇద్దరు పిల్లలున్నారు. నేను ఇప్పటి వరకూ సంపాదించినది ఇంట్లో ఇచ్చేస్తాను. ఏం? చేసుకుంటారా?"

"మీరు నన్ను అపార్థం చేసికుంటున్నారు. నేను మీ డబ్బును చూసి పెళ్లాడతాననటం లేదు...మీరు చెప్పింది దివ్యంగా ఉంది. అవును . ఇంట్లో వాళ్ళకు దారి చూపించాలే.. ఇంత మంచి హృదయం ఉన్న మిమ్మల్ని అభినందిస్తున్నాను మీ అందం హృదయం ముందు ఏప్పేంత!"

"పెళ్ళయ్యాక ఉద్యోగం చేస్తారా?"

"ఉద్యోగం మానివేస్తాను"

"మంచిది. మీ అభిప్రాయం ఆలోచించి చెప్పండి!"

"రాత్రి ఆలోచించుకొని రేపు సాయంత్రం చెప్తాను"

"సరే—తొందరలేదు."

"చీకటి పడ్డాది. ఇంక బయలుదేరుదాం!"

"గుడ్ నైట్."

"గుడ్ నైట్."

ఈ వెధవ కాలేజీ తొందరలో వదలివేస్తున్నాను.

ఇన్నాళ్లకు మంచిరోజులు వచ్చాయి.

ఆ రాత్రి హాయిగా నిద్రపోయింది.

*       *

"మీ ఫ్రెండ్ ఎవరికో రూం కావాలన్నావు చెప్పు. మేడమీద అబ్బాయి ఖాళీ చేసాడు ఇవాళ నువ్వు కాలేజీకి వెళ్ళాక. మన గది చాలటం లేదట, పెద్ద గదులున్న ఇల్లు మరో చోట దొరికిందట."

మోడుబారిన తన జీవితంలో ఆశలు చిగిరించి వెళ్ళిపోయాడు!

ఖాళీచేసి వెళ్ళిపోయాడు!

రేడియో గొంతెత్తి పాడుతోంది—

"ధనమేరా అన్నిటికి మూలం ..."

———




రంగారెడ్డి ఆ ప్రాంతంలో బాగా పేరున్న వాడు. నైజాం నవాబ్ కాలంలో దొరగానూ ప్రస్తుతం పంచాయితీ ప్రెసిడెంట్ గానూ ఆ ఊరు అధికారాన్ని చలాయిస్తున్నాడు. అతడు విగ్రహంతో, తన కున్న ఆస్తిపాస్తులతో రాజా రంగారెడ్డిగా జనంలో చలామణి అవుతున్నాడు. అతడు చిన్నతనం నుండి కూడా అధికారంలో ఉన్నప్పటి పార్టీ సభ్యుడుగా ఉంటున్నాడు. అతనికో అందమైన తెల్లటి బంగళా ఉంది. అది తాతలకాలం నాటిదే! ఆ యిల్లు ఊరికి కోటలాంటిది. రాజులాంటివాడే రంగారెడ్డి. అతనిది నిండైన విగ్రహం, బుర్రమీసాలు. ఓ పదిలక్షల రూపాయలకు, రెండొందల ఎకరాల భూమికి అధికారి. ఓ రెండు కంపెనీలల్లో వాటాదారు. పెద్ద కొడుకు డాక్టరు. ప్రస్తుతం ఆ ఏరియా రాజకీయాల్లో పేరుమోసిన వ్యక్తి. చిన్నవాడు మాత్రం రాజకీయ పరిశీలకుడుగా అన్ని దేశాలూ తిరుగుతున్నాడు. తిరిగొచ్చాక వ్యాపారం ప్రారంభిద్దామని.

రంగారెడ్డి బంగళా ముందు ఓ వేపచెట్టు. దాని చుట్టూ ఓ సిమెంటు అరుగు ఉంది.దానిమీద రెడ్డిగారు తప్ప ఇంకెవ్వరూ కూర్చునే హక్కూ, అర్హతల్లేవు. ఆ వేళ రెండు గంటలయింది. ఎండ మండిపోతోంది. గాలి వీచడం లేదు. రాజారెడ్డి లాల్చీ విడిచి గాలికోసం బనీనుతో అరుగు మీది కొచ్చాడు. ఊర్లోని రైతులందరికీ బాతఖానికి అది సెంటరు. వచ్చిపోయే అధికార్లు, తెల్లటి మేడ గనుక రంగారెడ్డి ఇంటికే వస్తుంటారు. ఆ బంగళా తలుపులు ఎప్పుడూ మూసే వుంటాయి. ఎవరన్నా కుర్రకారు తలుపుల సందులోంచి లోపలికి తొంగి చూశారో వాళ్ల వీపు సాపు కావాల్సిందే. రాణిగార్లు - అంటే రెడ్డిగారి భార్య, కూతురు, కోడలు సాయంకాలం బంగళా మీది నుండి వరదబాధితులను అధికారులు హెలికాప్టర్ల నుండి చూసినట్లు, ఆ ఊరి జనాన్ని తిలకించి ఆనందిస్తారు.

మాలమాదిగలంటే రెడ్డిగార్కి ఎనలేని జాలి. ఎప్పుడూ వారి సంక్షేమం గురించి

ఉపన్యాసాలిస్తుంటాడు. ఆ ఊరికి దూరంగా అరమైలు దూరంలో గుడిసెలు వేసుకోం డని చెప్పాడు. రెడ్డిగారు కండువా తీసి మోకాళ్ళ చుట్టు కట్టుకొని చెట్టుకు ఆనుకొని కూర్చున్నాడు. చుట్ట వెలిగించాడు. రెడ్డి గారి వందిమాగధులంతా అరుగు చుట్టు చేరారు. రెడ్డిగారు అన్న ప్రతిదానికీ తల ఊపి, నవ్వితే చుట్టలోకి ఇంత పుగాకు దొరుకుతుందని వాళ్ళ ఆశ. వేపచెట్టు మీద కాకులు అరుస్తున్నాయి. ప్రక్క వీధిలో కుక్కలు అరుస్తున్నాయి.

"అమ్మా! ఒక్క ముద్దెయి తల్లీ" కడుపు కాలిపోతుంది. ఒక్క ముద్దె య్యమ్మా."

"ఏయ్, ఏమిటా అరుపులు? ఇంట్లో వంటిది నిద్రపోతుంది" రెడ్డిగారి ఘర్జనకు వీరయ్య ఉలిక్కి పడ్డాడు. "కడుపు కాలిపోతుంది దొరా! ఒక్క ముద్దేపిచ్చండి దొరా!"

చుట్టపొగ వదిలాడు. "అది సరేగాని నీదేవూరు?"

"మామిడాల దొరా!"

"మీ రెక్కడదిగారు?"

"ఊరవతల గడ్డమీద."

"ఎవరుండమన్నారు?"

"ఎవర్నడగ లేదు, దొరా."

"ఎవర్నడగ లేమా?" గుడ్లురిమాడు. "పోలీసులకిపోర్టిస్తా జాగ్రత్త. మీ కులం?"

"ఎరుకలోల్లమయ్యా"

"ఆఁ! విన్నారయ్యా! మీరంతా! మొన్న పరిటాలలో ఎరుకలోడు ఏం చేశాడో! అర్ధ రాత్రి అమ్మాయిని హత్యచేసి నగలు దోచుక పోయాడు. ఈ అడుక్కుతినే ముండాకొడుకుల నమ్మగూడదు" రెడ్డిగారు తన అనుభవాన్ని వివరించాడు. అక్క డున్నవాళ్ళంతా తాళం గొట్టారు. తమ అనుభవాలు ఉన్నవీ లేనివీ కల్పించిచెప్పారు.

వీరయ్యకు కడుపులో ఆకలి వేస్తుంది. తలనొప్పిగా ఉంది. నిన్న తిన్న అన్నము. ఇంతవరకు దొరకలేదు కప్పలన్నా పట్టు కొని అమ్ముకుందామంటే అవీ అయి పోయాయి. ఊళ్ళో తెల్లటి బంగళా చూసి వచ్చాడు.

"దొరా ఏదో మీ దయ .. ఇంత ."

వీరయ్య నసిగాడు.

"నీ పేరేమన్నావు?"

"వీరయ్య, సామి."

"చూడు వీరయ్యా, ఇలా అందరు అడుక్కుతింటే దేశంలో కష్టంచేసేవా డెవడు చెప్పు? ఈ దేశానికి స్వాతం త్ర్యము కోసం మేము ఆ రోజుల్లో గాంధీ గారితో కలిసి ఎంత కష్టపడ్డాము అటు వంటి దేశం ఈ రోజు అప్పులపాలయిం దంటే కారణం ఏమిటి? సోమరితనం. దేశంలో కొన్ని లక్షల మంది నీలాటివా ల్లుండబట్టే తిండి కరువు, బట్ట కరువు, అన్ని కరువులే. ఇతర దేశాల నుండి అప్పులెందుకు తెస్తున్నాము చెప్పు? మనకు భూముల్లేవా! నీరులేదా? ప్రతివాడు కూర్చుని సంపాదించాలంటే ఎలాగయ్యా! ఏదో కష్టంచేస్తే నీవు బాగుపడతావు, దేశానికి




పాయం చేసినవాడివవుతావు" ఉపన్యాసం ముగించాడు రెడ్డి. గాంధి శతజయంతికి మటుకి రెడ్డిగారు ప్రస్తుతము అధ్యక్షుడు. ఆయన ప్రతిమాటల్లో గాంధి పేరు వాడుతాడు ఉన్న టెరికాటన్ బట్టలు తీసేసి ఈ మధ్యనే ఖద్దరు తొడుక్కున్నాడు

రెడ్డి చెప్పిన మాటలు వీరయ్యకు అర్థంగాకున్నా తలూపాడు. రెడ్డి నవ్వాడు అక్కడున్న వాళ్లంతా నవ్వారు.

"ఏం చేయాల దొరా?" వీరయ్య కంట్లో నీళ్ళు తిరిగాయి. నోటమాట సరిగా రావడం లేదు.

"ఏం చేయాలా! ఇటుపోతే అడవి. కట్టెలులు కొట్టుక అమ్ముకో. అటుపోతే చెరువు. చేపలు పట్టు. పెట్టుబడిలేని వ్యాపారం "కష్టేఫలిః" అన్నారు పెద్దలు. ఇదిగో వీరయ్యా, ఈ ఊళ్లో ఇంకెవరు నీకు పెట్టరు. జాగ్రత్తగా వెళ్ళి ఏదోపని చేసుకో. లేకుంటే వెళ్ళిపో! ఈ భిక్షాటనంటే నాకు తగని మంట." రెడ్డిగారు ఆవులించాడు. లేచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. అక్కడున్న జనంకూడ పోతున్నారు. వీరయ్య ఆశ, అడియాసైంది. ఇంత చెప్పినా కనీసం రెండు శేర్ల గింజలన్నా దొరుకుతా యనుకున్నాడు. అదీ లేదు.

వీరయ్యా రెడ్డి చెప్పిందాంట్లో కొంత నిజమే ఉందనుకున్నాడు. తన తోటి రంగన్న పట్నంలో కష్టం చేసుకుని ఇల్లు కట్టుకున్నాడు. రెడ్డిగారు చెప్పినట్లు చేస్తే వారికి దయ గలుగవచ్చు. తనకీ వూళ్లో ఓ గుడిసె వేయించవచ్చు. ఇంతపని చూపించవచ్చు. వాగెంట ఉన్న పోరంబోకు ఇప్పించవచ్చు . ఆలోచనలతో వీరయ్యా అడవికి బయలుదేరాడు.

*        *

అదేరోజు సూర్యుడు పశ్చిమాన ఉన్న వేళ. రెడ్డిగారు నిషాతో ఉన్నవేళ. ఊరి జనం కల్లు నిషాలో ఉన్నవేళ మళ్ళీ అరుగు

వద్ద అందరు కూడారు. రెడ్డిగారు జాతీయ, అంతర్జాతీయ విషయాలు చెపుతున్నాడు. రెడ్డిగారు తన తీర్థయాత్రా విశేషాలు చెబుతున్నాడు. "ఒకసారేమయిందంటే నేను కాశీ వెళ్లాను. అక్కడ బెనారస్ సత్రంలో దిగాను. నేనున్న ప్రక్క గదిలో ఆసక్తి దాయకమైన సంభాషణ జరుగుతోంది. ఒకడు అడుగుతున్నాడు. "ఈ రోజెంత సంపాదించావు?" "ఇంకా మొదలు పెట్టలేదు" ఆడకంఠం జవాబు. "ఎన్నాళ్ళు గింజుకుంటావో చూస్తాను." ప్రక్కగదిలో క్రొత్తవాడు దిగాడు! అతని కంఠం కర్కశంగా ఉంది. అతను వెళ్లిపోయాడు. పాపం! ఆ అమ్మాయి జాలి చూపులతో నా వైపు చూసింది. నేను తెచ్చి పెంచుకుందామనుకున్నాను. కాని ఇంట్లో నా పెండ్లాం బయట ఈ సంఘం ఊరకుంటుందా అని .. " రెడ్డిగారు ఇంకా చెబుతున్నాడు అందరు తమ జన్మ తరించినట్లు వింటున్నారు

"దొరా, కట్టెలు!" కట్టెల మోపుతో వీరయ్య వచ్చాడు. అతని చొక్కా అంతా చిరిగిపోయింది. జుట్టు దుమ్ముకొట్టి వుంది. ప్రొద్దుట నుండి అన్నం లేక కండ్లు పీక్కుపోయాయి.

రంగారెడ్డి లేచాడు. కట్టెల మోపు కాలుతో అటూ, ఇటూ దొర్లించాడు. అతని ముఖం ఎర్ర బారింది. నోట్లో చుట్టదీసి దుర్వాసుడు వెంట్రుకలు నేలకు కొట్టినట్లు కొట్టాడు.

ఒరేయి వెంకన్నా! ఎక్కడ చచ్చావ్రా!

వీరయ్య బిక్కమొగం వేసి చూస్తున్నాడు. పరీక్షలో బాగా వ్రాసి పాసవుతాననుకొన్న విద్యార్థికి "మాల్ ప్రాక్టీస్" అని రిమార్క్ వచ్చినట్లయింది వీరయ్య పరిస్థితి. "ఇటు రా రా! ఈ కట్టెలు చూడు! ఎక్కడివిరా ఇవి?"

"అయ్యా! దొరా!" జీతగాడు నసుగుతున్నాడు. "ఇవన్నీ మనం నాట్లకోసం కొట్టిన కట్టెలు కావురా?"

"అవు దొరా!" అందరూ తలలూపారు. అందులోనుండి ఓ కట్టె తీశాడు. వీరయ్య జుట్టందుకున్నాడు.

"దొంగలంజకొడకా! కష్టం చేసుకోమంటే నాకే ఎసరు పెడతావురా! ఎన్ని గుండెలురా నీకు? నీ వెవడనుకున్నావురా రాజా రంగారెడ్డి!" ఒకటి, రెండు........ పది ధనా, ధనా దెబ్బలేస్తున్నాడు.

"నీ కాలుమొక్త దొరా! అడవికిపోయి తెచ్చా దొరా?"

"అదిగో! అదే! నా కట్టెలు నాకు తెలువవట్రా." కట్టె విరిగిపోయింది. రెడ్డిగారు అలసిపోయాడు. నిషా దిగిపోయింది. వీరయ్య వంటి మీద రక్తం మరక లయ్యాయి.

"ఇదిగో, మళ్ళీ ఈ ప్రాంతంలో అడుగు పెడితివి, నీ బొక్కలిరగ్గొడతా!"

వీరయ్య వెళ్ళిపోయాడు.

"వెంకన్నా, ఈ కట్టెలమోపు ఇంట్లో పడేయి. మూడు రోజుల నుండి అమ్మగారు కట్టెలు లేవంటే ఒక్కడన్నా వింటేనా? మీకు జీతాలు దండుగ. తీసుకెళ్ళు."

ఆ రాత్రి రంగారెడ్డి పట్టెమంచం మీద భార్య జడలోని మల్లెల వాసనతో హాయిగా నిద్రపోయాడు.





# ప్రయాణం

"పట్టిసపు"

ఎమ్మెస్సీ ప్రీవియస్ ఎగ్జామినేషన్సు అవగానే శలవల్లో వుండడానికి మా స్వగ్రామమైన కాకినాడ వచ్చాను. వచ్చిన అలసట యింకా తీర్చుకోకముందే పెద్దన్నయ్య మద్రాసు వెళ్ళడానికి ముందుగా పోర్టు స్టేషన్‌కి వెళ్ళి టిక్కెట్టు తీసుకొని, సీటు రిజర్వు చేయడానికి నన్ను పంపేరు. పోర్టు కెళ్ళి టిక్కెట్టు తీసుకొని, 'సర్కార్' లోకోషెడ్డు నుండి ప్లాట్ ఫారం మీదకు రాగానే ఓ కంపార్టుమెంటులోకి ఎక్కి బెర్తుపైన దుప్పటి పరచి, క్రింద సీటులో కూర్చున్నాను. సిగరెట్ తీసి, వెలిగించి ప్లాట్‌ఫారం వైపు వస్తున్న జనాన్ని చూడసాగాను. ఫామిలీ ప్లానింగ్" అమలు జరపలేదా అన్నట్లున్న ఓ పెద్ద కుటుంబం తరలి వస్తోంది...మా కంపార్టుమెంట్ వైపు.

ఓ లావుపాటి ఆయన, ఆయనకు తగ్గట్టే వాళ్ళావిడ, ఓ పదారేళ్ళ అమ్మాయి, మరి నలుగురు పిల్లలు (ఇద్దరు ఆడ, ఇద్దరు మగా లెండి). ఓ బొచ్చుకుక్క, బోలెడు సామాన్లు, బోల్టు లూడ దీసిన మంచాలు. కంపార్టుమెంటు చేరాయా అని ఆయన బాల్డ్ హెడ్ సవరించుకుంటూ చూస్తున్నాడు. ట్రాన్స్‌ఫరై వెళ్ళిపోతున్నారు గాబోలు, అయినా నా కెందుకులే అని ఊరుకున్నాను.

ఎదురుగుండా సీటులో కూర్చున్నావిడ పిల్లాడు 'కేర్' మని గట్టిగా ఏడవడం మొదలు పెట్టాడు. ఆవిడ శతవిధాల ప్రయత్నించి ఊరుకో పెట్టలేక పోయింది. ఒకసారి సిగ్గుగా అటు, ఇటు చూసి పాలివ్వడం మొదలు పెట్టింది.

ఎటు చూడ్డానికి లేక, కిటికీలోంచి ప్లాట్ ఫారం వైపు గాక ఇవతలి వైపు చూస్తూ కూర్చున్నాను. పట్టాలకి, పట్టాలకి మధ్య ఓ మేక వీపు మీద కురుపుని ముక్కుతో పొడుస్తోంది కాకి. ఆ బాధ భరించలేక రైలు క్రిందకి దూకిందా మేక.

"పైన పరచిన దుప్పటి ఎవరిది మాష్టారూ?" అన్న మాటలు విని ఒక్కసారి లోపలకు చూశాను. సన్నగా, పొడుగ్గా వున్న సదరు వ్యక్తిని చూసి "అవునండి, నాదే" అన్నాను

"ఎందాకా వెడతారు?" అన్నాడు తల మీదున్న రెండో, పదో వెంట్రుకల్ని సవరించుకుంటూ.

"ఈ రైలు కదలనని మొరాయించే దాకాను. అవునూ . .మీ కెందుకు?" అన్నాను.

ఎదురుగుండా ఆవిడ పిల్లాడ్ని మరో పక్కకు మారుస్తూ కిసుక్కున నవ్వింది.

"అయితే, ఇక్కడ సీటు లాభం లేదన్న మాట" అని గొణుక్కుంటూ దారిచ్చుకున్నాడు.

నవ్వుకుంటూ కిటికీ లోంచి చూడడం మొదలు పెట్టాను.

ఎంత సేపటినుంచి అలా చూస్తోందో కాని, ఆ లావుపాటి ఆయన పదహారేళ్ళ మ్మాయి, ఐదు కిటికీల అవతలనుండి నన్నే చూస్తోంది. నాకు కూడా ఆమె నలాగే చూడాలనిపించింది.

అదే ప్రకారంగా ఆమె కళ్ళల్లోకి చూడసాగాను. అలా ఎంతసేపు చూసినా ఆమె కళ్ళు మాత్రం దించ లేదు. ఇందాకా వాళ్ళ ట్రైన్ ఎక్కేటప్పుడు మామూలుగా అందర్నీ చూసినట్లే ఆమెనీ చూశాను. కాని ఇప్పుడలా ఆమెని చూడలేకపోతున్నాను. ఆమె కళ్ళల్లో ఏవో భావాలు నా మదిలో బాధలు రేపుతున్నాయి. ఆ కళ్ళల్లో వెలుగు, జిలుగు, ఆ చూపులోని చురుకు-కరుకులు, ఆ ముక్కు తీరూ-తెన్నూ, పలువరసల అందం-చందం చూస్తూంటే, దేవలోకం నుండి దిగివచ్చిన మేనకా, లేక రెబెకాయా (ఇదేం కాయ కాదు) అనిపించింది. నాకు తెలియకుండానే నా మనస్సు ఆమెను ఆరాధించడం మొదలు పెట్టింది. మధ్యలో పానకంలో పుడకలా, చేప కూరలో ముల్లులా, నాల్గవ కిటికీలోంచి ఓ పల్లెటూరి రైతులాంటివాడు బయట పెట్టాడు ట్రాన్సిస్టర్ ఏరియల్‌ని. ముందు గరగర సౌండ్, తరువాత సిలోన్ కాబోలు 'మెరె సామునె వాలే కిడికీ మే' అన్న పాట వస్తోంది. 'ఇవాళ ఆది వారం కదా! అంచేతే ఇంకా వస్తున్నాయి పాటలు.' అనుకున్నాను నవ్వుకుంటూను, సందర్భం సరిపోయినందుకు.

ఇంతలోకే ట్రైన్ కూతేసి, నడవడం మొదలుపెట్టింది. నా మనస్సులో భావాలు కూడా నడవడం మొదలుపెట్టాయి.అప్పుడే "బూట్ పాలిష్ సార్" అంటూ కాలు పట్టుకున్నా డో కుర్రాడు.

"బ్రూట్ పాలిష్ ట ... పాలిష్... అక్కరలేదు" అని విదిలించుకున్నాను.

కాకినాడ టౌన్ స్టేషన్ వచ్చేసింది. ఒక్క నిట్టూర్పు నిట్టూర్చి 'మా అన్నయ్య ట్రైన్ ఎక్కడానికి సాయబడి సామర్ల కోట దాకా వెడితే బాగుండును. ఎడ్రస్ ఎలాగో తెలుసుకోవచ్చు' అనుకున్నాను.

కాని యిప్పుడా రష్‌లో టికెట్ తీసుకునేసరికి రైలు వెళ్ళిపోతుందని అక్కడే ప్లాట్‌ఫారం మీద నించుని చూస్తున్నాను. ఆమె వాళ్ళ తమ్ముడు కూర్చున్న సీటులో సర్దుకుంటూ నాకు కనిపించేటట్లుగా కూర్చుంది. ఇంతలో గార్డు విజిల్‌తో రైలు కూత కూసి బయలుదేరింది. అన్నయ్యతో వుంటానని చెప్పి, కాసేపు సంశయించి, జేబురుమాలు తీసి గాలిలో వూపాను. ఆశ్చర్యం ఏమిటంటే, ఆమె కూడా చెయ్యి గాలిలో వూపడం మొదలు పెట్టింది. ఆమె ధైర్యాన్ని మెచ్చుకోకుండా ఉండలేక పోయాను. కనుచూపు మేర అలా చేయి వూపి, రైలు బొమ్మ రైలంత కనబడే దాకా చూసి, నిట్టూర్చి, యింటి ముఖం పట్టాను. ఏ పని చేసినా, చెయ్యకపోయినా ఆమె ముఖమే కనబడుతోంది, కళ్ళకు కట్టినట్లు.

ఈ సంఘటనలన్నిటినీ పూర్తిగా రాసి, చివరలో వాళ్ళిద్దరూ కలుసుకున్నట్లుగా సుఖాంతం చేసి, ఓ కధ రాసి, దాన్ని ఓ పత్రిక్కి పంపిస్తూ....ఎడిటర్‌గారికి. . . దీనిపై ఏమైనా ఉత్తరాలుగాని, విమర్శలుగాని, మరే యితరమైన లేఖలుగాని వచ్చినా నాకు పంపమని రాసి పంపాను. రెండు నెలల తర్వాత కాబోలు నాకో చిన్న పేకెట్ వచ్చింది. అందులో ఎడిటర్‌గారు వ్రాసిన ఉత్తరంతోబాటు ఆరు ఉత్తరాలు వున్నాయి.

మొదటి ఉత్తరం. ."మీ కధ చాలా బాగుంది. కధ సుఖాంతం చేసినందుకు చాలా సంతోషిస్తున్నాను"

రెండవ ఉత్తరం ."కధ థీమ్ బాగానే వుంది గానీ, హీరో చవటలా వున్నాడు. మీ రింతకు పూర్వం వ్రాసిన కధలకు, ఈ కధకు చాలా వ్యత్యాసం వున్నదని పించింది."

మూడవ ఉత్తరం .."మీ కధ బాగానే వుంది . గాని సుఖాంతం కాకుండా, దుఃఖాంతం చేస్తే యింకా బాగా రాణించేదేమో! కధ అనిపించింది."

నాల్గవ ఉత్తరం . "కధలో హీరోయిన్ హిందూదేశపు మరియూ . ఆంధ్రదేశపు కన్నెపిల్లలా లేదు, మలుపు బాగానే వుంది."

ఐదవ ఉత్తరం ."మీ కధలో రాసినట్లు రైళ్ళలో యిటువంటి సంఘటనలు జరగడం నేనూ చూశాను. కధ చాలా సమంజసంగా ఉంది. నాకు చాలా నచ్చింది.



కాని నా మిత్రుడొకడు ఇటువంటి ఆంగ్ల కథ చదివినట్లు అనుమానం వెలిబుచ్చాడు. నే నతన్ని గట్టిగా ఖండించాను. మీ మీద నమ్మకంకొద్దీ!"

ఆరవ ఉత్తరం .విసుగ్గా తీశాను. అందులో యిలా వుంది. "శ్రీనివాస్‌గారికి, మీరు వ్రాసిన కథ చదివాను కథలో మీరు వ్రాసిన స్త్రీ పాత్ర నేనే నంటే మీరు ఆశ్చర్యపోతారనుకుంటాను. కథ రాయ డానికి మీ ఉద్దేశ్యం ఏమైనా మనిద్దరినీ మళ్ళీ కలపడానికే యీ కథ చాలా ఉపక రించిందనుకుంటాను. మీ గురించి కూడా నేను ప్రయత్నం చేయకపోలేదు. కాని మీ కొచ్చినంత అయిడియా నాకు రాలేదు. ఈ ప్రోబ్లం యింత యీజీగా సాల్వ్ చేయ గల బుద్ధి శాలురని నా కిప్పుడే తెలిసింది. మన మొకసారి ఈ క్రింది ఎడ్రస్ దగ్గర కలుసుకొని మన అభిప్రాయాలు ఏకమైన వెంటనే మన పెద్దల అనుమతిని తీసుకొని, వివాహం చేసుకొందాం. తప్పక వస్తారు కదూ!

మీ

'గీత.'

ఉత్తరం చూసిన వెంటనే నాలోని ఉత్సాహం పెల్లుబికి పోయింది. ఎగిరి

గంతేసినంత పని చేశాను. ఇందాకటి విసు గంతా పోయింది.

గబగబా బ్రీఫ్ కేస్‌లో రెండు జతల బట్టలు, కుక్కుకొని బయలుదేరాను భీమవరానికి. రైలు దిగి తిన్నగా ఆమె చెప్పిన అడ్రస్సు ప్రకారం చేరి, రెండంతస్థుల భవనం ముందు ఇటూ, అటూ తచ్చాడుతున్నాను. ఇంతలో ఏడేళ్ళ కుర్రవాడు, "మీరేనా!.... శ్రీనివాస్‌గారు?" అని అడిగి నన్ను తనతో ఆ మేడ పై అంతస్థుకి తీసుకెళ్ళి కూర్చో పెట్టి, ఆ రోజు దినపత్రిక చేతిలో పెట్టి ప్రక్క గదిలోకి వెళ్ళాడు. నా తల్లో ఆలోచన్లు కార్టూన్‌లలో వేసే స్ప్రింగ్‌లలాగ తిరగసాగాయి. యింతకుమునుపు కొన్ని నిముషాలు మాత్రమే ఆమెను చూసిన నేను మొదటిసారిగా ఆమెతో పరిచయమున్న వాడిలా . ఎలా మాట్లాడ్డం? అని ఆలోచించసాగాను. అయినా వాళ్ళ వాళ్ళు చూస్తే ఏమనుకుంటారో! ఒకవేళ ఆమె పెళ్ళికి ఒప్పుకుంటే మా వాళ్ళను ఒప్పించటం పెద్ద కష్టమేమీ కాదు ఈ ఆలోచనలతో తలకు రాసిన కోకోనట్ ఆయిల్ ఇవాపరేట్ కాసాగింది. తలుపు తీసుకుని, ఒక అమ్మాయి కాఫీ ట్రే పట్టుకొని, తలవంచుకొని వచ్చింది. ఈమె గీతకి ఏమౌతుందా అని ఆలోచించసాగాను. కాస్త భయం, అనుమానంతో వున్నట్లు వణుకుతున్న గొంతుకతో . "మీ....మీరేనా....శ్రీనివాస్‌గారు?" అంది.

"అవునండి. నేనే ...శ్రీనివాస్‌ని...."

"మీ కథ చాలా బాగా రాశారు. ఇటువంటి కథలు చాలా అరుదుగా వస్తూవుంటాయి. ఇంత మంచి కథ రాసినందుకు నా హృదయపూర్వక అభినందనలు."

"మీరు. . మరీ అంత పొగడకండి. నేనంత అర్హుణ్ణి కాను. ఇంతకీ...గీతగారు బైటికెక్కడికైనా వెళ్ళారా?...."

"అబ్బే లేదండి. ఎక్కడికీ వెళ్ళలేదు."

"మరి...."

"సారీ....నా పేరే గీత. కాని మిమ్మల్ని నే నెప్పుడూ చూసినట్లు లేదే. ఒక వేళ మీరు రాసిన కథ ఊహ మాత్రమేనా?. ."

"సారీ . టు టెల్ యూ. .చాలా కథలు ఊహించి రాసినా ఇది మాత్రం కాదు "

"అయితే.. మీరు నన్ను క్షమించాలి. నాకు కూడా యిలాంటి ఇన్సిడెంటే...జరగబట్టి మిమ్మల్ని పిలవాలసి వచ్చింది. ఐ యామ్ సో సారీ...."

"నెవర్ మైండ్ టేక్ యిట్ యీజీ. ఇటువంటి సంఘటనలు మన జీవితంలో చాలా జరగచ్చు. ఒక గమ్యానికి చేరడానికి ప్రయాణించే ప్రయాణికులు గమ్యాన్ని చేరుతారా! లేదా! అన్నది చెప్పలేం. ఇటువంటివి మనస్సులో పెట్టుకొని, బాధపడ్డం అవివేకం. లెటజ్ ఫర్గెట్ ఎవ్విరిథింగ్..." అంటూ కుర్చీలోంచి లేచి, నిలబడి స్టేషన్ వైపు దారితీశాను.




అసలు సుబ్బారావంటే నాకు మొదట్నుంచి పడదు. దానికి కారణం లేకపోలేదు నా కథల గురించి ఎక్కడో అవాకులూ చవాకులూ ప్రేలాడట ఆ మనిషిలో తానేదో పెద్ద విమర్శకుడనన్న గర్వం బాగా కన్పిస్తుంది. ఆ రోజు అతనితో అంత అకస్మాత్తుగా మాట్లాడవలసి వస్తుందని అనుకోలేదు. మా ఇంటి అరుగుమీద కూర్చుని ఆ వారం పత్రికలో పడ్డ నా కథ చదువుకొంటున్నాను.

"నమస్కారం మాష్టారూ" అని వినిపిస్తే తలెత్తి చూసాను.

"రావోయి కూచో" అన్నాను ఆశ్చర్య పోతూ

సుబ్బారావు కూచున్నాడు. "మీ కభ్యం తరం లేకపోతే మీతో కాసేపు కాలక్షేపం చేద్దామని ఉంది" అన్నాడు.

వాడు ఇప్పుడు తగిలాడేమిటని చిరాకుపడ్డాను. "అభ్యంతరం ఏముంది, అలాగే కాని" అన్నాను చేతిలో పత్రిక ప్రక్కన పెడుతూ.

"మీరేదో కథ చదువు తున్నట్టుందే. డిస్టర్బెన్సు కలిగించినట్టున్నాను. సారీ" అన్నాడు పత్రిక వంకచూస్తూ.

'ఫరవాలేదులేవోయ్! నా కథే చదువు కొంటున్నాను,' సగర్వంగా చెప్పాను

"నేను ఒకసారి చదవచ్చా" అడిగాడు.

"తప్పకుండా." పత్రిక అందిచ్చాను

ఆ కథేమిటో సంక్షిప్తంగా పాఠకులు కూడా తెలుసుకోవాలి.

"ఒక పేద గుమాస్తా. చిన్నప్పుడు నీతిపాఠాలు, శతకాలు చదువుకున్నవాడు. లంచాలు పుచ్చుకోడం తప్పని అతనికి ఎప్పుడో తెలిసింది. దేవుడు తనలాటి నీతిపరుల మీద మంచి చూపు చూస్తాడని నమ్మినవాడు. అందుకే రెండో పూట పస్తులుంటున్నా చేతులు మేజాల క్రిందికి చాచలేదు. పిల్లల్ని బళ్ళోకి పంపించేం దుకు పుస్తకాలు కొనాల్సివున్నా అపమార్గాల్ని పట్టలేదు. ఈసారి పండుక్కయినా కొత్త చీరకొని పెట్టమని పెళ్ళాం మారాం చేసినా డబ్బుకి అమ్ముడుపోలేదు. అంత మంచి వాడు ఆ గుమాస్తా.

మనుషులు కష్టాలు పడుతున్నారంటే దేవుడు వారిని పరీక్షిస్తున్నా డన్నమాట. ఆ కష్టాలను తిట్టుకోకుండా తలవంచుకొని పోయేవాడికి తప్పకుండా మేలు జరుగు తుంది.

ఆ గుమాస్తాకు మేలే జరిగింది. కొద్ది కాలానికి అతడి నిజాయితీని,వినయ విధేయ తలను పై ఆఫీసర్లు గుర్తించారు. వెంటనే మంచి ప్రమోషను లభించింది.

కథ చదివిన సుబ్బారావు ఊరుకొన్నాడా. "ఇదో వెధవ కథ మాష్టారూ" అని వెదవ అభిప్రాయం వెల్లడించాడు.

ఆ వెధవ మీద నాకు చిరాకెత్తు కొచ్చింది. "అవును. మనుషులు నీతికి, నిజాయితీకి కట్టుబడి ఉండటం నీ కిష్టం లేదు. ఆ గుమాస్తాని లంచం తీసుకొన్న ట్టుగా చూపిస్తే ఇది నీకు మంచి కథే అయుండేది" అన్నాను

"ఈ కథ వల్ల ఏమిటి సాధిద్దామను కున్నారు?" ప్రశ్న వేసాడు.

చెప్పాను "సమాజం చెడిపోతున్నాది. డబ్బు కాశపడి మనుషులు పెడదార్లు త్రొక్కుతున్నారు. నీతిని వదిలేస్తున్నారు. ఈ సమాజాన్ని బాగుచెయ్యవలసిన పాత్ర రచయిత మీదే వుంది. అందు గురించి నీతికోసం నిలబడే పాత్రలే కథల్లో సృష్టించబడాలి. చివరికి అందువల్ల మంచి ప్రయోజనం చేకూరేట్టు చూపించాలి. అప్పుడే ఆ కథలు నీతిని పాటించేందుకు తగిన ఆత్మ స్థైర్యాన్ని ప్రజల్లో కలి గిస్తాయి."




కాని సుబ్బారావు ఊరుకోంటాడా. అసలే పెద్ద విమర్శకుడ ననుకుంటాడు. "మీరు మీ కథల్లో కథానాయకుడ్ని నీతి అనే ఆదర్శంకోసం చివరిదాకా నిలబెడ తారు. పరిస్థితులు ఎంత క్రుంగదీసినా ఆదర్శంవలన ప్రయోజనం చేకూరేటట్టు చూపిస్తారు కాని అందులో మీరు వాడి వ్యక్తిగత జీవితాన్ని దాచేస్తున్నారు. అబద్ధానికి రంగులు పూసి నిజంలా మభ్యపెడుతున్నారు. నిజానికి లంచం పుచ్చుకొని కంట్రాక్టరు కనుకూలంగా పనిచేయని గుమాస్తా మర్నాడే ఏ దూర ప్రాంతానికో బదిలీ అవుతున్నాడు. వాడికి ఏ లాటరీయో లేక ప్రమోషనో వచ్చినట్టు కథల్లో చూపించడం సులభమే. కాని జీవితంలో వాడు నీతిని విడిచిపెట్టి డబ్బుకోసం ఎంత పనయినా చేస్తున్నాడనా? ఇటువంటి రచనల ద్వారా ఆకలి కడుపుకి అన్నం లేనివారికి నీతి అంటూ ఏదో బోధించి వారిలోవుండే చైతన్యాన్ని చంపేస్తున్నారు" అన్నాడు.

నాకు కోపం వచ్చేసింది. సుబ్బారావుని అమాంతంపట్టి బాల్ బంతిలా తన్నేద్దామా అనిపించింది. "సమాజం ఇప్పటికే చెడిపోయింది ఒక వ్యక్తి నీతిని విడిచిపెట్టి సుఖపడ్డట్టు చూపిస్తే అది ఇంకా చెడు ప్రభావం తెస్తుంది" అన్నాను.

సుబ్బారావు వెంటనే అందుకున్నాడు. "మీరు చెప్పినట్టు సమాజం చెడిపోతున్నాదన్న విషయం నిజమే. గుమాస్తాలు లంచాలు తింటున్నారు. అడుక్కునేవాళ్ళు తమ పిల్లలకు కాళ్ళు విరిచేసో, కళ్ళు పోగొట్టో మళ్ళీ అడుక్కునేందుకు దేశం మీదకు పంపిస్తున్నారు. ఆడవాళ్ళు వ్యభిచరిస్తున్నారు. అంతకంటే హేయమైన బ్రతుకుందా. లేదు. కాని దానంతటికీ మూల కారణం ఏమిటి? అది ముఖ్యంగా ఈ వ్యవస్థ

దోషం.ఇందులో వారి బాధ్యత కొంతవరకే. వారు అలా తయారవడానికి కారణమైన చుట్టూ ఉన్న పరిస్థితులను నిర్మూలించాలి గాని వారికి నీతిబోధలు చేసి ప్రయోజనం లేదు," ఆవేశంతో చెప్పుకుపోయాడు.

కాసేపూరకుండి తనే అన్నాడు."మీరు పొరబడ్డారు మాష్టారూ. మీ కథల్లో నీతీ, నిజాయితీ అంటూ గంతులేసినంత మాత్రాన ప్రయోజనం ఉండదు. మని షెప్పుడూ పరిస్థితులకు బానిస. ఆదర్శం నిలబెట్టుకోడం గొప్ప విషయమే కాని నిల బెట్టుకుందామనుకునే వాడు చితికి పోతు న్నాడు. తను బ్రతకడానికి తిండి, బట్ట, ఇల్లు మొదలైన కనీసావసరాలు లేనపుడు ఎవడూ నీతిని గురించి ఆలోచించడు.

మీరు గదిలో నాలుగు గోడల మధ్యన కూచుని మీ వూహా ప్రపంచంలో యేవో పాత్రలు సృష్టించి కథలు వ్రాస్తారు. అబ ద్ధాన్ని 'నిజం'గా చాటుతారు. మీరు జీవి తానికి దగ్గరగా రావాలి. జీవితాన్ని పరిశీలిం చాలి. జీవితాన్ని అనుభవించాలి. జీవితం మధ్యనే జీవించాలి. మీరు తీసుకున్న కథావస్తువు జీవితం నుండే తీసుకోవాలి. జీవితంనుండి తీసుకున్న కథావస్తువుతోనే జీవితాన్ని ప్రభావితం చెయ్యాలి. అప్పుడే కథకు ప్రాణం ఏర్పడుతుంది. కొత్త వ్యవస్థకు పునాది ఏర్పడుతుంది."

సుబ్బారావు చెప్పడం అయిపోయిం దన్నట్టుగా నా వంక చూశాడు. నాకు అతడిమీద విపరీతమైన కోపం వచ్చింది. నేను జీవితానికి దగ్గరగా రావాలా? ఊహా ప్రపంచంలో ఉండి కథలు రాస్తున్నానా? "తనలో పట్టుదల ఉంటే ఎంతటి వ్యక్తైనా నీతి నిజాయితీలకోసం నిలబడగలడు. ఇది వాస్తవికతకు విరుద్ధం కాదు. అలా నిల బడలేనివాడ్ని నేను సహించను. పైగా క్షమించను కూడ" అన్నాను.

అతడు ఒక్కక్షణం గంభీరంగా నాకేసి చూసి చెప్పాడు: "మీరు మీ కథల ద్వారా వారిని మార్చేయలేరు మాష్టారూ. ఈ వ్యవస్థలో నీతి నిజాయితీలు నిలబడవని వారికి జీవితమే నేర్పుతుంది. సరే, ఈ గొడవలు ఇప్పుడెందుకు గాని చిన్న సంఘ టన గుర్తొచ్చింది. చెప్తాను వినండి" అంటూ చెప్పాడు.

"మా వూళ్ళో ఒక మాష్టరుగా రున్నారు. ఆయనకు ఆరుగురు సంతానం. భార్య రోగిష్టిది. డాక్టరు వ్రాసిన మందులు కొనాలంటే ఆయన దగ్గిర డబ్బు లేదు. మందులు తనుకొంటేగాని ఆమె బ్రతకదు. ఆ వూర్లో ఆయనకు కానీ కూడ అప్పు పుట్టదు.

ఇటువంటి పరిస్థితిలో ఆయన పిల్లల పేపర్లు దిద్దారు. మా వూళ్ళో రామనాధం అని ఒక ధనవంతుడున్నాడు. ఆయన గారికో అబ్బాయి ఉన్నాడు. అతడి పేపరు మాష్టారి చేతిలోకే వెళ్ళింది. పాసుకావ టానికి అయిదు మార్కులు తక్కువ వచ్చా యని రామనాధం ముందే తెలుసుకొని మాష్టారితో చెప్పాడు.

"ఏమిటి?" అడిగాను.



"అతడి కుర్రాడిని పాసుచేస్తే వంద రూపాయలు బహుమానం ఇస్తానన్నాడు. ఒక ప్రక్క పెళ్లాం జబ్బు ముదిరిపోతున్నాది. దిద్దిన పేపర్లు మర్నాటికి హెడ్మాష్టరు గారికిచ్చేయాలి. పెళ్లాన్నెలాగైనా బ్రతికించుకోవాలంటే మందులు కొనాలి. డబ్బు ఇంకెక్కడి నుండైనా వచ్చేమార్గం కనబడ్డంలేదు. ఇటువంటి పరిస్థితిలో ఏం చేస్తాడు చెప్పండి" అని సూటిగా నాకే ప్రశ్న వేశాడు.

"పాపం ఏం చేస్తాడు! రామనాథం దగ్గిర నూరు రూపాయలు పుచ్చుకొని వాళ్ళబ్బాయిని పాసుచేసి ఉంటా"డన్నాను.

"మీరు చెప్పింది కరక్టు. వస్తా"నంటూ లేచి వెళ్ళబోయాడు.

ఇంతలో నాకో సందేహం వచ్చింది. "ఇంతకీ మాష్టారి పెళ్ళాం బ్రతికిందా?" అడిగాను.

సుబ్బారావు ఒకసారి సన్నగా నవ్వాడు. "ఇప్పుడు నే చెప్పిన సంఘటన యేదీ జరగలేదు. మాష్టారు లేరు. రామనాథం లేడు. మాష్టారి పెళ్ళాం, ఆవిడకో జబ్బూ, ఏదీ లేదు," అని వడివడిగా వెళ్ళిపోయాడు.

## కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒక సారస్యం

ఉమ్మడిగా తినటంలో ఉన్న మజాయే వేరు! దానికి కోకా-కోలా తోడైతే పసిడికి పరిమళమబ్బినట్టే! ఉల్లాసం, ఉత్తేజం కలిగించే సజీవమైన రుచి కోకా-కోలా రుచి. అందుకనే, త్రాగాలనిపిస్తుంది మళ్లీ మళ్లీ. త్రాగండి కోకా-కోలా—మళ్లీ కోకా-కోలా—మళ్లీ మళ్లీ కోకా-కోలా! ప్రపంచంలో నలుమూలలా, పెరిగిపోతోంది కోకా-కోలా త్రాగేవారి సంఖ్య రోజు రోజుకూ. కారణం: సేదదీర్చటంలో కనివిని ఎరుగని కమ్మదనం కోకా-కోలా కమ్మదనం!




కోకా-కోలా కోకా కోలా కంపెనీవారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్ మార్క్.

CMCC-17-162 TEL



# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

ఆచార్లుగారు చప్పున శేషయ్య చేతులు పట్టుకున్నాడు.

"బాబూ! ఏమిటీ గొడవ! పెద్ద వారు మీరు చెయ్యాల్సిన పనేనా! చిన్నవాళ్ళు ఏదయినా తెలియకచేస్తే సర్దుకుపోవాలి. చాటుగా మందలించాలి. అంతేగానీ యిలా నలుగురిలో నవ్వులాటగా చేసుకుంటారా! నా మాట వినండి. ఇప్పటికి తగ్గండి."

"యీ బోడినీతులన్నీ వాడికి చెప్ప వయ్యా నువ్వు. నా మీద చేయి చేసుకుంటాడా! వాడి అంతు తేల్చకబోతేచూడు. నా పేరు శేషయ్యే కాదు."

ఉత్తరీయం దులిపి పైన వేసుకుని వెళ్ళిపోతూ ఆగి వెనక్కి తిరిగి అత్తయ్య వైపు చూసి కళ్ళెర్రచేస్తూ అన్నాడు.

"కమలమ్మా! చూడు! నన్ను-అవమానించినందుకు నువ్వూ-నీ కొడుకు అనుభవిస్తారు. నేను పగ అంటూ వస్తే త్రాచు పామునే! గుర్తుంచుకో!"

ఆగ్రహావేశాలని, అవమానాన్ని బల వంతంగా దిగమింగుతున్నట్టు కృష్ణ దవడలు బిగుసుకున్నాయి.

నిటారుగా, రాతిశిల్పంలా నిలబడి పోయాడతను!

బంధువులంతా నా వైపు విచిత్రంగా, ఆసక్తిగా చూడసాగారు. వళ్ళకి దీనికంత టికీ కారణం నేను అన్న విషయం తెలిసింది. అందరికళ్ళూ నన్ను పరీక్షించ సాగినాయి! నాకు ఒళ్ళంతా తేళ్ళు, జెర్రులు పాకినట్లయింది.

అత్తయ్యా - ఆచార్లుగారూ, తాతగారూ కృష్ణకి యిప్పటికి ఏం తొందరపడవద్దని, అవతల పెళ్ళివారు వచ్చి వున్నారని, అభాసు అవుతుందని హెచ్చరిస్తూ నచ్చ

చెప్పసాగారు. అప్పటికి రాత్రి 1 గం. అయింది. ఇంకొక పదిగంటలు! ఎలాగో అలా కళ్ళుమూసుకుంటే లగ్నం అయి పోగానే నేను వెళ్ళిపోవచ్చు! నేను వెళ్ళి పోతే అంతా సర్దుకుంటుంది. ఛీ! ఛీ! ఎంత గొడవ! యిలా అని తెలిస్తే చచ్చినా వచ్చే దాన్ని కాదు.

నా మనసంతా చేదుగా, బాధగా, అసంతృప్తిగా అయిపోయింది.

*　　　　*

ఇల్లంతా ఒక్కసారి నిశ్శబ్దంగా అయి పోయింది.

అనుకోకుండా యీ గొడవ కంతటికీ కారణం నేను కేంద్రంగా అవటంతో, నా కేమిటో ముళ్ళమీద వున్నట్టు కంపరంగా అనిపించింది.

ఎప్పుడెప్పుడు ఆ లగ్నఘడియలు కాస్తా అవుతాయా యిక్కడనుంచి వెళ్ళి పోదామా అని క్షణాలు లెక్కపెట్టుకుంటూ కూర్చున్నాను.

మర్నాడు వుదయం 10 గం.కి లగ్నం.

ఎలా తెల్లవారిందో ఆ దేవుడికే తెలియాలి. టైమ్ అంత మందకొండిగా జరగటం మునుపెన్నడూ నేను ఎరగను.

తెల్లవారు ఝామున లేవారంతా. జరగవలసిన కార్యక్రమం అంతా చకచకా జరిగిపోతోంది. ఇంట్లోవున్న చుట్టాలు వాళ్ళు రాత్రి జరిగిన గొడవకి కారణం నేను అని తెలుసుకోగానే నన్ను నఖశిఖ పర్యంతం చూడసాగారు. నన్ను చూసి కంఠాలు తగ్గించి మాట్లాడుకునేవాళ్ళు. నేను అటువైపునుంచి వాళ్ళ ప్రక్కగా వెళుతుంటే మాటలు ఆపేసి మౌనం వహించేవాళ్ళు. నా కిదంతా సలసల లాడుతున్నట్టుగా వుంది.

రాజుకి తలంటి పోసి గౌరీ పూజకి కూర్చో పెట్టారు.

వాకిట్లో మేళంవాళ్ళు వచ్చి కూర్చున్నారు.

వాళ్ళ శృతులు సరిచేసుకుంటున్న ధ్వని వినిపిస్తోంది.

రాజు తలలో పువ్వులు అలంకరిస్తున్న నాకు అక్కడికి కొంచం దూరంగా అత్తయ్య, కృష్ణ మాట్లాడుకోవడం వినిపించింది. తాతగారు కూడా అక్కడే వున్నారు.

"యింక నువ్వు నిశ్చింతగా వుండమ్మా. గోపాలం తనకి కట్నం యిచ్చిన డబ్బు నా చేతికి యిచ్చాడు. వారం రోజులు తర్వాత ఎలాగైనా తల తాకట్టు పెట్టి అయినా సరే తీర్చేస్తానని చెప్పాను."

"ఏమోరా! ఈ మూడు ముళ్లు సవ్యంగా పడి, అంతా సక్రమంగా జరిగిపోతే కొండకి పిల్లతో వస్తాను అని మొక్కుకున్నాను. ఆ శేషయ్య వెళ్ళి అక్కడ చేరాడంటే నా కేమిటో గుండెలు పీచు పీచు మంటూన్నాయి."

"నీది మరీ చాదస్తమమ్మా! ఏంచేస్తాడంటావు? వాళ్ళకి కూడ దూరపు బంధువు కాబట్టి అక్కడికి వెళ్ళి వుంటాడు. నీకా భయం ఏమీ వద్దు."




ఇంతలో ఎవరో వచ్చి కృష్ణని పిలవడంతో 'వస్తున్నా' అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

వాళ్ళ మాటలను బట్టి నేను శేషయ్యా వెళ్ళి పెళ్ళివారితో చేరాడని, ఆయన డబ్బు యివ్వకపోతే గోపాలం సర్దాడని తెలుసుకున్నాను.

తాతగారు అన్నారు

"కమలమ్మా! ఒక వేళ పెళ్ళివారు ఏదయినా సణిగినా లోపాలు వెతికినా ఎవరూ కిమ్మనకండి. అడిగిందంతా చేయండి. వాళ్ళు యే కాస్త వంక వెతికేందుకూ అవకాశం యివ్వద్దు. మనతో తగాదా పడిన వాడు కోపం వచ్చి యింటికి వెళ్ళిపోకుండ యీ శేషయ్య అక్కడ చేరటం నాకూ భయంగానే వుంది"

"ఏమిటోనండి! వాడి చెవిన కూడా యీ మాట వేయండి. వొట్టి తొందర మనిషి. కోపం అనేది వస్తే ముందూ-వెనకా చూసుకోకుండా మాట్లాడతాడు. రాత్రి కాస్త ఆయనకి నెమ్మదిగా నచ్చచెప్పినట్టయితే యింత గొడవే వుండేది కాదు" అంది అత్తయ్య.

అత్తయ్య భయం నాకు ఆధారం లేనట్టుగా అనిపించింది.

ఏదో అభిప్రాయ భేదం వచ్చిందని ఎవరైనా పీటల వరకూ వచ్చిన పెళ్ళిని చెడగొడ్తారా! చెడగొట్టగలరా అసలు.

కానీ అత్తయ్య భయం కృష్ణ అన్నట్టూ చాదస్తం కాని, నేను అనుకున్నట్టు నిరాధారం కాదని తర్వాత ఋజువైంది

ఉదయం ఫలహారాలు వెళ్ళినాయి. చాల్లేదని కబురువచ్చింది. గబగబా మళ్ళీ చేయించి పంపారు. కాఫీ బాగా లేదని, వేరేచేసి పంపమని తిప్పి గొట్టారు.

కృష్ణ ఏదో అనబోతుంటే తాతగారు-ఆచార్లుగారు వారివి వేరే చేసిపంపించారు.

లగ్నం టైమ్ దగ్గర కొస్తోంది. కానీ విడిది నుండి పెళ్ళివారు తరలి రాలేదు ఆచార్లుగారు పరుగెత్తుకుంటూ వచ్చారు

"కమలమ్మా, కృష్ణుడెక్కడ?"

"దొడ్లో వున్నాడు ఎందుకు?"

"కొంప మునిగేట్టుందమ్మా! ఒకసారి వాడు అర్జెంట్‌గా విడిదికి రావాలి."

ఆచార్లుగారు దొడ్లోకి వెళ్ళారు.

ఆయన వెంట, కృష్ణ, తాతగారు యింకో యిద్దరు పెద్దవాళ్ళు వెళ్ళారు.

పెండ్లి మండపం దగ్గర అన్ని ఏర్పాట్లు జరిగినాయి

ముహూర్తం దగ్గర పడుతోందని, యింకా జరగవలసిన తతంగం చాలా వుందని ఆలస్యం అయిపోతోందని బ్రాహ్మణులు గోల పెడుతున్నారు

అత్తయ్య, కృష్ణ విడిది నుంచి రావటం కోసం ఆత్రుతగా తిరిగి చూస్తోంది.

దాదాపు గంట తర్వాత వెళ్ళిన వాళ్ళు తిరిగి వచ్చారు

కృష్ణ ముఖం ఎర్రగా, ఆవేశాన్ని బలవంతంగా దిగమింగుతున్నట్టుగా కందగడ్డలావుంది. మిగతా వాళ్ళంతా సీరియస్‌గా వున్నారు.

తాతగారు రాగానే వుస్సురంటూ పడక్కుర్చీలో కూర్చున్నారు

ఆచార్లుగారు అప్పటికి చాలా సార్లు చెప్పి, యింకోసారి ఆఖరిసారి చెబుతున్నట్టుగా అన్నారు

"కృష్ణా! నువ్వు మంకు పట్టుపడితే లాభం లేదు! ఇంకో వెయ్యి యిస్తానను, వాళ్ళే వస్తారు."

"యింకో వెయ్యా! ఒక్క చిల్లిగవ్వ కూడా ఎక్కువ యివ్వను! యిష్టమైతే చేసుకోమను. లేకపోతే వెళ్ళిపోమను."

"వెళ్ళిపోతే మనకి అవమానం కాదుట్రా? ఆడపిల్లవాళ్ళం." తాతగారు కల్పించుకుంటూ అన్నారు.

"ఏమిటి తాతయ్యా! నువ్వు కూడా అలాగే అంటావే? అవమానం మన ఒక్కళ్ళదేనా? వాళ్ళకి లేదా? పీటల వరకూ వచ్చిన పెళ్ళి ఆగిపోతే అది వాళ్ళకి మాత్రం తల వంపులు కాదా?"

"వాళ్ళు అంత అభిమానం వున్న మనుష్యులయితే అసలు యీ తగాదా తెస్తారుట్రా?"

"అదే నేనూ చెబుతున్నాను యింత డబ్బు కక్కుర్తి మనుష్యులని, అభిమానం లేని వాళ్ళని తెలిస్తే చచ్చినా ఒప్పుకునే వాడిని కాదు యిప్పటికైనా మించిపోయిందేమీ లేదు. నాకేం సిగ్గులేదు. నా చెల్లెలు అదృష్టవంతురాలు అందుకే తప్పిపోయిందని అనుకుంటాను."

కృష్ణ విసురుగా అన్నాడు

"ఆ! అదృష్టమే! ఒకసారి పెళ్ళి తప్పిపోయిన ఆడపిల్లకి మళ్ళీ చేయాలంటే ఎంత కష్టమో తెలిస్తే నువ్విలా మాట్లాడవు?"

కృష్ణ ఆచార్లుగారి దగ్గరకి వచ్చాడు

అసలే లావాలా కుతకుత లాడుతున్న అతను భళ్ళున బద్దలవబోతున్న అగ్నిపర్వతంలా వున్నాడు.

నిస్సంకోచంగా, నిర్మొహమాటంగా, చెప్పేసాడు.

"ఆచార్లుగారూ! ఈ సంబంధం కుదిర్చింది మీరు. మా గురించి మీ కంటే యింకెవరికీ బాగా తెలియదు. మీరు వెళ్లి పిల్ల ప్రవర్తనని గురించి శంకిస్తూ వ్రాసిన ఆ ఆకాశరామన్న వుత్తరం ఎవరో గిట్టని వాళ్ళు వ్రాశారని చెప్పండి. కావాలంటే వాళ్ళని యీ వూళ్ళో ఎవరినైనా పిలిచి, నేనూ-నా చెల్లెలు ఎలాటివాళ్లమో అడగమనండి! నాకేం అభ్యంతరం లేదు! చక్కగా వచ్చి, కళకళలాడుతూ యీ పెళ్లి పూర్తి గావించుకుని లాంఛనాలతో వేడుకలతో తరలి వెళ్లమనండి. లేదంటారా, ఆ ఆకాశరామన్న వుత్తరమే వాళ్లకి ముఖ్యం అంటారా తక్షణం బండెక్క మనండి. యీ రెండూ మినహా యింకో మాట ప్రసక్తి లేదు. నేను యింకో వేయి రూపాయిలు ఎక్కువ ఎందు కివ్వాలి? యిస్తే వాళ్ల అపనమ్మకం తొలగి పోతుందా! డబ్బుతో మచ్చ మాసి పోతుందా!"

"దీని కంతటికీ ఆ శేషయ్యే కారణం." ఆచార్లుగారు సణిగాడు.

కృష్ణ ఘర్షణమన్నట్టు చూశాడు.

"శేషయ్యే కానివ్వండి లేకపోతే యింకో గోవిందయ్యే కానివ్వండి! నా కనవసరం. నాకు కావాల్సిందల్లా వీళ్ళెలాటి మనుష్యులూ అని. వెళ్లండి. మీరు వెళ్లి నేను చెప్పమన్న మాటలు చెప్పిరండి."

"కృష్ణా! తొందరపడి నిర్ణయం చేసుకోకు. కాస్త ఆలోచించుకో."

తాతగారు హెచ్చరిస్తున్నట్లుగా అన్నారు.

"యింకా ఆలోచించే దేమీ లేదు తాతయ్యా. గిట్టని వాళ్లు ఎవరో ఏదో చేసారని, అది సాకుగా తీసుకుని, యింకాస్త డబ్బు గుంజుదామని వాళ్ల వుద్దేశ్యం అయితే అది పొరపాటని మనం వెంటనే తెలియ చేయటం మంచిది."

ఆచార్లుగారు అత్తయ్య దగ్గరకి వెళ్లి చాలా తగ్గు స్వరంలో జరిగిన విషయం కాబోలు విశదంగా చెబుతున్నాడు.

అత్తయ్య వొచ్చి కొడుకు చేయి పట్టుకుంటూ అంది.

"కృష్ణా! పట్టుదల అన్ని వేళలా మంచిదికాదురా! రాజు ముఖం చూసి మాట్లాడు." అంది.

కృష్ణ తల్లివైపు చూశాడు.

దుఃఖం నీళ్లుగా సుళ్లు తిరుగుతున్న ఆవిడ కళ్లలోకి చూడగానే అతని ఆగ్రహం కాస్త సడిలింది.

నచ్చ చెబుతున్నట్టుగా, శాంతంగా అన్నాడు.

"రాజు ముఖం చూసి, దాని క్షేమం కోరే చెబుతున్నానమ్మా. యింత డబ్బు ఖర్చుచేసి, యింత ఎత్తు మనం తూగలేం అని తెలిసి కూడా, అప్పుచేసి యీ పెళ్లికి ఎందుకు ఒప్పుకున్నానమ్మా నేను? అది సుఖంగా వుండాలనే కదా! ఆ ఆకాశరామన్న వుత్తరం శేషయ్య వ్రాయించి వుంటాడని మనందరకీ తెలుసు! ఈ రోజు డబ్బు యిస్తే యిచ్చి నట్టేనా? ఏ మచ్చ లేకపోతే డబ్బు ఎందుకు యిచ్చి వుంటారు అని రేపటినుంచి దాన్ని సాధించరూ? అనుమానించరూ? నేను చాలా దూరం ఆలోచించే మాట్లాడుతున్నానమ్మా. పెళ్లి ఆగిపోతే అందరూ నవ్వుతారంటావా?

నవ్వని! ఈ రోజు కాకపోతే రేపయినా అందరికీ అసలు సంగతి తెలుస్తుంది. ఎవరో ఏదో అంటారని, భయపడతామా? చేయని తప్పు నెత్తిన రుద్దుకుంటామా!"

కమలమ్మ కొడుక్కి ఏం చెప్పాలో తెలియనట్టు నిస్సహాయంగా చూడసాగింది.

కృష్ణ పక్కకు తిరిగి "ఆచార్లుగారూ! మీరు వెళ్లి నేను చెప్పమన్నది చెప్పేసి రండి. త్వరగా వెళ్లండి." అన్నాడు.

ఆచార్లుగారు అయిష్టంగా తలవూపాడు.

తాతగారు లేచారు. "నేను కూడా వస్తానుండు." అంటూ బైలుదేరారు.

ఇంట్లో బంధువులంతా అక్కడ గుమిగూడారు.

కృష్ణ వాళ్ల ముందు నిలబడటం యిష్టం లేనివాడిలా అక్కడినుంచి వెళ్లిపోయాడు.

ఇదంతా వింటున్న నేను బ్రమ్మపడి పోయినట్టు నిలబడి పోయాను!

యింత ఘోరం ఎక్కడైనా వుందా! మనుష్యులు యింత నీచంగా, యింత స్వార్థంగా ప్రవర్తిస్తారా!

శేషయ్య కృష్ణతో అభిప్రాయ భేదం వచ్చిందని, పెళ్ళి చెడగొట్టటానికి సిద్ధం అవుతాడా! యీ కాస్త దానికే యింత వైషమ్యమా! యింత పట్టుదలా! ఏం మనుష్యులు వీళ్లు! పల్లెటూళ్ల వాళ్ళంతా అమాయకులనీ, అతి మంచి వాళ్లనీ, కల్లాకపటం తెలియని వాళ్లనీ అనుకుంటున్నాను నేను!

ఆ పెళ్లివారు మాత్రం! బుద్ధివున్న వాళ్ళేనా? సంస్కారం వున్న మనుష్యులు చేసే పనేనా యిది! విడిదిలో ఆకాశరామన్న వుత్తరం పడివుంటే మాత్రం? ముందుగా యీ సంబంధం స్థిరపరుచుకునేటప్పుడు కృష్ణ అతని కుటుంబం ఎలాటిదో తెలుసు

కోకుండానే ఒప్పుకుని వుంటారా! కృష్ణ అన్నట్టు యిదో సాకుగా తీసుకుని యింకో వెయ్యి రూపాయిలు లాగాలని ఎత్తు కాబోలు! ఛీ-ఛీ! ఏం మన స్తత్వాలు!

డబ్బు కోసం గడ్డి తినే మనుష్యుల్లా వున్నారు!

పరువూ-మర్యాదకి భయపడిపోయి అడిగిన ఆ వేయి రూపాయలూ కిమ్మనకుండా ఇచ్చేస్తారనుకున్నారు కాబోలు! కృష్ణ బాగా జవాబు చెప్పాడు!

ఇలాటి సంఘటనల్లోనే మనిషి వ్యక్తిత్వము ఎంతవరకో తెలిసేది.

నాకు అతనిపట్ల ఉన్న గౌరవాభిమానాలు రెట్టింపు అయినాయి.

కృష్ణ మొదటిసారి వెళ్ళినప్పుడు—ఆ ఉత్తరం సంగతి పట్టించుకోవద్దని, ఎలాటి అనుమానాలు లేకుండా పెళ్ళికి తరలి రమ్మని ప్రాధేయపడినట్టు అడిగాడుట! వాళ్ళు అతని మాట వినలేదు! కృష్ణ ఇంటికి వచ్చేశాడు.

ఆచార్లుగారు కృష్ణ చెప్పమన్న మాటలు చెప్పటానికి వెళ్ళాడు.

తాతగారు- ఆయన తిరిగి వచ్చారు.

వాళ్ళు అన్నమాట లేవో చెప్పారు. తర్కం హెచ్చింది. దానితో ఇరువైపులా పట్టుదల కూడా పెరిగింది.

చివరికి పెళ్ళివారే దిగి వచ్చారు. ఆచార్లుగారితో కృష్ణని ఒక్కసారి వచ్చి తమని బ్రతిమలాడితే ఉంటామని కబురుపంపారు.

కృష్ణ వెళ్ళనన్నాడు. అప్పటికే యిది వూరంతా పాకిపోయింది.

పెళ్ళివారు వెళ్ళిపోవటానికి ప్రయాణం అవుతున్నారని ఎవరో పరుగెత్తుకు వచ్చి చెప్పారు.

అత్తయ్య కృష్ణ కోసం గాలించింది. కృష్ణ అక్కడెక్కడా కన్పించలేదు.

వూళ్ళో ఎవరూ బండి కట్టలేదుట! కృష్ణారావుగారు చెబితే కానీ మేం కట్టం అన్నారుట! మూట ముల్లె సర్దుకుని కూర్చున్నారు.

శేషయ్య మనుష్యుల్నిపంపి తమ వూరి నుంచి బళ్ళని పిలిపించాడు.

ఈ స్పర్ధకి కారణం శేషయ్య అని తెలిసింది. కానీ నిన్నటివరకూ ఆత్మీయంగా ఉన్న కృష్ణకి-శేషయ్యకి ఎందుకు యీ బేధం వచ్చిందో యెవరికీ తెలియటం లేదుట. మంగమ్మగారు వచ్చి మెల్లిగా ఈ విషయాలన్నీ నా చెవిలో వూదింది.

వీరాయి వచ్చాడు. చేతిలో కఱ్ఱ నేలకి తాటిస్తూ, తాతగారితో "మా దొరగారిని ఊఁ అనమనండి. పెళ్ళి బండి ఒక్కటి కదలనివ్వం మేము! పెళ్ళి కొడుకుని కట్టేసి లాక్కువస్తాం. మా గూడెం గూడెం అంతా యిక్కడే ఉంది." అన్నాడు. వాడి ధోరణిచూస్తే పెళ్ళివారిని అలా వెళ్ళిపోనివ్వటం బొత్తిగా చాతకాని తనంలా భావిస్తున్నట్టుగా ఉంది.

"మీ దొరగారు మేం చెప్పిన మాట వింటే యింత గొడవే ఉండకపోను." అన్నాడు తాతగారు.

పెళ్ళి పందిరిలో పెళ్ళికోసం చేసిన ఏర్పాట్లన్నీ వెలవెలా పోతున్నట్టు ఎక్కడివక్కడ పడివున్నాయి!



# నాణ్యతగల వస్త్రాలు?

## హార్వే

# ట్విన్ టస్కర్

డ్రిల్‌లు . పాప్లిన్‌లు . గాబర్డీన్‌లు మొదలైనవి






మధుర మిల్స్ కంపెనీ లిమిటెడ్, మధురై.

Bensons 1335 A/I TEI

సన్నాయివాళ్ళు ఉండాలో—వెళ్ళాలో తెలియనట్టు తికమకపడుతూ కూర్చున్నారు పెళ్ళివారు వెళ్ళిపోయారని తెలియగానే అందరూ నిశ్చేష్టులయి పోయారు నా కిదంతా వూపిరాడక ఉక్కిరి బిక్కిరి అయి నట్టు, కాళ్ళూ చేతులు ఆడనట్టు అయి పోయింది

దీనికంతటికీ మూలకారణం నేనేనన్న సంగతి నన్ను వెర్రిదాన్ని చేస్తోంది

నవ్వుతూ-తుళ్ళుతూ ఆడుతూ పాడు తున్నట్టు వచ్చిన నేను, యీ యింట్లో ఇంత విషాదానికి గురి అవుతానని కల్లో కూడా అనుకోలేదు

కృష్ణ ఎక్కడికి వెళ్ళాడో ఎవరికీ తెలి యదు!

అత్తయ్య గదిలో ఏడుస్తూ కూర్చుంది చుట్టూ చేరిన ఆడవాళ్ళు తలో విధంగా వ్యాఖ్యానాలు చేస్తున్నారు

నాకు రాజు దగ్గరికి వెళ్ళటానికి కూడా ముఖం చెల్లలేదు

మనుష్యులు పంతాలు—పట్టింపులకి పోయి యింత అమానుషంగా ప్రవర్తిస్తా రని, జీవితాలతో ఆడుకుంటారని మొదటి సారిగా యదార్థంగా కళ్ళెదుట చూస్తున్న నేను నోట మాట రాని దానిలా అయి పోయాను

ఇది అమ్మకి తెలిస్తే యింకేమైనా ఉందా!

పెళ్ళి కబురు తీసుకువస్తానని, అన్నీ వినాలని ఆశగా ఎదురుచూస్తున్న నాన్న గారికి నేనేం జవాబు చెప్పను?

నా మూలంగా యీ పెళ్ళి ఆగిపోయిం దని తెలిస్తే ఆయనెంత బాధపడతారు!

12 గంటలు అయింది తాతగారు వంటకానివ్వమని బ్రాహ్మణుడితో చెప్పారు వంట చకచకా అయింది వచ్చిన బంధు వులు తోచినట్టుగా ఎంగిలిపడి లేవారు అందరూ ఎవరికివారే ప్రయాణం అయారు కొంతమంది అత్తయ్యతో చెప్పకుండానే వెళ్ళిపోయారు అందరిదగ్గరా కృష్ణ తర ఫున తాతగారు వీడ్కోలు తీసుకున్నారు

సాయంత్రం అయేసరికి యిల్లంతా నిశ్శబ్దంగా అయిపోయింది నవ్వులతో, సరదాలతో కేరింతలతో హుషారుగా ప్రతిధ్వనించాల్సిన పరిసరాలు అక్క డక్కడా అసలు మనుష్యుల అలికిడే లేనట్టు అయిపోయినాయి

కాలుగాలిన పిల్లిలా అటూ, యిటూ తిరిగిన నేను వచ్చి దొడ్లో కూర్చున్నాను నా రాక యీ యింటికి శుభసూచకం కాదేమోనన్న అనుమానం నన్ను వేధించ సాగింది ఎంత మంచి చేయాలని వచ్చినా నావల్ల వీళ్ళకి జరిగిందేమిటి? అసలు నేను రాకుండా ఉంటే పోయేది!

వచ్చినా బెజవాడలోనే కృష్ణతో మాట్లాడి వెనక్కు తిరిగి వెళ్ళిపోయినా బాగుండేది!

అత్తయ్య దగ్గరకు రెండుసార్లు వెళ్ళితే అత్తయ్య నా వైపు చూడటం యిష్టం లేనట్టు చూపులు మరల్చుకుంది! గాయ పడిన ఆవిడ హృదయం ఎంత క్షోభ పడు తోందో గ్రహించలేని మూర్ఖురాలిని కాదు!

అత్తయ్య నా వైపు ఎప్పుడు చూడలేదో, నేను యిక రాజు దగ్గరకి కూడా వెళ్ళలేక పోయాను!

నేను ఇక్కడి నుంచి వెళ్ళిపోవాలంటే కృష్ణ రావాలి! అతను వచ్చేవరకూ నేను ఉండక తప్పదు!

నా మనసు ఒడ్డునపడ్డ చేపలా గిలగిలలాడసాగింది.

చాలాసేపటినుంచీ దొడ్లో అరుగుమీద చెంపకు చెయ్యి ఆనించుకుని క్రిందకి చూస్తూ అలాగే కూర్చున్న నేను భుజం మీద ఎవరిదో చెయ్యి పడటంతో ఉలిక్కిపడి తలెత్తాను.

నా పక్కగా రాజు నిలబడి ఉంది!

రాజు ముఖాన యింకా నేను దిద్దిన కళ్యాణ తిలకం, బుగ్గన చుక్కా అలాగే ఉన్నాయి. ముఖం ఏడ్చినట్లుగా ఉబ్బి, కనురెప్పలు వాచి ఉన్నాయి.

"ఇక్కడ కూర్చున్నావేం వదినా! లోపలికిరా?" అంది.

నేను కళ్ళెత్తి రాజు ముఖంలోకి సూటిగా చూశాను.

ఆ ముఖంలో ఎలాటి మార్పూ రాలేదు. ఆ కళ్ళలో నా పట్ల కించిత్తు కూడా కోపం కన్పించలేదు. నా గుండెల మీద నుంచి పెద్దబరువు దింపుకున్నట్టయింది.

"రాజూ!" అన్నాను.

"లోపలికి రా! అమ్మకి ఫిట్ వచ్చింది. అమ్మ దగ్గర ఎవరూ లేరు. అక్కడ కూర్చుందాం."

నేను రాజు చెయ్యి గట్టిగా పట్టుకుని లోపలకి వచ్చాను.

అత్తయ్య చాపమీద పడుకుని ఉంది. కాస్త దూరంలో తాతగారు అక్కడున్న పెట్టెమీద కూర్చుని ఉన్నారు.

రాజు వెళ్ళి తల్లి తల ప్రక్కన కూర్చుంది.

నేను ఆవిడ కాళ్ళ దగ్గర కూర్చున్నాను.

అత్తయ్య ఏడుస్తోంది! ఆ ఏడుపు సన్నని దారంలా మారి నా గుండెలకి బిగించినట్టుగా నా గుండెలు విలవిలలాడసాగినాయి.

అత్తయ్య దుఃఖం నేను తీర్చలేనా! దీనికంతటికీ కారణం నేను కాబట్టి, యీ సమస్యల్ని నేను తీరుస్తాను. అత్తయ్యా నువ్వు నిశ్చింతగా ఉండు అంటూ నేను హామీ యివ్వలేనా! నా మనసంతా అయోమయంగా అయిపోయింది.

రాత్రి చాలా పొద్దుపోయింది.

వీరాయి పనిమనుష్యులతో యిల్లంతా సర్దించి వెళ్ళిపోయాడు.

ఉదయంనుంచి అటూ యిటూ తిరుగుతూ హైరానపడటంతో తాతగారికి గుండెల్లో నొప్పి వచ్చింది.

కృష్ణ ఉదయం అనగా వెళ్ళిన మనిషి అంతులేడు!

ఎంతో సంబరంగా జరుగుతుందని ఆశపడిన పెళ్ళి పోట్లాటతో ఆగిపోవటంతో పిల్లలు బిక్కముఖాలు వేసుకుని త్వరగానే నిద్రపోయారు.




అత్తయ్యకి మెలకువ వచ్చింది. కానీ చాపమీద నుంచి లేవనేలేదు. నీరసంగా అలాగే పడుకుంది.

రాజు వంట యింట్లోకి వచ్చి కాఫీ తయారు చేస్తుంటే నేను సాయం చేశాను.

రాజు తల్లి చేత బలవంతంగా కాస్త కాఫీ తాగించింది.

తాతగారు పడుకున్నారు.

రాజు అలిసిపోయినదానిలా, చాప మీద తల్లి పక్కగా ఒదిగి పడుకుంది. రాజు కళ్ళలో మాటి మాటికీ నీళ్ళు నిండుతూండటం నేను గమనించకపోలేదు.

రాత్రి చాలా పొద్దుపోయింది. చాపమీద పిల్లలపక్కగా పడుకున్న నేను ఎంత సేపటికీ నిద్ర రాకపోవటంతో లేచి దొడ్లోకి వచ్చాను. అక్కడెక్కడా దీపం లేదు.

సప్తమినాటి వెన్నెల దొడ్లో దూరంగా పడుతోంది.

పందిరి క్రింద చీకటిగా వుంది.

కాస్త నిదానంగా చూస్తే తప్ప ఎక్కడ ఏ వస్తువున్నదీ కన్పించడం లేదు. పందిట్లో కాలుపెట్టి అరుగు మీద కొద్దిసేపు కూర్చుందామని అటువైపు వెళ్తున్న నేను హఠాత్తుగా ఆగిపోయాను.

ఎదురుగా, ఎప్పుడూ తాతగారు కూర్చునే పడకకుర్చీలో కృష్ణ పడుకుని ఉన్నాడు!

అతను మేలుకుని వున్నాడో, లేక నిద్ర పోతున్నాడో, లేక దీర్ఘాలోచనలోవున్నాడో కానీ, నా రాకను గమనించలేదు.

కళ్ళమీద రెండు చేతులూ ఆనించుకుని పడుకుని ఉన్నాడు.

అతను పడుకున్న తీరు నిద్రపోతున్నట్టుగా లేదు!

కొంపదీసి అతను కూడా ఏడవటం లేదు కదా?

నాకు భయం వేసింది! గుండెలు దడ దడ లాడినాయి!

పాపిష్టిదాన్ని! ఒక్కసారి వీళ్ళందరి మనసుల్లో ఎంత విషాదం గుమ్మరించాను? అనిపించింది.

ఒక అడుగు వెనక్కు వేసి వచ్చినంతగా నిశ్శబ్దంగా వెనక్కు వెళ్ళిపోదామని అనిపించింది. సగం వెనక్కు తిరిగాను కూడా!

కానీ నా మనసు ఒప్పలేదు. నా కాళ్ళు నేను చెప్పినట్టు వినలేదు!

నాకు తెలియకుండానే మెల్లగా అతని దగ్గరకి వచ్చి ఆగాను!

ఒక్కక్షణం అలసటగా, నిస్పృహగా పడుకునివున్న అతనివైపు చూస్తూ అలాగే నిలబడ్డాను!

అతనిపట్ల ఆత్మీయత, అనురాగం, అభిమానం, స్నేహం ఒక్కసారిగా ఎన్నెన్నో భావాలు వువ్వెత్తున లేచి నన్ను ముంచివేసినాయి.

అప్రయత్నంగా నాచేయి అతని తల మీద ఆనించాను.

అతను ఎంత పరధ్యానసగా వున్నాడో, అంతెత్తున అతను అలా వులిక్కిపడడంతోనే నా కర్థమైంది.

చటుక్కున కళ్ళు తెరిచిన అతను నన్ను చూడగానే "నువ్వా!" అన్నాడు.

నేనేం మాట్లాడలేదు.

అమ్మయ్య! రాజూ, అత్తయ్యలా యితనుకూడా ఏడవటం లేదు.

కానీ ఏడుపుకంటేకూడా భారంగావున్న బాధ అతని ముఖంలో తొంగిచూస్తు కన్పించింది.

"నిద్రపోలేదా నువ్వు?" అని అడిగాడ నన్ను.

నేను దానికికూడా జవాబు చెప్పలేదు.

కృష్ణ మెల్లగా తన తలమీద నుంచి నాచేయి తీసేసాడు.

అతనితో ఎన్నెన్నో చెప్పాలని పిస్తోంది! ఎన్నో మాటలు ఒక్కసారిగ గొంతులో వుక్కిరిబిక్కిరి అవుతున్నాయే తప్ప ఒక్కటీ పెగిలి యివతలకి రాలేదు. తల దించుకుని పయిటచెంగు చేతిలోకి తీసుకుని దాని దారాలు లాగుతూ నిలబడి పోయాను. జరిగినదానికంతటికీ నేనెంత బాధపడుతున్నానో, నోటితో చెప్పకుండానే అతను గ్రహించివేస్తే ఎంత బాగుండు అనిపించసాగింది.

కృష్ణ తలక్రింద రెండు చేతులూ పెట్టుకుని, ఒక్కక్షణం తదేకంగా నా వైపే చూడసాగాడు. తర్వాత అడిగాడు.

"ఎప్పుడు వెడుతున్నావు నువ్వు?"

"నువ్వు ఎప్పుడు వెళ్ళమంటే అప్పుడు."

కృష్ణ సమాధానం చెప్పలేదు. అతని కళ్ళు నామీద నిల్చినా, ఆలోచన్లు మళ్ళీ ఎక్కడో దూరంగా వెళ్ళిపోయాయని గ్రహించాను. నేను నిష్ఠూరంగా అన్నాను

"నిన్ననే నన్ను నువ్వు పంపివుంటే యింత అనర్థం జరిగివుండేది కాదు. నీ మాట వినకుండా నేను బలవంతంగా వెళ్ళి

పోయినా బాగుండేది. కానీ-కానీ యిది యిలా పరిణమిస్తుందని, యింత జరుగుతుందని నేను అనుకోలేదు. నా రాక మీ అందరికీ యిలాటిబాధ తెచ్చి పెడుతుందని అనుకుంటే అసలు వచ్చేదాన్నే కాదు. బెజవాడ నుంచే తిరిగి వెళ్ళిపోయేదాన్ని."

కృష్ణ మౌనంగా నా సంజాయిషీ విన సాగాడు. నేను పుదయంనుంచీ నా మనసులో పడుతున్న బాధంతా కక్కేసాను.

"నిజంగా చెబుతున్నాను! నేను యిక్కడకి రావడం పొరపాటు! ఒకవేళ వచ్చినా సుందరి యిక్కడ వుండగా, నీతో అలా చనువుగా మసలటం తెలివి తక్కువతనం! నేను యిక్కడినుంచి వెళ్ళినా నాకు మనశ్శాంతి వుండనే వుండదు. నా మూలంగా యీ పెళ్ళి ఆగిపోయిందనే బాధ నన్ను నిత్యం వెంటాడుతూనే వుంటుంది నాన్నగారికి యిది తెలిస్తే నన్ను ఎన్ని పీవాట్లువేస్తారో తెలుసా?"

"మామయ్యకి యిది తెలియాల్సిన పని ఏముంది?" మామూలుగా అన్నాడతను.

"తెలియకుండా ఎలా జరుగుతుంది?"

"సరే! దీనికంతటికీ నువ్వు ఒక్కదానివే బాధ్యురాలివి కావుగా! నాకూ యిందులో భాగం వుందని చెప్పు మామయ్యతో."

నేను తల అడ్డంగా తిప్పాను.

"ఉహూ! నీకేం భాగం లేదు నేనే నిన్ను కవ్వించాను! పిచ్చివేషాలు వేసి, పిచ్చిపనులు చేసి నిన్ను రెచ్చగొట్టాను! నాకు పడాల్సిన శిక్ష నీకు పడటం చాలా అన్యాయం. నాకు తెలుసు! నా దారిన నేను వెళ్ళిపోతాను. మీరు యీ అవమానాన్నుంచి కష్టంనుంచి తేరుకోవాలంటే ఎన్నిరోజులు పడుతుందో! ఎంత యిబ్బంది పడాల్సి వస్తుందో!"

"నువ్వు అట్లా ఏమీ అనుకోవద్దు. ఏది ఎలా జరగాలనివుంటే అలా జరుగుతుంది. ఒకరు కారణం అనుకోవటం ఒట్టి భ్రమ!"

నా కెందుకో ఒక్కసారి అతని దగ్గరగా వెళ్ళి అతన్ని హత్తుకు పోవాలని అనిపించింది. కాకపోతే అతని తలని నా గుండెలకి అదుముకుని, చల్లటి, స్నేహపూరితమైన మాటలేవైనా చెప్పి, అతనిలో కన్పిస్తున్న ఆ అలసటని మాయం చేయాలనిపించింది. కానీ కృష్ణలో రాయిలా కఠినంగా కన్పిస్తున్న గంభీరత్వం నన్ను దూరంగానే నిలబెట్టి యీ రెండూ సాధ్యం కానివ్వలేదు ఇద్దరం మౌనంగా చాలాసేపు అలాగే వుండిపోయాం. నా మెదడు వేగంగా, చురుగ్గా ఏవేవో ఆలోచిస్తోంది.

కొద్ది సేపయింతర్వాత కృష్ణ అన్నాడు.

"వెళ్ళి నిద్రపో మీనా!"

"నువ్వు నాకో వాగ్దానం యివ్వాలి." హఠాత్తుగా తలెత్తుతూ అడిగాను.

"ఏమిటది?"

"ముందు నా మాట చెల్లిస్తాననిచెప్పు."

"అది నీకూ-నాకూ యిబ్బంది కలిగించకుండా వుంటే అలాగే."

"రాజుని నాతో తీసుకువెడతాను! నాన్నగారితో యిదంతా చెప్పేస్తాను! నా మూలంగా దాని పెళ్ళి తప్పిపోయింది కాబట్టి, యింతకంటే మంచి సంబంధం తెచ్చి దాని పెళ్ళి జరిగేలా చూస్తాను."

అలసటగావున్న అతనిముఖంలో చిరునవ్వు మెరిసింది.

"నీ మొహం!" అన్నాడు.

"లేదు! నేను నిజంగా సీరియస్‌గా చెబుతున్నాను! నువ్వు నా వెంట రాజునిపంపే వరకూ నేను యిక్కడినుంచి కదలను."

"పోనీ రాజు పెళ్ళి అయేవరకూ నువ్వే యిక్కడ వుండిపోకూడదూ!" అతని కళ్ళలోకి కొద్దిగా కొంటెతనం వచ్చింది.

"ఉహుఁ! నువ్వు యిది నవ్వులాటగా తీసేయవద్దు. రాజుకేం ఫర్వాలేదు! నీ చెల్లెల్ని నీ కంటే ఎక్కువ ప్రాణంగానే చూసుకుంటాను నేను! రాజుకి మా యింట్లో ఏ లోటూ రానివ్వను. నువ్వు ఈ విషయంలో మాత్రం నామాట తీసేయవద్దు."

కృష్ణ నా వైపు విచిత్రంగా చూసాడు.

"దయయుంచి ఆ మంకుపట్టు మాత్రం పట్టకు! యిప్పుడు ఈ జరిగిన దానికంటె, నన్ను యింకా పెద్ద యిబ్బందిలో తోసిన దానివి అవుతావు."

నేను ఒక అడుగు ముందుకు వేసాను. అతనిచెయ్యి నా చేతిలోకి తీసుకుంటూ అడిగాను.

"ఒక్కమాట అడుగుతాను. నిజం చెప్పు. నేను నీకు ఆత్మీయురాలిని అవునా కాదా?"

"దానికి దీనికీ సంబంధం లేదే!"

"ఎందుకు లేదు? తప్పకుండా వుంది. నేను యిది అడుగుతున్నది నా కోసం, రాజుకోసం కానేకాదు. నాకోసం! నా తృప్తి కోసం! కావాలంటే మళ్ళీ త్వరగా పంపేస్తాను. నామాట కాదనకు! కాదన్నావంటే ఏం చేస్తానో తెలుసా?"

కృష్ణ నావైపు ప్రశ్నార్ధకంగా చూసాడు.

"నువ్వన్నమాటే నిజం చేస్తాను! రాజు పెళ్ళికోసం యిక్కడవుండే ప్రయత్నిస్తాను. దాని పెళ్ళి అయేవరకూ యిక్కడనుంచి కదలనే కదలను! అమ్మా-నాన్నా ఏమన్నాసరే! చెప్పు! సమాధానం యివ్వు నాకు! నాతో రాజుని నేను కోరినట్టు పంపిస్తావా? లేక నన్నే యిక్కడ వుండిపొమ్మంటావా?"

కృష్ణ నవ్వాడు.

అందమైన అతని పలువరస చీకట్లో మెరిసింది.

"నువ్వు మంచిదానివే! నిజంగానే నా ముక్కుకి తాడు పోడుస్తున్నావు." అతని నవ్వు చూసిన తర్వాత నాకు కొంచం ధైర్యం వచ్చింది.

దాదాపు గంట బ్రతిమలాడి, వాదించి, కోపగించుకుని, అలిగి, పోట్లాడి, చివరికెలాగైతేనేం రాజుని నాతో తీసుకువెళ్ళేలా అతనిచేత ఒప్పించగలిగాను.

అతని అంగీకారం తీసుకున్నతర్వాత నాకు కాస్త ధైర్యం వచ్చింది. నేను తప్పుచేసానని వుదయంనుంచి నా మనసు చుట్టూ గుదిబండలా భారంగా భావిస్తున్న బరువు తొలిగినట్టయింది. (సశేషం)

Published by D.H. Rao, at No.1 Arcot Road, Madras-26.
Printed by him at Kranti Press,
12, Francis Joseph Street, Madras-1
Controlling Editor: Sri "CHAKRAPANI"